# చారిత్రక కాలసూచి





సంకలనకర్త
జె. రామచంద్రా రెడ్డి

V.R.



# చారిత్రక కాలసూచి





సంకలనకర్త

జె. రామచంద్రా రెడ్డి

V. R. [illegible]

వే. గ్రం॥ సకు బహుమతి

2 8405/182

# ప్రవేశిక

భారత దేశపు చరిత్రలోని వివిధ కాలాలను తెలియజేయు సమాచారం ముఖ్యముగా శాసనములపై ఆధారపడియున్నది. అట్టి శాసనములు మనకు అశోకచక్రవర్తి కాలంనుంచి మాత్రమే లభిస్తున్నవి. దేశంలో నలుమూలలా లభించే వివిధశాసనములు క్రోడీకరించి వాటిని పరిశోధకులచే పరిశీలింపజేసే కార్యభారాన్ని ప్రభుత్వమే నిర్వహించే యడల యిలాంటి గ్రంథం కొంతవరకైనా ఒకరూపాన్ని ధరించగలదు. యింతవరకు కొంతమంది వ్యక్తులు మాత్రమే తమకున్న అవకాశాలను పురస్కరించుకొని తమకు లభ్యమయిన శాసనాలను పరిశీలించి వాటి సారాంశాలను వ్యాస రూపకముగాను గ్రంథరూపకముగానూ ప్రకటించటం మాత్రమే జరుగుతూవచ్చినది. అటువంటి వ్యాసములను గ్రంథములను అమితశ్రమతో పరిశీలించి వాటిల్లోని ప్రముఖఘట్టములను ఆయా కాలములతో సేకరించటం మాత్రమే నేను చేసినపని. అయితే యీ సందర్భంలో ఒకగొప్పవైవిధ్యాన్ని ఎదుర్కొనవలసివచ్చినది. ఒకఘటనను తీసుకొన్నపుడు ఒకేకాలము ఒకేవిషయముతో కాక నలుగురు నాలుగు నాలుగు రకములుగా కాలభేదములతోనో లేక విషయభేదములతోనో తెలియజేస్తున్నపుడు అందులోఏదిసరైనది? ఏదిసరికానిది? అని నిర్ణయించుకొనుటలో చాలాతికమక పడి ఒక్కొక్క విషయాన్ని తేల్చుకొనేటందుకు ఎక్కువకాలాన్నీ ఎక్కువశ్రమను వినియోగించవలసి వచ్చినది. అయినప్పటికీ యీ విషయంలో పూర్తిగా సఫలుడనయ్యానని చెప్పలేక

పోతున్నాను. కానీ అలాంటిసందర్భాలు ఏ కొద్దిగా మాత్రమో ఉన్నాయి. ఎక్కువభాగం పరిశోధకులందరియొక్క ఏకగ్రీవనిర్ణయాధికారాన్ని పొందియున్నవని తెలియజేయుటకు సంతసిస్తున్నాను. వైవిధ్యములతో కూడుకున్న విషయములు యింకా ఏవైనావుంటే పెద్దలైనవారు వాటినితగు అధారములతో నాకు అందించే యడల వాటిని సహస్రాభివందనములతో స్వీకరించి సంస్కరించుకొనగలనని మనవిచేసుకుంటున్నాను.

యీ గ్రంథం రాజకీయరంగంలో పనిచేయువారికి ఉపాధ్యాయులకు విద్యార్థులకు ఎక్కువ ఉపయోగకరమైనదిగావుండగలదనీ సాధారణప్రజలకు కూడా చారిత్రకానుభవాన్ని సులభపద్ధతిలో చాలా త్వరగా అలవడజేయగలదనే సంకల్పంతోపడిన నా యీ శ్రమకు విలువను ఆంధ్ర పాఠకలోకం ప్రసాదించి యీ గ్రంథం మునుముందు విస్తృతరూపాన్ని ధరించగలందులకు సహకరించగలరని విశ్వసిస్తున్నాను.

అడిగినంతనే ఉదారభావంతో కొన్నిసలహాలొసంగి ప్రూఫ్‌ను సరిదిద్దు కార్యభారాన్ని స్వీకరించి నిర్వహించిన మిత్రులు శ్రీ ఆర్. రామచంద్రారెడ్డి గార్కి కృతజ్ఞతాభివందనములు.

జె ఆర్. రెడ్డి.
8-1-59.

# చారిత్రక కాలసూచి

1000 కోట్లు సంవత్సరాల క్రితమే మనము నివసిస్తున్న భూమి అవతరించివుండాలని రష్యాలోని సముద్ర తత్వశాస్త్రజ్ఞుడు ప్రొఫెసర్ లేవ్ జెంకెవిచ్. మహాసముద్రాల అడుగు భాగంలోని పదార్థాలను పరిశోధించి, తెలియజేస్తున్నాడు. యిది సరైన అంచనాయేనని ఆయా భావన.

500 కోట్లు సంవత్సరాలనాడు, భూమి అవతరించిందని యురేనియం పదార్థపరిశోధకులు అభిప్రాయ పడుతున్నారు.

199 584 5052 భారతీయ ప్రాచీనగణిత శాస్త్రాన్ననుసరించి, ప్రాణికోద్భవించేందుకు మూలతత్వ స్వరూపమయిన పంచభూతాత్మక గుణయుక్తమయిన భూమిఅవిర్భవించిన కాలమది. యీ కాలాన్ని యుగాలుగా విభాగించినప్పుడు, కృతత్రేతా ద్వాపర కలియుగ చతుష్టయమును 4320000 సంవత్సరాలు కలిసి ఒకమహాయుగ మనబడును. అలాంటి 71 మహాయుగములుకలిసి 306720000 ఒకమన్వంతరంఅవుతుంది. యిలాంటి మన్వంతరములు ఆరు గడచిపోయాయి. ప్రస్తుతం 7 వ మన్వంతరంలో 15520000 ఏండ్లు గడచి ప్రస్తుతం కలియుగంలో 5052 ఏండ్లు గడచిపోయాయి. అంటే యీ సంపూర్ణ 7వ మన్వంతరంతో కలిసి రెండువందల కోట్ల ఏండ్లను కొద్దితక్కువ అవుతూవుంది. విశేషమేమంటే ఆధునిక విజ్ఞానంకూడా, దాదాపు రెండువందల కోట్ల ఏండ్లనాడు ద్రవరూపంలో నున్న ఒకవంటి (నీహారము) పదార్థము ఘనీభవించి భూమిగా ఏర్పడి వుండవచ్చునన్నిర్ణయానికి వస్తూవుంది.

200–130 కోట్ల ఏండ్ల మధ్య కాలమంతా ఆరంభయుగం. యీ దశలో భూమి, నీరు మాత్రమే ఏర్పడి యుండెడివి.

130–80 కోట్ల ఏండ్ల మధ్య కాలంలో కూడా ప్రాణులు ఆవిర్భ వించలేదు. కానీ, ప్రాణి ఉత్పత్తికి అవసరమైన గుణాత్మక మార్పులు యీ భూమి, నీటిలో కలిగాయి. వాతావరణం పరిపక్వదశను చేరుకుంది.

50 కోట్ల ఏండ్లనాటి కాలాన్ని పురాణజీవయుగం అనిచెప్పవచ్చు లోతులేని సముద్రములు, నాచు నీటిక్రిములు, సముద్రపుచేపలు వగైరాలు ఉత్పన్నమయివుండవచ్చు.

20 కోట్ల ఏండ్లు మధ్యజీవయుగం, మొట్టమొదట నేల మొక్కలు, కప్పలు, బల్లులు, తాజేల్లు వగైరాలు ఉత్పన్నమయాయి. దీన్నే కూర్మ యుగమని చెప్పవచ్చు.

8 కోట్ల ఏండ్లు తుప్పలు, తాల్లు, పాములు, మొసల్లు, రనోపార్లు, గింజలచెట్లు వగైరాలంతా ఉత్పన్నమయామని చెప్పవచ్చు.

4 కోట్ల ఏండ్లు – మహాగిరులు, పక్షులు, వరాహ సంబంధసస్తన జంతువులు, గడ్డి, అడవిచెట్లు వగైరాలంతా ఉత్పన్నమయాయి. యీ కాలాన్ని, నవజీవయుగము అనిపిలుస్తారు.

2 1/2 లక్షల ఏండ్లనాడు ఆధునికయుగము లేకనారసింహ్మయుగము అని పిలుస్తారు. గచ్ఛన్న రవానరులు, ఛింపాంజి గొరిల్లా, వాడిల్బర్గ నరుడు, ఉదయునరుడు, నియాండర్తలకు వగైరా పరివర్తనలు జరిగి ఆదిమ మానవుడు ఆవిర్భవించేందుకు ఆసన్నకాలమిది.

1 లక్ష 50 వేల ఏళ్ల మధ్య కాలం గుహావాసులు, రొడేసియనులు, తయారయాతుఅంటే ఆదిమమానవుడు తయారయాడన్న మాట (మాటలు లేవు).

30 వేల ఏళ్ల నాటికాలాన్ని నరయుగం అనిపిలుస్తారు. యిదిపూర్వ శిలాయుగం. వేట వ్యవసాయారంభము, జాతరలు, పనిముట్లు వగైరాలంతా ఉత్పన్నమయాయి.

15 వేల ఏళ్ల నాటికాలాన్ని సూర్యశిలాయుగం అంటారు. సుమే రియనలు, ఆర్యులు వగైరా జాతులు కూడా ఏర్పడినాయి.

10, 8 వేల ఏళ్ల నుంచి చారిత్రిక యుగమని పిలుకబడుతూవుంది. అంటే యీ కాలంనుంచీ మానవజాతి చరిత్రను మనం ఊహించవచ్చు.

100,000,0 ఏళ్లనాడు, భూస్థితి గుణాత్మక పరిపక్వతచెందిన పంచభూతాలు కలిగియుండి సూక్ష్మజీవరాసులకాలంనాటికే గడిచిపోయిందని, మానవపరివర్తనకు అనుకూలించే జీవికూడా ఉత్పన్నమయిందనీ, అయిదులక్షల ఏళ్లనాటికే పరిపక్వతచెందిన మానవ అస్తిత్వం ఏర్పడిందనీ అంటే మానవాకారపు మృగజాతి ఆవిర్భవించిందనీ, కొంతమంది వైజ్ఞానికలు తమ అభిప్రాయాన్నిస్తున్నారు.

100,00 ఏళ్ల నాటికి మానవుడు నాగరికుడయ్యాడు. అంటే గుహాంతర్భాగాలలోనూ, చెట్లకొమ్మలపైన మాత్రమే నివసించటంపోయి, మైదానప్రదేశాల్లో నివసించటము, మాటలాడటము కలిసికట్టుగా జీవించటము ద్వారా విజయాలను సాధించాడు. యీ రెండు అభిప్రాయాలు కూడా కొద్ది తేడా అనుసరించినప్పటికీ పైవాటితో కలుస్తూనే వున్నాయి.

“10 లేక 8 వేల సంవత్సరాల క్రితమే ఆర్యులు భారతదేశానికి వచ్చారనీ 7–8 వేల సం॥ ప్రాంతంలో వేదరచన జరిగిందనీ 5.6 వేల సం॥ ప్రాంతంలో రామరావణ యుద్ధంజరిగిందనీ 3 వేల సం॥ ప్రాంతంలో మహాభారత యుద్ధంజరిగిందనీ విషయాలను అంటే 1920 ప్రాంతం వరకు భారతీయశాస్త్రజ్ఞులు, విశ్వసించేవారు. యిదేవిశ్వాసాన్ని కలిగినవారు నేడుకూడా లేకపోలేదు. కాని యిటీవలి చారిత్ర పరిశోధకులు కొంతమంది 5 లేక 6 వేల సం॥ ప్రాంతంలో ఆర్యులు భారతదేశానికి వచ్చారనీ 2000–2500 మధ్యకాలంలో రామరావణ యుద్ధంజరిగిందనీ, 1000–1500 మధ్యకాలంలో మహాభారత యుద్ధం జరిగిందనీ అభిప్రాయపడుచున్నారు. “ఆర్యులు భారతదేశం ప్రవేశించక పూర్వం ప్రాచీన భారతవాసులు, 6 లేక 8 వేల సం॥రాల మధ్య గొప్ప సంస్కృతి సభ్యతలను కలిగివుండినారనే విషయం పౌరాణిక సాహిత్యం స్పష్టంచేస్తూవుంది. పౌరాణిక సాహిత్యాధారాలే కాక, హరప్ప, మొహంజదరో అడిచనలూరు వగైరా ప్రదేశాలలో లభ్యమవుతున్న ప్రాచీన నగరశిధిలావశేషాలద్వారా కూడా యీ విషయం స్పష్టమవుతూవుంది. వీరు చాలాకాలంనుంచి స్థిరనివాసులుగావుండటమే యీ అభివృద్ధికి కారణం. వైద్యరంగంలో వీరు సాధించిన ఘనవిజయాలు మనకు ఆర్యులరచనలనుంచే తెలియవస్తాయి. రామరావణయుద్ధానికి పూర్వమే ఆర్యఋషులు కొంతమంది, ప్రముఖంగా విశ్వామిత్ర, భర

ద్వాజ అగస్త్య వగైరాలు ఆర్యేతర ప్రదేశాలు (దక్షిణభారతదేశం) సంచరించి ఆర్య ఆర్యేతరుల మధ్య సుహృద్భావ పూరిత వాతావరణాన్ని కల్పించేందుకు కృషి చేశారు.

6776 మహాభారత యుద్ధకాలమనీ అంతకు పూర్వం 3460 ఏండ్ల నాటివాడు మనువుఅనే విషయాన్ని పురాణాలు సూచిస్తాయి.

3101 ఏళ్ల నాడు కలియుగారంభమయింది.

5000 యీ కాలపు నాటి రాతిపరికరాలు. హిమాలయ పర్వత శ్రేణులలో జమ్మూకు ఉత్తరముగా జరిగిన త్రవ్వకాలలో దొరికినవి రాతియుగంలోని ప్రజలు కొంతమంది యిక్కడ నివసించి చక్కని రాతిపని ముట్లు తయారుచేస్తూవుండినట్లు తెలియవస్తూవుంది.

“మహాభారతయుద్ధ అధినేతఅయిన రాజా యుధిష్ఠిరుని (ధర్మరాజు) తో ద్వాపరయుగాంతమయి కలియుగారంభమవుతుంది. ధర్మరాజు మొదలుకొని ఆర్యావర్తాన్ని పరిపాలించిన రాజన్యుల పేర్లు, వారి పరిమితకాలాన్నీ 1782 లో వ్రాయబడిన ఒక ప్రాచీన యితిహాస గ్రంథాన్నుండి “హరిశ్చంద్ర చంద్రిక” అను వార్షిక పత్రికలో ప్రచురించబడింది. యిందులో మహారాజా యశపాలుని వరకు ధర్మరాజునుంచి పరిపాలించినవారు మొత్తం 124 మంది, 4157 సం॥ 7 నెల 4 దినాలు పరిపాలించారు.

| సం॥ నె॥ ది॥ | |
|---|---|
| 36– 8–25 | రాజాయుధిష్ఠిర (ధర్మరాజు) |
| 60– 0– 0 | పరీక్షిత్తు |
| 84– 7–23 | జనమేజయుడు. |
| 82– 8–22 | రాజా అశ్వమేధుడు. |
| 88– 2– 8 | రెండవ రాముడు. |
| 81–11–27 | ఛత్రమల్లుడు. |
| 75– 3–18 | చిత్రరథుడు. |
| 75–10–24 | దుష్టశైల్యుడు. |
| 74– 7–21 | రాజా ఉగ్రసేనుడు. |
| 78– 7–21 | రాజా శూరసేనుడు. |

69– 5– 5 భువనపతి.
65–10– 4 రణజిత్.
64– 7– 4 ఋక్షత్.
62– 0–24 సుఖదేవ్.
51–10– 2 నరహరిదేవ్.
42–11– 2 సుచరితుడు.
58–10– 8 రెండవ శూరసేనుడు.
55– 8–18 పర్వతసేనుడు.
52–10–10 మేధావి.
50– 8–21 సోనచీరుడు.
47– 9–20 భీమదేవుడు.
45–11–23 నృహరిదేవుడు.
44– 8– 7 రాజా పూర్ణమల్లుడు.
44–10– 8 కరదజీవుడు.
50–10– 8 అలంభికుడు.
38– 9– 0 ఉదయపాలుడు.
40–10–16 భువనమల్లుడు.
32– 0– 6 దమాతురుడు.
58– 5– 8 భీమపాలుడు.
48–11–11 క్షేమకుడు.

1770–11–10 ఏండ్లు యీ 30 మంది రాజులు పరిపాలించారు. అటు తర్వాత క్షేమకుని ప్రధానమంత్రి విశ్రవుడు క్షేమకుని సంహరించి రాజు అయ్యాడు. తర్వాత

17– 3– 2 విశ్రవుడు
42– 8– 2 పురసేనుడు
52–10– 7 వీరసేనుడు
47– 8–23 అనంగశాయి
35– 9–17 హరిజిత్
44– 2–23 సరనుసేనుడు
30– 2–21 సుఖపాతాల్

| | |
|---|---|
| 42– 9–24 | పద్మిత్రుడు |
| 32– 2–14 | సజ్జుడు |
| 27– 3–16 | 3వ, దురచూడుడు |
| 22–11–25 | అమీపాలుడు |
| 25– 4–12 | దశరథుడు |
| 31– 8–11 | వీరసాలుడు |
| 47– 0–14 | వీరపాలసేనుడు |

"విశ్రవునివంశం 500 సం॥ 3 నె॥ 17 ది॥ పరిపాలించిన తర్వాత రాజా వీరపాలసేనుని ప్రధానమంత్రి వీరమహుడు వీరపాలుని సంహరించి రాజ్యాన్ని ఆక్రమించుకున్నాడు. అటు తర్వాత॥

| | |
|---|---|
| 35–10– 8 | వీరమహుడు |
| 27– 7–19 | అజితసింహుడు |
| 28– 3–10 | సర్వదత్తుడు |
| 15– 4–10 | భువనపతి |
| 21– 2–13 | వీరసేనుడు |
| 40– 8– 7 | మహీపాలుడు |
| 26– 4– 3 | శత్రుబ్బాలుడు |
| 17– 2–10 | సంఘరాజ్ |
| 28–11–10 | తేజపాలుడు |
| 37– 7–21 | మణిక్‌చంద్ |
| 42– 5–10 | కామసేనుడు |
| 8–11–13 | శత్రుమర్దనుడు |
| 28– 9–17 | జీవనలోకుడు |
| 26–10–10 | హరిరావ్ |
| 35– 2–20 | రెండవ వీరసేనుడు |
| 23–11–13 | ఆదిత్యకేతువు |

యీ 445 సం॥ 5 నె॥ 3 ది॥ 16 మందిరాజులుపాలించిన అనంతరం మగధదేశాన్ని పాలిస్తున్న ఆదిత్యకేతువును ప్రయాగరాజైన ధరధర అనేవతను సంహరించి రాజ్యాన్ని ఆక్రమించాడు అటు తర్వాత

42– 7–24 రాజాగంగసుడు
41– 2–29 రాజామహర్షి
50–10–19 సనరచ్చి
30– 3– 8 మహాయుద్ధ
28– 5–25 మురినాధుడు
45– 2– 5 జీవనరాజు
47– 4–28 రుద్రసేనుడు
52–10– 8 ఆకీలకుడు
36– 0– 0 రాజపాలుడు

యీ వంశం 374 సం॥ 11 నె॥ 26 ది॥ పాలించిన తర్వాత రాజపాలునిసామంతుడు, మహీనపాలుడు రాజపాలుని సంహరించిరాజ్యాన్ని పాలించాడు. యితను 14 సం॥ పాలించినఅనంతరం ఉజ్జయినిని పాలిస్తున్న (అవంతి) రాజా విక్రమాదిత్యుడు మహాపాలుని సంహరించి రాజ్యాన్ని ఆక్రమించాడు. విక్రమాదిత్యుని శాలివాహన (ఉమరావు) సముద్రపాలయోగి (పెదకరాజు) జయించిరాజ్యాన్ని హస్తగతంచేసుకున్నాడు అటుతర్వాత యితర వంశం.

54– 2–20 సముద్రపాలుడు
36– 5– 4 చంద్రపాలుడు
11– 4– 4 మహాయపాలుడు
27– 1–29 దేవపాలుడు
18– 0–20 నరసింహపాలుడు
27– 1–28 సోమపాలుడు
22– 3–25 రఘుపాలుడు
27– 1–17 గోవిందపాలుడు
36–1)–13 అమృతపాలుడు
12– 5–27 బలీపాలుడు
13– 8– 4 మహీపాలుడు
14– 8– 4 హరీపాలుడు
11–10–13 సీసపాలుడు (యితనినే చరిత్రలో భీమపాలుడని కూడా వ్యవహరిస్తారు)

17–10–19 మదనపాలుడు
16– 2– 2 కర్మపాలుడు
24–11–13 విక్రమపాలుడు

యీ వంశం 372 సం॥ 4 నె॥ 27 ది॥ పాలించిన అనంతరం పశ్చిమాధినేత అయిన మలుఖచందు బోహరా దాడిచేసి విక్రమపాలుని సంహరించి యింద్రప్రస్థాన్ని ఆక్రమించాడు. తదనంతరం

54– 2–10 మలుఖచందు.
10– 0– 5 అమీనచందు (యితనే చరిత్రలో మానిక్ చందు అని పిలువబడింది)
13–11– 8 రామచందు
14– 9–24 హరిచందు
10– 5– 4 కళ్యాణచందు
16– 2– 9 భీమచందు
26– 3–22 లోపచందు
31– 7–12 గోవిందచందు
1– 0– 0 రాణీ పద్మావతీ

యీ వంశం 10 మంది మొత్తం 191 సం॥ 1 నె॥ 16 ది॥ పాలించిన అనంతరం గోవిందచందు భార్య రాణీపద్మావతి నిస్సంతానంగాచనిపోవటం మూలాన రాజముఖులు ఆలోచించి హరిప్రేమ లేక వైరాగ్యఅను నీతనిని సింహాసనంపై కూర్చుండబెట్టారు. అతని వంశం.

7– 5–16 హరిప్రేమ - వైరాగ్య.
22– 2– 8 గోవిందప్రేమ
1– 7–28 గోపాలప్రేమ

యీ వంశంలో 4రు మొత్తం 50 సం॥ 21 ది॥ పాలించిన తర్వాత రాజా మహాబాహు రాజ్యత్యాగంచేసి, అరణ్యావాసం వెళ్లిపోయాడు. యీ సమాచారాన్ని విని బెంగాల్‌ను పాలిస్తున్న ఆధీసేనుడు యింద్రప్రస్థానికివచ్చి, రాజ్యపాలన ఆరంభించాడు. తర్వాత

18– 5–21 రాజా అగ్నిసేనుడు.
12– 4– 2 విలావలసేనుడు.
15– 7–12 కేశవసేనుడు.
12– 4– 2 మాధవసేనుడు.
20–11–27 మయూరసేనుడు.
5–10– 9 భీమసేనుడు.
4– 8–21 కళ్యాణసేనుడు.
12– 0–25 హరిసేనుడు.
8–11–15 క్షేమసేనుడు.
2– 2–29 నారాయణసేనుడు.
26–10– 0 లక్ష్మిసేనుడు.
11– 5–19 దామోదరసేనుడు.

యీ వంశం 12 మంది 151–11–2 ఏండ్లు పాలించిన తర్వాత రాజా దామోదరసేనుడు, తన సైన్యాధిపతిని అవమానించి హింసించిన కారణంగా సేనాని అయిన దీపసింహుడు సేనకూడదీసి దామోదరసేనుని తో యుద్ధముచేసి సంహరించి దీపసింహుడు రాజ్యాన్ని హస్తగతంచేసుకున్నాడు. తర్వాత

17– 1–26 దీపసింహుడు.
14– 5– 0 రాజసింహుడు.
9– 8–11 గణసింహుడు
45– 0–15 నరసింహుడు.
8– 0– 1 జీవనసింహుడు.

యీ వంశం 6 గురు రాజులు మొత్తం 107 సం॥ 6 నె॥ 22 ది॥ పాలించిన తర్వాత జీవనసింహుడు తన సైన్యాన్ని ఉత్తరదిశకు పంపాడు. యీ అవకాశాన్ని పురస్కరించుకొని వైరాట్‌ను పాలిస్తూన్న పృథ్వీరాజ చౌహాన్ దాడిచేసి యుద్ధంలో జీవనసింహుని సంహరించి రాజ్యాన్నిపాలించాడు.

12– 2–16 పృథ్వీరాజు చౌహాన్
14– 5–17 అభయపాలుడు
11– 4–14 దుర్జనపాలుడు

36- 4-27 యశపాలుడు

86 సం॥ 20 ది॥ మొత్తం 5 గురు రాజులు పాలించిన తర్వాత సులతాన్ శహబుద్దీన్‌గోరీ గఘగజనీనుంచి దాడిచేసి 1249లో యశపాలుని ఖైదుచేసి ప్రయాగకోటలో బంధించినాడు. ఢల్లీ సింహాసనాన్ని శహబుద్దీన్‌గోరి ఆక్రమించుకొన్నాడు. (కానీ శహబుద్దీన్‌గోరీ పృథ్వీరాజుపైకే దాడిచేసినట్లు చరిత్రలో తెలియవస్తూవుంది.) (1)

4004 నాడు ప్రపంచోత్పత్తి హఠాత్తుగా సంభవించిందని, యూరప్‌లోని క్రైస్తవపండితులు, ముస్లిం పండితులు రెండువందలఏళ్లక్రితం వరకు నమ్మేవారు. అంతవరకు వీరికున్న సందేహమల్లా ఆ సంవత్సరం వేసవిలోనా, లేక శరదృతువులోనా అనే విషయాన్నిగురించి మాత్రమే తలలు బద్దలుకొట్టుకొంటూ వుండేవారు.

3102 పంజాబులోని కాళీశకం. యీశకం క్రీ॥ పూ॥ 3102 ఫిబ్రవరి 17–18 తేదీ అర్థరాత్రితో ప్రారంభమయింది, అని చెప్పబడుతుంది.

3130 పరీక్షితుజననం. పౌరాణికాధారాల ననుసరించి మహాభారత యుద్ధకాలంకూడా యిదేనని చెప్పబడుతూవుంది.

3130 అస్తీకుడు, జరత్కారుడు అనేమునీశ్వరుని కుమారుడు. యితని తల్లి జరత్కారి. యీమె నాగరాజైన వాసుకి సోదరి. మాతృపితృకులాల మధ్యనున్న వైమనస్యాలను తొలగించాడు. సత్యార్థ ప్రకాశిక (దయానంద సరస్వతి) సౌజన్యంతో, యీ వివరణలభ్యమయింది:– జనమేజయుని సర్పయాగంలోకెల్ల పాండిత్య పరీక్షణద్వారా జనమేజయుని మెప్పించి సర్పయాగాన్ని ఆపుచేయించి, వాసుకి వగైరా నాగజాతీయుల ప్రాణాలనురక్షించాడు. యితని జీవితమే శాంతి సౌజన్యాలకొరకు అంకితం చేసిన ధీశాలి.

1142 ఋగ్వేదపు ఛందోభాగరచన యీ కాలంలో జరిగిందని (మోక్షమూలర్ అభిప్రాయము)

3000 సింధుప్రాంతంలోని బరకాశా జిల్లాలో మొహంజదరో - పంజాబులోని మాంటగోమరీజిల్లాలోని హరప్ప యీ కాలానికిసంబంధించిన

---

(1) సత్యార్థ ప్రకాశిక (దయానంద సరస్వతి) సౌజన్యంతో యీవివరణ లభ్యమయింది.

వని, భూతత్వ శాస్త్రపరిశోధకులు తెలియజేస్తున్నారు. యీ ప్రాంతాలలో భూమిని త్రివ్వగాబయల్పడిన ప్రాచీన నగరశిధిలావశేషాలు, నీటిద్వారా ప్రాచీన సింధునాగరికత బయల్పడుతూవుంది. యీ సభ్యత ఆర్యులకు పూర్వం భారతదేశంలో నివసించిన అనార్యులదేననే విషయాన్ని అందరు అంగీకరిస్తున్నారు.

2182 సెమిరేనసు — సైనసులు - అస్సీరియా సామ్రాజ్యసంస్థాపకులు వీరి సెమురేనసు అనే రాణి భారతదేశంపైన దాడిచేసినట్లు అదివిఫలమయినట్లు విలియంస్మిత్ తెలియజేస్తున్నాడు.

2000 కళింగులు. మహాభారతయుద్ధంలో కళింగులు 60 వేల రథాలతో కౌరవుల పక్షాన యుద్ధంచేశారు. అయితే యీ కళింగులు ప్రస్తుత కళింగ (ఆంధ్రప్రాంతవాసులుకాక గంగానదికి దక్షిణభాగంలో ఖరగపూర్ ప్రాంతాల్లో నివసిస్తూవుండేవారు, అని చరిత్రకారుల అభిప్రాయం.

1936 మహానందుని రాజ్యాభిషేకము జరిగింది. పరీక్షితు పుట్టిన తర్వాత 1150 ఏండ్లకు మహానందుడు రాజ్యానికి వచ్చాడు.

1983 నుండి 1636 వరకు మొదటి గణతంత్ర రాజ్యపాల నారంభంగా లెక్కించబడుతూవుంది.

1500 ఆర్యులు భారతదేశానికివచ్చిన కాలమని పాశ్చాత్య పండితుల అభిప్రాయం. (యీ అంచనా తప్పుఅని)

1500 యీ కాలపునాటి శిలాశాసనం మెసపొటేమియాలో భారతీయ రచనాశైలిలో లభ్యమయింది.

1400–1300 రామాయణ రచనాకాలం అని పోప్ (ఫ్రెంచి) గొర్రెషియో (ఇటలీ) ల అభిప్రాయం.

1400 నుండి 1000 వరకు పౌరాణిక రచనాయుగమని రమేశచంద్ర దత్తుగారి అభిప్రాయం

1413 నుండి 1113 వరకు రెండవ గణతంత్ర రాజ్య కాలమని లెక్కించబడుతూవుంది.

1400 లో పతంజలి అను నొక గొప్ప తత్వవేత్త యుండెనని వివేకానందుని అభిప్రాయం.

1386 నాటికే భారతచైనా దేశాలమధ్య వాణిజ్యా వ్యాపార వ్యవహారాలు కొనసాగుతూఉండినట్లు ఆధారాలు లభ్యమవుతున్నాయి.

1100 నాటికే 28 నక్షత్రాల సిద్ధాంతం భారత చైనాదేశాలలో ప్రచారంలోకి వచ్చింది.

1086 బుద్ధనిర్వాణకాలమని ఫాహియాన్ తెలియజేశాడు. ఫాహియాన్ భారతదేశానికి తనరాకకు పూర్వం 1497 సంవత్సరాలనాడు బుద్ధ నిర్వాణమైనట్లు వదంతిగా వుండినట్లు తెలియజేశాడు. దీన్నిబట్టి పై కాలంలో బుద్ధ నిర్వాణాజరిగిందని చెప్పాడు.

1001 నుండి 880 వరకు మూడవ గణతంత్ర కాలమని లెక్కించ బడుతూవుంది.

975 సోలమన్ దేవాళయ నిర్మాణసందర్భంలో అలంకరణలకొరకై టైర్ రాజు హీరామ్ ఏనుగుదంతము, నెమల్లు, కోతులు వగైరాలను తెమ్మని భారతదేశానికి మనుష్యులపంపాడు. ఓఫిర్ రేవునుంచీ (అంటే బొంబాయి ప్రాంతానికిచెందిన ప్రసిద్ధ సుపార రేవు) వీటిని తెమ్మన్నట్లు చెప్పబడుతూవుంది.

9 వ॥ శ॥ లో నైమి శారణ్యగాధా కాలమని చారిత్రకుల అభిప్రాయమైయున్నది.

800–550 మధ్య కాలపువాడు, కపిలుడని మాక్డోనెల్ అభిప్రాయం 7-8 శతాబ్దములవాడని జాన్ డేలిసు. క్రీస్తుకు పూర్వమొకటవ శతాబ్దపువాడని కొందరనగా లేదు తర్వాతవాడని కొందరు - యితను సాంఖ్యశాస్త్ర మూలకర్త. ఏమైనా కపిలుడు బుద్ధునికి పూర్వపువాడే ననటంలో సందేహం లేదు.

750 లేక 850 అశోకుని కాలమని మాక్సు ముల్లరు తన సంస్కృత సాహిత్య చరిత్రలో (139 పు) చీనా వ్రాతల ప్రకారం పై నిర్ణయానికి రావచ్చునని తెలియజేశాడు.

700 బోధాయనుడు! వగైరాలకాలమని చెప్పబడుతూవుంది కానీ

700 యాజ్ఞవల్క్య! పౌరాణిక సాహిత్యాన్ననుసరించి యాజ్ఞవల్క్య మహాభారతకాలపు వాడుగా తెలియవస్తు ది

7 వ|| శ|| లో తక్షశిల విశ్వవిద్యాలయం ప్రశస్తిలోకి వచ్చింది, క్రీ|| శ|| 3వ శతాబ్ది వరకు అంటే వెయ్యిసంవత్సరాలు వికాసంచెందుతూనే వొచ్చింది. యిందులో 16 విధముల విద్యా విషయములు బోధించెడివారు. అందులో ముఖ్యంగా ఆయుర్వేద (వైద్య) విషయికములు ధనుర్విద్య సైనిక విద్య చిత్రలేఖనము (రంగులు వేయుట) రాతి చెక్కడము (శిల్పవిద్య) వగైరా చేతివృత్తులు, జ్యోతిషము, పశుచికిత్సా విధానము ప్రధానంగా బోధింపబడెడివి.

600 ప్రాంతం వాత్స్యాయనుడు కామసూత్రములు వగైరా రచించిన ప్రఖ్యాత శాస్త్రజ్ఞుడు. వీరికాలము యింతకుమునుపే వుంటుందని జాకోబీ సువాలి వగైరాలున్ను, కాదు యింకాయీవలివాడని కొందరు చరిత్రకారుల అభిప్రాయం.

600 ప్రాంతం కణాదుడు వైశేషిక మతస్థాపకుడు. (పరమాణువాది)

600 పాణిని ప్రసిద్ధ వ్యాకరణ సృష్టికర్త.

600 ప్రాంతంలో గౌతముడు మిధిలానగరంలో వుంటూ ధర్మ (న్యాయ) సూత్రములు రచించాడు గౌతముడు బుద్ధుని సమకాలికుడని డా|| విద్యాభూషణుని అభిప్రాయం. వీరికే మరికొన్ని పేర్లుకూడా వున్నాయి. అక్షపాదుడు రెండవపేరు. అహల్యభర్త గౌతముడు యీాయనేనని కొందరు. మహాభారతం శాంతిపర్వంలో గౌతముడే మేధాతిథి అనికూడా చెప్పబడింది. యీాయనకు పాదములయందు నేత్రములు వుండినట్లు ఒకగాధ కూడావుంది.

600 ప్రాంతంలో ఆపస్తంభుని నాయకత్వాన ఆంధ్రులు ఒకతెగగా దక్షిణానికి బయలుదేరి వెళ్లినట్లు చెప్పబడుతూవుంది.

600–700 మధ్యకాలం కుమారిలభట్టు ప్రభాకర పండితుడు. వీరు పూర్వమీమాంసాభాష్యకారులు వీరు ఆంధ్రులు.

600 ప్రాంతం పాణిని. యితని తండ్రి దేవలుడు. తల్లి దాక్షి. దాక్షీపుత్రుడనికూడా పాణినికి నామాంతరం గాంధారదేశంలోని శాలాతుర ప్రదేశంలో జన్మించాడు. శైవభక్తుడు మొదలు సంస్కృత వ్యాకరణశాస్త్రాన్ని రచించాడు. యిదేగాకుండా జాంబవతీవిజయాన్ని రచించాడు.

కొందరువ్యాకరణవేత్త పాణిని కావ్యరచనాపాణిని వేరు వేరువ్యక్తులంటారు. కాదు యిద్దరూ ఒకేనని క్షేమేంద్రుడు తేల్చివేశాడు.

6 వ|| శ|| ప్రాంతం నాట్యశాస్త్రవేత్త భరతముని. యితనికాలం సరిగానిర్ణయించుటకు ఆధారాలుచాలవు. అయినా పరిశోధకులు 6 వ|| శ|| కంటె ముందువాడుమాత్రం కాదనీ కాళిదాసు భాసుడు వగైరాలంతా యీతనిని పేర్కొనటాన్ని బట్టి అతి ప్రాచీనుడేనని చెప్పవచ్చునంటారు. క్రీ|| పూ|| 1వ శతాబ్దపువాడని యిటీవల కొందరు అభిప్రాయపడుతున్నారు.

6 వ|| శ|| లో ప్రాచీన భౌతికవాదులు, బృహస్పతి, అజితకేశకంబలి, చార్వాకుడు వగైరాలింతా వైదిక బ్రాహ్మణులకూ వీరికి నిరంతర సాంఘికసైద్ధాంతిక సంఘర్షణ జరుగుతూవుండేడిది.

600 ఆసురి - కపిలుని సాంఖ్యశాస్త్రాన్ని విస్తృతమొనర్చినవాడు యితని కాలమిదేనని డా|| రాధాకృష్ణన్ అభిప్రాయం.

600 పతంజలి కాశ్మీర దేశమున గోవర్ధనము జన్మించాడు. తల్లిగోణిక గోణికా పుత్రుడనికూడా యితనికి నామాంతరం పాణినివ్యాకరణశాస్త్రానికి యితను భాష్యాన్నిరచించాడు, యోగసూత్రాలని. మూలకర్త యితని కాలము. క్రీ|| పూ|| 2వ శ|| మనీ, కాదు కీ|| శ|| 4వ శతాబ్దమనీ కొందరు యింకా అనేక అభిప్రాయాల వారుకూడా వున్నారు. క్రీ||పూ|| 10వ శ|| వాడని భాష్యాచార్యులు కీ|| శ|| 14వ శతాబ్ద వాడని వివేకానందుని అభిప్రాయం. కానీ యించుమించు కీ|| పూ|| 6వ శ|| అనడమే సమంజసము అనేకుల అభిప్రాయముగాను ఉంటుంన్నది.

6 వ|| శ|| నాటికి ప్రాబల్యంలోనున్న ప్రజాతంత్ర దేశాలు అంగదేశం — బీహారులోని ఉత్తరతూర్పు భాగాలలో ఉండినది. రాజధాని చంపానగరం నేటిభాగల్ పూర్ స్థానంలో వుండినది. కొద్దికాలం తర్వాత మగధరాజ్యం దీనిని జయించిన తన రాజధానిలోకలుపుకొంది.

6 వ|| శ|| లో పక్షియన్ లేక పార్శీసామ్రాట్టు దరయన్ భారత దేశంలో సింధు పశ్చిమ పంజాబులలో కొంతభాగాన్ని పరిపాలించాడు. యితని సైన్యంలో భారతదేశానికిచెందిన ఒకవిభాగంకూడావుండేది. అందులో ఆశ్వికదళము, రథములు, గజములుకూడా వుండేవి. వీరిని పార్థియనులు పార్సవులు అని వ్యవహరించటం జరిగింది.

6 వ॥ శ॥ కాశీ – నేటి ఉత్తర ప్రదేశ్‌లో ఉండేది. రాజధాని కూడా కాశీయే లేక వారణాశి. అనంతరం యిదికోసలరాజ్యంలోలీనమైంది.

వజ్జి యిది బీహారులోని ఉత్తరప్రాంతంలో ఉండినది. దీని రాజధాని వైశాలీ. రాజ్యవ్యవస్థను వ్యతిరేకంగా ఎనిమిది ప్రజాతంత్రదేశాలు దీనిలో కలిశాయి యిది శక్తివంతమైన గణతంత్ర రాజ్యంగా విలసిల్లినది.

మల్ల యిది నేటి గోరఖ్‌పూర్, హిమాలయపర్వతంలో వుండినది. దీనికి రెండురాజధానులుండెడివి. ఒకటి కాశీనగరం రెండవది పావా.

ఛేది యిది వత్సప్రదేశానికి దక్షిణంలోవుండినది. రాజధానిశక్తిమతి.

కురు ఇంద్రప్రస్థం లేక హస్తినాపురం ప్రాంతంలో వుండినది. దీని రాజధాని ఇంద్రప్రస్థం నేటి ఢిల్లీ.

పాంచాల యిది గంగా యమునా ప్రాంతంలో దోఆబ్ను తూర్పు భాగంలోవుండినది. ఉత్తరపాంచాల, దక్షిణపాంచాల రెండుగావుండినది. ఉత్తరపాంచాలను రాజధాని అహిఛత్ర. దక్షిణపాంచాలను కాంపల్య.

మత్స్య యిది నేటి జయపురం, భరతపురం, అలవర ప్రదేశాల్లో వుండినది. దీని రాజధాని విరాటనగరం నేటి జయపురంలోని వైరాట్.

శూరసేన యిది కురుజనపదానికి దక్షిణంగానూ ఛేదికి పశ్చిమోత్తరంగానూ వుండినది. దీని రాజధాని మథుర బహుశా నేటి వ్రజమండలంను సమానంగావచ్చు.

గాంధార యిది ఆఫ్ఘనిస్థాన్‌లోని తూర్పుభాగం సీమాంతప్రదేశం పంజాబులోని పశ్చిమభాగం కాశ్మీరులోని అధికభాగం సమ్మిళితంగావుండినది. దీని రాజధాని తక్షశిల పుష్కవతి.

కాంభోజ యిది కాశ్మీరు ఉత్తరకోస గాంధారంలోని ఉత్తరప్రదేశం. పామీరు బదఖాశాం సమ్మిళితంగా వుండినది. దీని రాజధాని రాజపురం.

అశ్మక్ యిది గోదావరి ప్రాంతంలో వుండినది. రాజధాని పోధన్య – నేటి పోతన లేక పోత్రలి.

కోసల నేటి అవధను సమానంగా వుండినది. రాజధాని రాప్తీనది గట్టునశ్రావస్తి. ఆఖరులో యిది కాశీజనపదాన్ని విలీనం చేసుకుంది. బుద్ధ సమకాలీనుడు ప్రసేనజిత్ పాలిస్తూవుండినాడు. కొద్దికాలంతర్వాత కోసల సంపూర్ణంగా మగధ రాజ్యంలో కలిసిపోయింది.

అవంతి నేటి మాళవదేశంలోవుండినది రాజధాని ఉజ్జయిని. దీనిని ప్రద్యోకత వంశస్థులు పాలిస్తూవుండినారు. బుద్ధునికాలంలో మహాసేనుడు పాలించాడు. అవంతికివత్సకు నిరంతర సంఘర్షణసాగుతుండేడిది. ఆఖరుకు అవంతికూడా క్రీ॥పూ॥ 400 ప్రాంతంలో మగధలో లీనంఅయిపోయింది.

వత్స నేటి అల్లాహాబాద్ ప్రదేశంలో వుండినది. దీన్ని పాండవరంగస్థులు పాలించారు. కౌశాంబీ రాజధానీనగరం. బుద్ధునికాలంలో ఉదయనుడు దీన్ని పాలిస్తూవుండినాడు. ప్రసిద్ధి వహించినవాడు. యితనిని ఒకతూరి అవంతి మహాసేనుడు ఖైదు చేసి ఉదయనునికి తన పుత్రికనిచ్చివిడుదల చేశాడు. ఉదయనుడు బౌద్ధధర్మాన్ని ప్రోత్సహించాడు. కాలాంతరంలో వత్స కూడా మగధలో కలిసిపోయింది.

మగధ యిది దక్షిణ బీహారు లేక గంగానదికి దక్షిణభాగంలోవుండినది రాజధాని గిరివ్రజం పర్వాతా రాజగృహంగా వుండినది దీన్నిబుద్ధుని కాలంలో బింబిసారుడు పాలించాడు. యితను బౌద్ధమతావలంబి పాట్నా సమీపంలోని పాటలీ గ్రామాన్ని ఒకకోటగా తయారుచేసుకొని కోసల నుంచి విడివిడి స్వతంత్రమయింది యీగ్రామమే ఆఖరులో పాటలీపుత్రం అని ప్రసిద్ధికెక్కినది. క్రీ॥ పూ॥ 4లో దీన్ని నాగవంశస్థులు స్వాధీనం చేసుకొన్నారు యీ వంశానికి శిశునాగుడు మూలకర్త.

ఆర్యతెగ ఒకేస్థలంలో జీవికను గడపేఅవకాశాలను కోల్పోయి కొన్ని శాఖలుగా చీలి ప్రపంచం నలువైపులకు ప్రయాణం సాగించింది. అందులో ఒకశాఖభారతదేశం ప్రవేశించింది. అనేవిషయాన్ని అందరు ఏకగ్రీవంగా అమోదిస్తారు. కానీ యీ ఆర్యజాతిమూల తెగవే ప్రదేశంలో నివిసించింది? ఏ కాలంలో భారతదేశం ప్రవేశించిది? అనే ప్రశ్నలకు ఎక్కువమంది మధ్యాశియా అని పేర్కొంటున్నప్పటికీ యిది యింకా ఏకగ్రీవామోదంకా లేక పోతూవుంది. యిక కాలంవిషయంలోకూడా భిన్న భిన్నధోరణులలో ఆలోచించటం జరుగుతూవుంది.

భారతీయ సాంప్రదాయ ప్రకారం క్రీ॥ పూ॥ 3000 ప్రాంతంలో మహాభారతయుద్ధం జరిగింది. అంతకుమునుపు 33 తరముల క్రిందట అంటే దాదాపు 15 లేక 16 వందల ఏళ్లక్రితం రామాయణయుద్ధం జరిగింది. రామ రావణయుద్ధానికి కొన్ని వందల (బహుశా 4–5 కావచ్చు) ఏళ్లక్రితం దేవా సుర సంగ్రామాలు జరిగాయి. అంటే ఆర్యులు భారతదేశం ప్రవేశించే సందర్భంలో ప్రాచీన భారతవాసులతో చేసిన యుద్ధాలు.

ఆర్యులు భారతదేశం ప్రవేశించాక ప్రప్రథమంగా వేదసాహిత్యము ఉత్పన్నమయింది. తర్వాత వేదాలను విపులీకరించే వేద సంహితలు తయారయాయి. అంతటితో యీ విధమైన సాహిత్యకాలం సమాప్తమయి ఆరణ్యకాల కాలం తర్వాత ఉపనిషత్ కాలం గడచిపోయి బౌద్ధ యుగానికి చేరుకుంటాము. బౌద్ధయుగంనుంచీ ఖచ్చితమైన అంచనాలు వేసే అవకాశాలు లేకపోయినప్పటికీ. పదులు లేక వంద సంవత్సరాలు. అటు. యిటు తేడాలతో చరిత్రను క్రమబద్ధంచేసే అవకాశాలు చాలావున్నాయి యిప్పటికే చాలాకృషికూడా జరిగిపోయింది.

588 కాళిదాసు సంస్కృతమహాకవి. విక్రమాదిత్యుని ఆస్థాన పండితుడు యితను లంకాద్వీపపు కవిరాజా కుమారదాసునితో స్నేహం చేసి, సిలోన్ వెళ్లి అక్కడే సమాధిఅయ్యాడు. రెండవ కాళిదాసు క్రీ॥ శ॥ 748 నాటివాడు మహాకవి. భవభూతి సమకాలీనుడు. మూడవ కాళిదాసు భోజునినాటివాడు. గొప్పవిద్వాంసుడు గ్రంధకర్తకూడా చరిత్రలో వీరే కాక కాళీదాసనామధేయాన్వితులు యింకాకొందరున్నారు.

569 మహావీరుని జననం. జైనమతస్థాపకుడు. యితనిఅసలు పేరు వర్ధమానుడు. వైశాలీలో విద్యనభ్యసించి తన 33వ ఏట పార్శ్వమునిశిష్ట అహింసాసిద్ధాంతం గ్రహించి, జినుడైనాడు॥ జీను ॥ ప॥ జిన్ ॥ శబ్దము నుంచి ఉత్పన్నమయింది. జిన్ అనగా అరిషడ్వర్గాదుల జయించినవాడు. తర్వాత యితను 30 ఏండ్లవరకు మగధప్రాంతంలో పర్యటించి అహింసా తత్వసూత్రాలను ప్రచారంచేసి పావా అను పురంలో చనిపోయాడు.

555 బుద్ధునిజననం, బౌద్ధమతస్థాపకుడు. పూర్వపు విదేహరాజ్యము లోని (నేటి ఉత్తరబీహారు) శాక్యరాజయిన శుద్ధోదనునికీ. మాయాదేవికీ జన్మించాడు. మాయాదేవి తనపుట్టిల్లు అయిన నేపాలదేశానికి పోతువుండగా

మార్గమధ్యంలో హిమాళయపర్వతప్రాంతాలవద్ద. లుంబినిలో జన్మించాడు. శాక్యులది కోసల విదేహాలమధ్య చిన్నరాజ్యము. కపిలవస్తురాజధాని.

557–69 ఈశ్వరకృష్ణుడు. సాంఖ్యకారికాగ్రంథాన్ని చైనా భాషలోకి అనువదించాడు. గొప్పతత్వ శాస్త్రవేత్త. చైనాభాషలో. సాంఖ్యసప్తతి అని వీరిగ్రంథం పిల్వబడుతూవుంది. క్రీ॥ శ॥ 320 వాడని 280–360 వాడనీ. లేదు ప్రథమ శతాబ్దవాడనీ ఈశ్వరకృష్ణుని కాలనిర్ణయం చేయుటం జరుగుతూవుంది.

550 జాతుకర్ణ్యుడు. యితను ఆసురాయణుడు యాస్కుల శిష్యుడు.

బుద్ధనిర్యాణాన్ని గురించి మాక్సుముల్లర్ ఈవిధంగా తెలియజేశాడు. టిబెట్ సాంప్రదాయప్రకారం కొన్నికాలాలు క్రీ॥ పూ॥ 546–576–653–752–837–880–882–884–1060–1310–2135–2139–2148–2422–కంటన్ సాంప్రదాయప్రకారం 487లో ననీబీసాంప్రదాయ ప్రకారం 639లో ననీయితరులు 544లో ననీ. విభిన్నకాలాలను నమ్ముచున్నారు.

540–487 పరమేనిడ్. పరమాణుశాస్త్రవేత్త

535–427 హేరాక్లితు యునాని తత్వశాస్త్రవేత్త క్షణికవాది బుద్ధుని సమకాలికుడు.

527 మహావీరుడు (జినుని) నిర్మాణం 528 అని జైనసంప్రదాయం అంటుంది.

543–491 బింబిసారుని పరిపాలన.

500 నాడు ఈజిప్ట్‌దేశంలోని మెంగిన్, అనే ప్రదేశంలో భారత దేశపు వ్యాపారస్థులు నివసించినట్లు కనుగొనబడింది.

500 పూర్వం హిందూదేశపు కాల్బలము. అశ్వికదళము పర్షియన్ సేనలతో కలిసి గ్రీసుదేశం వెళ్లాయి.

510 పర్షియాచక్రవర్తి డరియస్. తనసామ్రాజ్యాన్ని మెడిటరేనియన్ సముద్రమునుంచి సింధుప్రాంతంవరకు విస్తరింపజేసి. సింధుప్రాంతాన్ని

జయించేందుకుగాను ఎర్రసముద్రముగుండా ప్రయాణము చేరేందుకు. నలుందే నౌకను గొనేందుకు ఒకనావికుని నియోగించాడు అనా(యిప్పటిసూయజుకు) చేయుకున్నాడు.

5–4 శ॥ పూర్వమేఎన్నడో మాండూక్యోపనిషత్ రచన జరిగిందని చెప్పవచ్చు.

500 కణాదుడు లేక ఉలూకుడు వైశేషిక సిద్ధాంత మూలకర్త. మతస్థాపకుడు. యితను పరమాణువాది. యితని వైశేషికశాస్త్రాన్ని ఔలూక్య తత్వశాస్త్రం అని కూడా అంటారు. షడ్దర్శన్ అనే తత్వశాస్త్రాన్ని కూడా రచించాడు.

5 వ॥ శ॥ నాటికే ఈజిప్ట్‌లోని మెంఫిస్ నగరమున భారతీయవర్తకులు వలస ప్రాంతాన్నేర్పరచుకొని వుండినట్లు నెహ్రూడిస్కవరీ ఆఫ్ యిండియాలో వ్రాసినాడు.

500 నాటికే ఆంధ్రరాజులు బలమైన దుర్గనిర్మాణం కావించుకొని పరిపాలన సాగించారని చంద్రగుప్తుని ఆస్థానంలోనుండిన గ్రీకురాయబారి మెగస్తనీసు తెలియజేశాడు.

500 దాదాపు ప్రసేనజిత్తు యితనుకోసలదేశపురాజు. బింబిసారుని బావమరిది. యితను తక్షశిల విశ్వవిద్యాలయంలో విద్యాభ్యాసంచేశాడు.

491–459 క్రీ॥ పూ॥ 5 వ॥ శ॥ అజాతశత్రువు యితను ప్రాచీన మగధను పరిపాలించాడు. బింబిసారుని పుత్రుడు.

480 ప్రాంతం జీవకుడు యితను బుద్ధుని సమకాలీనుడు. యితను తక్షశిల విశ్వవిద్యాలయంలో నాత్రేయాచార్యుని వద్ద వైద్య (ఆయుర్వేద) శాస్త్రంలో గొప్ప ప్రావీణ్యాన్ని సంపాదించాడు. రాజపుత్ర వంశస్థుడు. యితని ప్రతిభా విశేషాలకు ముగ్ధులైనారు.

477 బుద్ధుని నిర్యాణం.

469–399 సుక్రాతీస్ యితని శిష్యుడు అఫలాతూన్ 427–347 వీరిద్దరు యూనాని తత్వ శాస్త్రవేత్తలు. గతితర్కవాదాన్ని ప్రప్రథమంగా ప్రయోగంలోకి తెచ్చినవారు.

467 నుంచి 336 వరకు కళింగదేశం నందరాజుల పరిపాలన క్రింద వుండినట్లు తెలుస్తూవుంది.

450 ప్రాంతంలో విజయుడు లంక వగైరా దేశాలలో పర్యటించి బౌద్ధ సిద్ధాంత ప్రచారంచేసినవాడు. యితను కళింగరాజు. బుద్ధుని నిర్యాణానంతరం. 700 మంది బౌద్ధభిక్షువులతో బౌద్ధాస్థికలను తీసుకొని సముద్రంపైన ప్రయాణంచేసి లంకచేరుకున్నాడు.

401 టీషియన్ అనే గ్రీకుదేశస్థుడు. యితను భారతదేశాన్నిగురించి ఒకగ్రంథాన్ని రచించినట్లు విలియంస్మిత్ తెలియజేశాడు.

400 కుబ్బీరకుడు యక్షజాతివాడు. యితను కృష్ణా. గోదావరీ ప్రాంతాన్ని పరిపాలించినట్లు భట్టిప్రోలుశాసనం ద్వారా తెలుస్తున్నది.

400 కాత్యాయనుని కాలమని కొందరి అభిప్రాయం.

4 వ|| శ|| జైమిని కాలమని కొందరు.

4 లేక 5 వ|| శ|| ఆపస్తంభ మహర్షి కాలమని బూలరు పండితుని అభిప్రాయం.

4 వ|| శ||లో జైనులలో బసమాల, శ్రీమాల అను రెండుశాఖలు ఏర్పడినవి.

400 గౌతముని కాలమని కొందరిఅభిప్రాయం.

400 ప్రాంతంలో ఆవిర్భవించిన ఆంధ్రసామ్రాజ్యం 300 నాటికి 330 గొప్ప నగరాలనుకల్గిన స్వతంత్రరాజ్యంగా రూపొందింది అని మెదస్తనీజు రచనలద్వారా తెలుస్తున్నది.

384 అరిస్టోటిల్ జననరి 367 లో యితను ఏథెన్సులో ప్లేటో వద్ద శిష్యత్వాన్ని స్వీకరించాడు. తదుపరి యితనుసికిందర్‌కు రాజగురువయ్యాడు. స్త్రీ విషయికంగా అరిస్టోటిల్, సికిందర్ (అలెగ్జాండర్) కు విషప్రయోగం చేసి చంపాడని చెప్పబడుతూవుంది. అరిస్టోటిల్ తాత్వకదృక్పథమే సికిందర్‌కు ప్రపంచ విజయాపేక్షను కల్గించింది.

357 భద్రబాహువు ప్రసిద్ధజైన తర్కశాస్త్రవేత్త "దశవైశాలికి నిర్యుక్తి" అనే గ్రంథాన్ని రచించాడు.

350 ఉపవర్షుడు యితను నందవంశపురాజులకు అమాత్యుడు. యితనే పానినికి గురువుఅనికూడా చెప్పబడుతూవుంది.

350 పాటలీపుత్రం రాజధానిగా పరిపాలించిన నందుని సామ్రాజ్య కాలం.

343 ఉగ్రసేన మహాపద్మనందు నందవంశస్థుడు. మగధరాజ్యాధికారాన్ని పొందినవాడు. వీరిది మంగలివంశం. యితని పుత్రులు 8 మంది కలిసి నవనందులు అనికూడా వీరికి ప్రసిద్ధి. వీరు 21 సం॥ రాజ్యాన్ని పరిపాలించారు. సికిందర్ ఆక్రమణకాలంలో యీ వంశస్థుడైన మహాపద్మనందుడు మగధను పాలిస్తూవుండినాడు.

329 లో గుప్త రాజులు ప్రబలంలోకి వచ్చారు. వీరు 248 ఏండ్లు రాజ్యపాలనంచేసిన తర్వాత దేశము మ్లేచ్ఛాక్రాంతమాయెనని, కలియుగ రాజ వృత్తాంతంలో పేర్కొనబడింది.

326 లో సికిందర్ (అలెగ్జాండర్) భారతదేశంపై దండయాత్ర చేయుట. 323 లో బాబిలన్‌లో చనిపోయాడు.

321 చాణక్యుడు. యితని రెండవపేరు కౌటిల్యుడు. బ్రాహ్మణుడు నందరాజుల ద్వారా అవమానింపబడి పరాభవాగ్నిచే ఉద్దీప్తమైన ప్రతిభా విశేషాలను ఉపయోగించి చంద్రగుప్తునికి అండగానిలిచి నందవంశాన్ని నాశనంచేస్తాడు. మంచిరాజనీతిజ్ఞుడు. యితను వ్రాసిన అర్థశాస్త్రము, నీతి శాస్త్రము ప్రసిద్ధములు.

321 మౌర్య చంద్రగుప్తుడు రాజ్యాధికారానికివచ్చుట యితను కొండజాతులవారి సహాయంతో మగధసింహాసనాన్ని ఆక్రమించాడు. చాణిక్యుడనే రాజనీతిజ్ఞుని సహాయం యితనికి ప్రబలంగా వుండినది. చాణిక్యుని మంత్రాంగంద్వారా మగధ సామ్రాజ్యాన్ని విస్తరింపజేశాడు. 303 లో పంజాబును పాలిస్తున్న గ్రీకుసేనాని సెల్యూకసుపై దండయాత్రచేసి అతనిని ఓడించి భారతదేశంలో యవనాధికారాన్ని రూపుమాపాడు.

300 ప్రాంతంలో అమరావతీ బౌద్ధస్తూప నిర్మాణానికి ప్రారంభం చేయబడి క్రమక్రమంగా అభివృద్ధిచేయబడుతూ వొచ్చింది.

300 నాగార్జునుడు. యితను శూన్యవాదాన్ని ప్రతిపాదించాడు.

300 కుమారలబ్ధుడు సౌత్రాంతిక శాఖాస్థాపకుడు. నాగార్జునుని సమకాలీనుడు అనే అభిప్రాయంకూడావుంది.

3 వ|| శతాబ్దారంభంలో పాటలీపుత్రనగరంలో జైనపరిషత్సభ జరుపబడింది.

3 వ|| శ|| నుండీ క్రీ|| శ|| 3 వ|| శ|| వరకు శిల్పకళావికాసంలో ప్రథమయుగమనీ 4 క్రీ|| శ|| నుంచీ 8 వ|| శ|| వరకు మధ్యయుగమనియు క్రీ|| శ|| 9 నుంచీ 12 వ|| శ|| వరకు అనంతరయుగమనియు నిర్ణయించి క్రీ|| శ|| 13 వ|| శ|| నుంచీ క్షీణయుగంగా నిర్ణయించటం జరుగుతూవుంది.

3 వ|| శ|| అశోకచక్రవర్తి ద్వారా నిర్మింపబడిన కళాక్షేత్రాలు
1 సాంచీస్థూపం యిది నేటి మధ్యప్రదేశ్ లోని భోయల్ కుసమీపంలోవుంది.
2 సారనాథ్ యిది కాశీకి అరుమైళ్లదూరంలో వున్నది. బుద్ధుడు జ్ఞానోదయానంతరం ప్రప్రథంగా శిష్యులకు యిక్కడే జ్ఞానోపదేశంచేశాడు. బుద్ధునికి నీడనిచ్చిన బోధవృక్షం నేటికీ యిక్కడవుంది. అశోకుని ప్రథమ ధర్మచక్రం (శిలాస్తంభం) యాభయి అడుగుల ఎత్తున నర్మింపబడినదికూడా యిక్కడేవుంది. ప్రపంచ కళాక్షేత్రాలలో ప్రథమస్థాన మాక్రమించేవాటిలో సారనాథ్ ఒకటి, బుద్ధగయ యిక్కడ బుద్ధుడు తపస్సుచేసినస్థలం వుంది.

300 సికిందర్ సమకాలీనులైన యూనానియాత్రికులు అరిస్టోబులస్ నిఆర్కస్, చారిస్, యూమేనస్ వీరు భారతదేశంలో పర్యటించి వీరు రచించిన యాత్రా విశేషాలు చారిత్రిక పరిశోధనకు చాలా ప్రాముఖ్యమైనవి. సికిందర్ తర్వాత భారతదేశంలో పర్యటించిన యూనానీయాత్రికులు డాయమేకస్ ప్లినీ, డాలమీ, డాయోడోరస్, ఎరిఎస్, ఫుటార్క్, కర్టియస్ జస్టిస్, స్ట్రేబో, మెగస్తనీజ్. మెగస్తనీజ్ చంద్రగుప్తుని శాసనకాలంలో పర్యటించాడు. వీరి రచనలంతోకూడా చారిత్రకాధారాలకు చాలా అమూల్యమైనవి.

273–36 అశోకుడు చంద్రగుప్తుని మనుమడు. మౌర్యసామ్రాజ్య విస్తరణకు కృషిచేశాడు. యీ ప్రయత్నంలోనే కళింగదేశం (నేటి ఆంధ్ర) పైన దండయాత్రచేశాడు. ఘోరసంగ్రామంజరిగింది. (255లో కళింగదండయాత్రచేసినట్లు ధౌలిపూరివద్ద) జౌగఢ (బరంపురంవద్ద) దొరికినశాసనాల

ద్వారా తెలియవస్తూవుంది) కళింగదండయాత్ర అశోకుని అంతిమ దండయాత్ర. తదుపరి యుద్ధకార్యక్రమాలను విడనాడి శాంతిపద్ధతుల ద్వారా రాజ్యవిస్తరణకు కృషిచేశాడు. బౌద్ధమతావలంబియై బౌద్ధమత ప్రచారానికి తీవ్రకృషి చేశాడు. సోదరీ సోదరులైన మహేంద్ర సంఘమిత్రలను బౌద్ధమతప్రచార నిమిత్తమైన సింహళానికి పంపాడు. ఈజిప్ట్, మాసిడోనియా, ఎపిపర్ దేశాలకు కూడా బౌద్ధసన్యాసులపంపి ప్రచారం చేయించాడు. ధార్మికసూత్రాలను శిలాశాసనములద్వారా దేశంలోని మూలమూలాప్రజలకందించే ఏర్పాటుచేశాడు.

251 లో జైనమతంనుంచీ అన్యాక్త అనుశాఖ ఒకటి బయిలుదేరింది యీ శాఖపైన సాంఖ్యప్రభావం కొంతవరకుపడింది.

250 కుశాలుడు అశోకుని పట్టపురాణీ పద్మావతికి పుట్టినవాడు. ఇతని సవతితల్లి తిష్యరక్ష యితనియందు అనురక్తఅయిపొందమని కోరగా తిరస్కరించాడు. యీ ఘటనజరుగు నప్పటికి అశోకుడు తక్షశిలపై దండయాత్రకు వెళ్లివుంటాడు.

247 లో అశ్వమిత్రుడును నాతడు జైనమతంలో క్షణికవాదాన్ని లేవదీసి క్షణికవాదశాఖకు ప్రాతినిధ్యం వహిస్తాడు.

241 లో అశోకచక్రవర్తి పాటలీపుత్ర (పాట్నా) లో మూడవ బౌద్ధపండిత పరిషత్తుజరిపించాడు.

221–198 శ్రీముఖుడు (సిముకుడు) శాతవాహన వంశమూల పురుషుడు. యితని రాజధాని పైఠాన్. యితను సౌరాష్ట్రాన్నిజయించి అచ్చట రాజైన మహారథిత్రిణకయిరో యొక్క కుమార్తె నాగానకను తనకుమారుడైన శాతకర్ణికి వివాహంచేశాడు. 220 లో శాతవాహన రాజ్యస్థాపనా కాలమని కొందరి అభిప్రాయం.

225–30 ఇక్ష్వాకు వంశపరిపాలన.

యీ కాలంలోనే సూత్రరచనజరిగిందని భారతీయ పండితుల అభిప్రాయం. కాదు 400 ప్రాంతమని పేర్జమ అభిప్రాయం. మహాభాగత భాగమైన గీతకాలంకంటే పూర్వమే బాదరాయణ వేదాంతసూత్రాలు ఉత్పన్నమయాయని మ్యాక్సుముల్లరు అభిప్రాయం.

200 ప్రశస్తపాదుడు. కణాదుని వైశేషికసూత్రాలను విశేష ప్రచారంలోకి తెచ్చినవాడు.

200 జైమిని కాలమని కొందరి అభిప్రాయం.

200 అభిమన్యురాజు కాలం. యితను కాశ్మీరును పరిపాలించాడు. యితని కాలంలో కాశ్మీరులో బౌద్ధదర్మం బాగా అభివృద్ధిచెందింది. యితని పేరుతో కాశ్మీరులో అభిమన్యుపురము అనేనగరాన్ని కూడా నిర్మించాడు.

2 వ॥ శ॥ అమరావతికి యిక్కడి శిల్పం క్రీ॥ శ॥ 250 వరకు వికసించింది. క్రీ॥ పూ॥ 200–100 మొదటి దశగానూ క్రీ॥ పూ॥ 100 నుంచీ క్రీ॥ శ॥ 100 వరకు రెండవ దశగానూ క్రీ॥ శ॥ 150 నుంచీ 250 వరకు నాల్గవ దశగానూ అమరావతి శిల్పకల విలసిల్లినది. యిక్కడిశిల్పివైశిష్ట్యం కూడా దశలవారీగా భిన్నత్వాన్ని కనబరుస్తూవుంది.

200 గుణాఢ్యుడు యితను శాలివాహనుని కాలంవాడు. బహువిధ భాషాపండితుడు. పైశాచిక భాషలో కథాసరిత్సాగరము అనే బృహత్ గ్రంథాన్ని రచించాడు. యిది నేడు బహుప్రశస్తిలోవున్న గ్రంథం.

200 అజంతా గుహాలయనిర్మాణ ప్రారంభకాలం. ఔరంగాబాదుకు 63 మైళ్లలోని గొప్పపర్వత మధ్యంలోని లోయలో అర్ధ చంద్రాకృతిగా నిర్మింపబడిన గుహలు క్రీ॥ పూ॥ 200 లో ప్రారంభమయిన యీ గుహా నిర్మాణ కార్యక్రమం క్రీ॥ శ॥ 600–700 వరకు కొనసాగింది. 27 గుహాంతర్భాగాలలో బౌద్ధజాతక కథలు వర్ణచిత్ర రూపాలలో (గోడలపైని, స్తంభాలపైని, దూలాలపైన. కప్పుగానిలిచిన పైభాగంపైని) అతిరమ్యంగా చిత్రించబడ్డాయి. యిక్కడ జలపాతం ద్వారా ప్రవహించేవాఘిరా నదీ ప్రకృతి దృశ్యాలు చూడవలసినవేగాని వర్ణతీతమైనవి యీ గుహలు సువిశాలమైన ప్రాసాదాలవలె అతిమనోహరముగ వున్నాయి. కాని యీ కార్యక్రమంలో ఏదో గొప్ప అవాంతరాయం కల్గినట్లు అంతటితో యీ పని ఆగిపోయినట్లు అసంపూర్ణంగా మిగిలిపోయిన కొన్నిగుహాంతర్భాగాలు మనకు తెలియజేస్తున్నాయి.

196–52 మధ్య 75 ప్రాంతంవాడు. రెండవ శాతకర్ణి కాలం యితను పాటలీ పుత్రాన్నికూడా జయించి మగధ సామ్రాజ్యాన్ని 10 సం॥ మలు

పాటు ఆంధ్ర సామ్రాజ్యంలో భాగంగాచేసివేశాడు. తర్వాత కాలంలో పాటలీ, విదిశ రాజ్యాలు స్వతంత్రితను సంపాదించుకున్నాయి.

క్రీ॥ పూ॥ 25 శ॥ యితని కాలంలో సాంచీలో అశోకుని ద్వారా ప్రారంభించబడిన స్తూపానికి నాలుగువైపులా నాలుగుతోరణములు నిర్మించబడినవి. ఈ ద్వారములవీాద మనోహరమైన శిల్పముకూడా చెక్కబడింది.

180–147 పతంజలికాలం. యితను యోగసూత్రికారుడు. యితని కాలమిదేనని చాలా మంది పండితులు ఏకీభవిస్తున్నారు. యోగదర్శనం రచించిన పతంజలి వ్యాకరణ మహాభాష్యకారుడయిన పతంజలి యిద్దరూ ఒకరేనని చెప్పబడుతూవుంది. యితను ఒకవైద్యగ్రింథాన్నికూడా రచించాడు. భారతదేశపు తూర్పుభాగంలోని గోవర్ధన ప్రిదేశపువాడు. యితని తల్లి గోణిక. పాటలీపుత్రరాజు పుష్యమిత్రుని సమకాలికుడని కొందరి అభిప్రాయము.

క్రీ॥శ॥ 7-8 శతాబ్దలవాడని యిటీవల చారిత్రకులు నిర్ణయించారు.

183 ఖారవేలుడు యితను అశోకసామ్రాజ్య పతనానంతరం కళింగ దేశాన్ని పరిపాలించాడు. మొట్టమొదటగా మౌర్యసామ్రాజ్యంపైన తిరుగుబాటుచేసి స్వతంత్రి రాజ్యాన్ని స్థాపించినవాడు యితనే.

180–170 శాతకర్ణి కాలం. యితను ఉజ్జయిని జయించి తన నాణెములపైని ఉజ్జయినీ ముద్రిను వేయించాడు. దక్షిణాపథపతి అను బిరుదును కూడా వహించాడు. పాటలీపుత్రరాజైన పుష్యమిత్రునితోను కళింగరాజైన ఖారవేలునితోను, యితను అనేకయుద్ధాలు చేశాడు,

170–153 పూర్ణోత్సంగుడు యితను శాతకర్ణికుమారుడు.

165 శకులు వీరు మధ్యాశియాలోని సర్ నదికి ఉత్తరంగా నివసిస్తున్న జాతివారు. 165లో హూణులు పశ్చిమోత్తర చీనాపై దాడిచేసి. యూ. హీ. చీ, జాతిని తరిమివేశారు. ఆఫ్గనిస్థాన్, బెలూచిస్థాన్, వచ్చిన శకులు మిత్రదాత ఆధిపత్యాన్ని అంగీకరించి నివాసం ఏర్పరచుకున్నారు. (మిత్రిదాత పార్థియాను పాలిస్తుఉండేవాడు) ఈసమయంలో ఉజ్జయినిని పాలిస్తున్న గర్దభిల్లికాలకుని చెల్లెలు సరస్వతిని అపహరించిన కారణంగా

క్రీ॥ పూ॥ 71లో కాలకుడు ఉజ్జయినిపై దండయాత్రకుగాను శకులను ఆహ్వానించాడు. శకులు ఈ అవుసరాన్ని ఉపయోగించుకొని ప్రిప్రథమంగా సింధుప్రాంతంపై దాడిచేసి, గర్ధభిల్లునిఓడించి అవంతిపైగూడా అధికారాన్ని సంపాదించారు. సింధుప్రాంతపు గణతంత్రి రాజ్యాలనుకూడా స్వాధీనంచేసుకున్నారు (యీ దండయాత్రిసందర్భంలో శకులపై జనులు సహాయం చేశారనికూడా వదంతి) తిరిగి గర్ధభిల్లుని కుమారుడు విక్రమాదిత్యుడు క్రీ॥ పూ॥ 57 లో శకులను చిత్తుగాఓడించి తరిమివేశాడు. కానీ తిరిగి క్రీ॥ శ॥ 78లో శకులు భారతదేశముపై రెండవ దండయాత్రిచేశారు. అవంతి, సౌరాష్ట్రికూటమి, మహారాష్ట్రి వగైరా ప్రదేశాలను హస్తగతం చేసుకున్నారు. అనంతరం శకులు భారతదేశంలో విభిన్న స్థానాలలో నిలచి పరిపాలన సాగించారు. యీ వంశంవారు క్రీ॥ శ॥ 380 వరకు అవంతిలో రాజ్యాన్ని సుస్థిరంగా పరిపాలించారు. గుప్తసామ్రాట్ చంద్రగుప్త విక్రిమాదిత్యుడు అవంతిపైన దాడిచేసి శకులపరిపాలనను అంతంచేశాడు. అయినా యీజాతి భారతదేశ సంస్కృతిలో జైన, బౌద్ధ వైదికమతాలననుసరించి భారతపౌరులుగా విలీనమైపొయ్యారు.

158 శ్రీముఖుడు ఆంధ్రిదేశపురాజు. యితను సుశర్మను ఓడించి కళింగదేశమును పాలించినట్లు—కటక్ – ఖారవేలుని శిలాశాసనంవలన భాగవత వాయుమత్స్య పురాణాదులవలనకూడా శ్రీముఖుడు ఆంధ్రిదేశము ఏలినట్లు తెలియుచున్నది.

109 కుహరాట నహపానాయకుడు. యితను రాష్ట్రికూటప్రిభువు పశ్చిమాంధ్రదేశాన్ని పాలించినట్లు తెలుస్తూవుంది (కడప—కర్నూలు) కందనూలు) అనంతపురంజిల్లాలు పశ్చిమాంధ్రిదేశంగా పరిగణింపబడింది) యీ రాష్ట్రికూటులే తర్వాత మహారాష్ట్రిలుగా చెలామణీ అయ్యారు.

1శ॥ శ॥ శబరస్వామి కాలమని అంచనా

1వ॥ శ॥ వాచస్పతిమిత్రిడు అద్వైతశాస్త్రవేత్త—భామతి—సాంఖ్య తత్వకౌముది వగైరా గ్రింథాలను రచించాడు.

1వ॥ శ॥ శ్రీకుంద కుందాచార్యులు జైనమతావలంబి. సమయసారము గ్రింథకర్త.

1వ॥ శ॥ పత్షశిలలో యీశతాబ్దిలోనే శిల్పకళాభివృద్ధి వికసించిందనీ చారిత్రికుల అభిప్రాయము

1వ॥ శ॥ ప్రాంతంలో గ్రీకుదేశపు బాక్ట్రియన్ — అనునతను ఉత్తరహిందూదేశాన్ని పరిపాలిస్తూ బౌద్ధమతాన్ని స్వీకరించాడు.

80 ప్రాంతంలో సింహళంలోని అనూరాధపురమందు బౌద్ధ ప్రపంచపు ముఖ్యవిద్వాంసులందరుకూడి అప్పటికి ప్రచారంలోనున్న బౌద్ధగ్రంథాలన్నింటినీ పరిశోధించి వాటినివిడదీసి పాలీభాషలో లిఖించారు. యివి మూడు సంపుటములుగా మహాభారతానికి మూడురెట్లు ఎక్కువైనది.

78 ఖారవేలుడు యితను మగధరాజ్యాధికారం క్రిందనున్న కళింగ రాజ్యాన్ని స్వతంత్ర రాజ్యంగాచేశాడు. యిది మగధరాజులపతనా సన్న కాలంలో జరిగింది.

యితని కాలంలో ఆంధ్రదేశాన్ని శాతకర్ని అనురాజు పాలిస్తూవుండినాడు. ఖారవేలునికీ శాతకర్ణికీ యుద్ధంజరిగిందనీ అందులో "పిథుండ" నగరాన్ని ఖారవేలుడు ధ్వంసంచేసివేశాడనీ హాథిగుంప శాసనం ద్వారా తెలియవస్తూవుంది. ఖారవేలుడు జైనమతావలంబి. గ్రీకురాజైన డెమెట్రిటస్‌ను యితను తరిమివేసినట్లుకూడా చెప్పబడుతూవుంది.

78 లో శకులు భారతదేశంపై రెండవతూరి దండయాత్రచేశారు.

72 స్పార్టకసు ఇటలీ (రోమ్) బానిసపోరాటానికి నాయకత్వం వహించినవాడు. యితను మల్లయుద్ధ ప్రదర్శనానికిగాను బానిసగా కొని రాబడినవాడు. మల్లయుద్ధ ప్రవీణుల (బానిసలు) తో ప్రారంభమయిన పోరాటం బ్రహ్మాండంగా పరిణమించింది. ఆఖరుకు బానిసతిరుగుబాటును ప్రభుత్వంఅణచివేసి రోమునుంచిపోయే అపియన్ వే అనే రాచబాట వెంబడి 6 వేల మంది బానిసలను ప్రదర్శనకొరకు శిలువవేయుటం జరిగింది.

68 కేరళలో నంబూద్రి బ్రాహ్మణుల పరిపాలన అంతమవుట. పూర్వము పరశురాముడు క్షత్రిసంహార సందర్భంలో కేరళరాజ్యాన్ని యీ నంబూద్రి బ్రాహ్మణులకిచ్చాడని ప్రతీతి.

59 నాగార్జునుని కాలం దత్తైలామాపురాతన గ్రంధశాలలోని చారిత్రకాధారాలననుసరించి భోగభద్రుని నాగార్జునుడుబౌద్ధమతావలంబిగా

జేసినాడని చెప్పబడింది. బుద్ధుని మరణానంతరం 400 ప్రాంతమున దక్షిణ కోసల యందు నాగార్జునుడు జీవించినాడని చైనా యువాన్‌చ్వాంగ్ తెలియజేశాడు.

57 విక్రమ శకారంభం. విక్రమాదిత్యుడు శకులను యితరవిదేశీయులనూ పారమార్చి ఉజ్జయినీనగరాన్ని రాజధానిగా చేసుకొని రాజ్యమునేలాడు. యితను కాశ్మీరును జయించి మాతృగుప్తునకు కాశ్మీరునిచ్చాడు. కథాసరిత్సాగరములోని శిలలంబకములోని విషయాదిత్యుడే విక్రమాదిత్యుడు యితని అసలు పేరు హర్షుడు. యితను గర్ధభిల్లుని పుత్రుడు.

38–30 కుంతల శాతకర్ణి శాతవాహనవంశంలో పదకొండవవాడు. యితను 8 సం|| మాత్రమే పరిపాలనచేశాడు. యితను ప్రాకృతానికి మారుగా సంస్కృతాన్ని రాజభాషచేశాడు. గుణాఢ్యుడు యితని ఆస్థాన పండితుడు.

30–6 మొదటి పులోమావి. పాటలీపుత్రంపై దాడీచేసి సుశర్మను చంపి ఆ నగరాన్ని ఆక్రమించుకొన్నాడు.

27 శాతవాహనవంశస్థుడైన సిముక లేక సింధుక్ అనునతను మగధను పాలిస్తున్న కణ్వవంశస్థుడైన సుశర్మను సంహరించి మగధసామ్రాజ్యంపైన అధికారాన్ని సంపాదించాడు. కానీ యీ అధికారం చాలా కాలము నిల్వలేదు. శిముకుని అనంతరం యితని సోదరుడు. కృష్ణ (కన్హ) అధికారానికి వచ్చాడు. యితని అనంతరం శిముకుని కుమారుడు శాతకర్ణి రాజ్యాధికారానికి వచ్చాడు. యితను మహారాష్ట్ర మహారథుని పుత్రిక నాగనిని వివాహమాడాడు. (సిముకుడు పులోమావి యిద్దరు ఒకరేకావచ్చు).

21 లో రోమన్ చక్రవర్తి అయిన అగస్టస్ వద్దకు భారతరాయబార వర్గము వెళ్లినది. రాయబారివర్గ సభ్యులు ఎక్కువమందే బయలుదేరినప్పటికీ రోమ్ చేరుకునేసరికి ముగ్గురు మాత్రమే మిగిలారు. అని నికోలాచ్ తెలియజేశాడు. భారత రాజయిన పోరస్ వద్దనుంచి యీ రాయవర్గం ఒకలేఖతో పాటు చేతులులేని హెర్మస్ ప్రతిమఒకటిన్నీ పెద్దసర్పములు (10 మూరలు వరకు పరిమాణంగలవి) ఒకతాబేలు, ఒకగొప్ప పావురము వగైరాలను కానుకగా (అగస్టస్‌కు) తీసుకెళ్లారు. రాయబారవర్గంలో వెళ్లిన ఒకయోగి పుంగవుడు. ఎథెన్సునగరంలో అగ్నిప్రవేశంచేసి అమృతత్వాన్ని పొందాడు.

యీాయనసమాధిపై బర్గోసానగర నివాసియగు భారతీయశ్రమణకుడు అని వ్రాయబడివుందట. (బర్గోసా భారుకచ్ఛము) పారస్ రాజు పులోమావి యని విద్యాలంకారుడు వ్యాఖ్యానించాడు.

18 రోహగుప్తుడు యితను జైనమతంలోని ఆరవశాఖకు ముఖ్యోపదేశకుడు. యితనే వైశేషిక దర్శనమూలకర్త అని ప్రాచీనజైనగ్రంథమైన "ఆవశ్యక" లో చెప్పబడింది.

---

క్రీ. శ. 14 లో ఆగస్టసు (రోమ్ చక్రవర్తి) మరణం.

19–24 హాలుడు పూర్వ శాతవాహనరాజులలో. యితను ఆఖరువాడు. యితని ఆధ్వర్యంలోనే గాధాసప్తశతి సంకలనం చేయబడింది. సింహళ రాజకన్య అయిన లీలావతిని హాలుడు భీమేశ్వర క్షేత్రంలో వివాహ మాడాడు.

20 బాదరాయణుని కాలమని కీల్ పండితుని అభిప్రాయం (మహాభారతము కర్త అయిన వేదవ్యాసుడు కాదు యీ బాదరాయణుడు).

30 లో ఏసుక్రీస్తు కొరతవేయబడ్డాడు.

40–78 కుషాణులు క్రీ|| పూ|| 165 లో హింగణీ (హూణ) జాతి చీనాపై దండయాత్ర చేసినపుడు యూ. హ. చీ. జాతి అయిదు భాగాలుగా విడిపోయారు. యిందులో కు. ఎ. ఈ. శుఅంగ్ శాఖ కుషాణజాతిగా రూపొందింది. యీ తెగలోనివాడైన కుజలాకర కైడఫిసస్ కుషాణవంశ ప్రథమపరిపాలకుడని గుర్తింపబడింది. యితను కాబూలు, తక్షశిల వగైరా ప్రాంతాలను పాలించాడు.

52 లో సంత్ దామస్ అను క్రైస్తవఫాదిరీ మలబారులో మత ప్రచారము చేసేందుకు వచ్చాడు. యితను సిరియన్ క్రైస్తవుడు. సిరియన్ క్రైస్తవులు నేటికీ మలబారులో వున్నారు.

క్రీ|| శ|| 67 లో కశ్యాపమతంగుడు మింగ్ టీ చక్రవర్తి కాలంలో చైనా వెళ్లిన ప్రథము బౌద్ధపండితుడు యితను చైనాలో లోయాంగ్ లో స్థిరపడిపోయారు.

71 లో జైనమతంలో నాజీనకశాఖ బయలుదేరింది. దోహగుప్తుడు యీ శాఖకు ప్రముఖకారకుడు.

78 శాలివాహన శకారంభం.

78 లో జైనమతంలో అదివరకే అటూయిటూగా వుంటూవొచ్చిన శ్వేతాంబర దిగంబర శాఖలు పూర్తిగావిడిపోయాయి. దిగంబరశాఖ నగ్నత్వానికి ప్రాముఖ్యతనిచ్చింది. యీ శాఖప్రాబల్యఫలితమే జైనప్రతిమలు నగ్నత్వంతో విలిసిల్లాయి.

78 తర్వాత కైడఫిసస్ రాజ్యానికి వచ్చాడు. యితను కుషానవంశస్థుడైన కుజలాకిగ కైడఫిసస్ కుమారుడు పంజాబుపశ్చిమోత్తర ప్రదేశం కూడా యితని పాలనలోకివచ్చింది.

78–102 గౌతమీపుత్రి శాతకర్ణి యితనుమహారాష్ట్ర ఉత్తరకొంకణ సౌరాష్ట్రమాలవ విదర్భరాజ్యాలనుకూడా జయించినట్లు యితనితల్లి బాలశ్రీ వేయించిన నాసికశాసనంద్వారా తెలియవస్తున్నది. యితని సామ్రాజ్యం దక్షిణాన కడలూరునుండి ఉత్తరాన ముఖలింగంవరకు బంగాళాఖాతం నుండి అరేబియాసముద్రంవరకు వ్యాపించివుండినది.

100 ప్రాంతం ప్లీనీ నాచురల్ హిష్టరీరచన.

100–200 మధ్యకాలం బహుశాశబరస్వామి కాలం కావచ్చు. 200–500 మధ్యవాడని జాకోబీ పండితుని అభిప్రాయం.

100 ఆర్యరక్షితుడు జైనపండితుడు. అనుయోగద్వారము అను గ్రంథాన్ని రచించినవాడు.

100 అశ్వఘోషుడు యితను కనిష్కుని సమకాలీనుడు. మంత్రి కూడా మహాయాన బౌద్ధ విస్తరణకు కారకుడు. ప్రథమంలో యోగాచార శాఖీయుడైన బ్రాహ్మణుడు.

100 ప్రాంతపువాడు పంచశిఖుడని గార్బేపండితుని అభిప్రాయం.

100 ప్రాంతం ఉమాస్వామిఆచార్యులు తత్వార్థసూత్రము రచించిన జైనమతావలంబి.

100 ప్రాంతం శూద్రకుడు పరిపాలకుడు సాహిత్యవేత్త. యితను రచించిన మృచ్ఛకటికము నేటికీ సుప్రసిద్ధము. (మృచ్ఛకటికరచనాకాలం 6వ, శతాబ్దమని కొందరి అభిప్రాయం).

100 ప్రాంతం మాఠరుడు. యితను సాంఖ్యకారికకు మఠ్రినామక-అను వ్యాఖ్యాగ్రంథాన్ని రచించాడు.

100 ప్రాంతం వాడు శబరస్వామి అని రాధాక్రిష్ణన్ అభిప్రాయము కాగా కాదు. 400 కు చెందినవాడని ఎ. బి. కీత్ అభిప్రాయం.

105 లో త్సాయిలూన్-అను చైనాదేశీయుడు కాగితాన్ని తయారు చేసే పద్ధతిని కనిపెట్టాడు.

120 కనిష్కుడు. పారశీకపు పార్థియనుల సామంతులు. భారత దేశం ప్రవేశించి. పంజాబులోని తక్షశిలవద్దా. యమునా నదీతీరంలోని మధురవద్దా, మాళవదేశంలోను, చిన్న చిన్న రాజ్యాలను స్థాపించారు. వీరినే శకులుఅనికూడా పిలుస్తారు. వీరిలో ప్రసిద్ధికివచ్చినవాడు. యితను క్రీ॥ శ॥ 75 నాటివాడని కొందరి అభిప్రాయం యితను పెషావరు (పురుష పురము) రాజధానిగా కాశ్మీరు, మాళవ, పాంచాలాది రాష్ట్రిలలో కొంత భాగాన్ని స్వాధీనంచేసుకొని తుర్కాలోని చాలాభాగంకూడా ఆక్రమించాడు. యితనికాలంలో రోము చీనా దేశాలలో భారతదేశం ఎక్కువ సంబంధాలను కల్గియుండేడిది. తక్షశిల విశ్వవిద్యాలయాన్ని యితను అభి వృద్ధిచేసి పోషించాడు. బౌద్ధమత విస్తరణకు అశోకుని అనంతరం రెండవ వాడు కనిష్కుడుకూడా. యితని అనంతరం యితని వంశీయులు సమర్థులు కాని కారణంగా త్వరలోనే యితనివంశం క్షీణించింది. (యితను కుషాణ వంశస్తుడనికూడా ప్రతీతి.) కనిష్కుడు చైనా చక్రవర్తితో విరోధం పెంచుకొని చైనాపై దండయాత్రలుకూడా చేసి పరాజితుడై చైనా చక్రవర్తికి కప్పంకూడా యిచ్చుకొన్నాడు.

124 ప్రాంతంలో నహాపనా క్షత్రపుడు. శాతవాహనుని ఆధీనం క్రిందనున్న కాన్హా ప్రాంతాన్ని ఆక్రమించాడు.

130–150 ప్రాంతంలో-టోల్మీ-అను చరిత్రకారుడు. ఆంధ్ర ప్రాంతంలో సంచారంచేసినాడు యితను నాటికాలంలో భూగోళశాస్త్రజ్ఞుడు యితని రచనలు నేడు చాలా ఉపయుక్తము లైనవిగా వుంటున్నవి.

138–154 గౌతమీపుత్ర శాతకర్ణి. ఆంధ్రసార్వభౌముడు. యితని కాలం 78–102 అనికొందరు 109–130 అని కొందరు అభిప్రాయాన్నిస్తున్నారు. యితను శాతవాహన వంశస్థుడు. తల్లి గౌతమీ బలశ్రీ. యితని కాలంలో శాతవాహన వంశంకోల్పోయిన ప్రతిష్ఠను తిరిగి సంపాదించింది యితను వైదిక ధర్మాన్ని ప్రోత్సహించాడు.

యితని కాలంలో శకుడు అయిన మహా క్షత్రపరుద్రుడమను పుత్రిక కుమారుడైన పులమావికి వివాహం చేసుకొని బంధుత్వాన్ని సంపాదించారు కానీ వీరిమధ్య యుద్ధాలు మాత్రం అనివార్యంగా సాగుతూనేవుండి పోయాయి.

138–200 మధ్యకాలంలో ఆచార్య నాగార్జునుడు నాగార్జునకొండ (ఆంధ్ర) వద్దనివసించాడు. యితని జన్మస్థలం. నాగార్జునకొండకు ఆరు మైళ్లలోనున్న వెంతోటపురమని చెప్పబడుతూవుంది. యితను అనేక గ్రంథాలను రచించిన సాహిత్యోపాసకుడు అందులో యిరువదినాలుగు. నేడు ప్రచారంలోవున్నవి. యితని అనేకమంది శిష్యులలో దిగ్గంతులైన వారు ఆర్యదేవుడు, స్థలిరబుద్ధి, భావవివేకుడు, చంద్రకీర్తి, శాంతిదేవుడు, వసుబంధు, వగైరాలు. ప్రధమంలో వైదికుడు.

130 వాష్టీ పుత్రపులమావి. రాజ్యానికి వచ్చాడు. గౌతమీపుత్ర శాతకర్ణికుమారుడు.

150 నాటివాడుకణాదుడని కొందరి అభిప్రాయం.

150 శ్రీ శాంతమూలుడు. యితను ఆంధ్ర యిక్ష్వాకు సామ్రాజ్య స్థాపకుడు. యితని పుత్రుడు వీరపురుష రత్తుడు. యితని పుత్రిక శాంతిశ్రీ. యీమె పూణీయ వంశీయుడైన, కందశ్రీని వివాహమాడింది బౌద్ధారామాలకు, విరివిగా ధనసహాయకచేసి ప్రోత్సహించింది. వీరపురుష దత్తుడు తం రెండవ మేనత్త పుత్రికఅయిన బాలశ్రీని వివాహమాడాడు

174–203 యజ్ఞశ్రీ శాతకర్ణి కాలం. ఆచార్యనాగార్జునుడు యితని ఆస్థాన పండితుడు నాగార్జునకొండవద్ద పారావత విహారాన్ని కట్టించాడు శాతవాహన పతనకాలంలో పాలించిన వారిలో యితను ప్రముఖుడు యితని తర్వాత యీవంశస్థులు మరి ముగ్గురు రాజులు పాలించారు కానీ పరిపాలన నిర్విఘ్నంగా సాగింది. ధాన్యకటకం రాజధాని.

180–300 మధ్యకాలం. శబరస్వామి పంచాశిఖుల కాలమని కొందరి అభిప్రాయం.

199 నుండి 226 వరకు ఉజ్జయినీ రాజ్యాన్ని శ్రీవృషభ–రుద్రసేనుడు పరిపాలించాడు. యితను శాంతమూలుని సమకాలికుడు యితనికుమార్తె శ్రీధరభట్టారికను. శాంతమూలుని పుత్రుడు వీరపురుషదత్తుడు వివాహమాడాడు.

199–230 మధ్యమహాతలవరి. మహాసేనాని. మహాదండనాయక స్కంద విశాఖనాగుడు. యితనికి మరొక పేరు కందశ్రీ. యితను యిక్ష్వాకు శాంతమూలుని పుత్రికఅయిన అడవి శాంతశ్రీని. వివాహమాడాడు.

2వ॥ శ॥ ఇండోచైనాలోని చంపారాజ్యాన్ని భారతదేశ ఆంధ్ర రాజులు. పరిపాలించారు. ఇంతచైనాలో, అన్నామ్, అమరావతి, విజయ అను తెలుగు ఉచ్చారణగల రాష్ట్రాలు కూడాఉన్నవి. శ్రీమార–అను నతను పరిపాలించాడు. యిక్కడ వసిష్టపుత్రి శాతకర్ణి రుద్రదామణ్, వగైరా తెలుగురాజుల శాశనాలుకూడా దొరికినవి. వీటిపైన తెలుగు ఇండో చైనా తీపులుకలవు. తర్వాత యీదేశాన్ని పాలించిన భద్రవర్మ అను. తెలుగురాజు చతుర్వేదాల నభ్యసించిన గొప్పపండితుడని ప్రసిద్ధిపొందాడు కూడా చంపాకు పశ్చిమువైపుననున్న ఫునాన్ అను రాజ్యాన్ని కొటన్యుడను తెలుగురాజు పరిపాలించాడు. యితనితర్వాత పాలించిన చంద్రవర్మ వేంగీ దేశంతో సంబంధాలు పెట్టుకొని తనరాయబారులను చాలాతూర్లు పంపుతూ వుండినాడు

200–600 పల్లవుల పరిపాలనా కాలం కంచి (కంజీవరం) రాజ ధాని గా కీృష్ణకు దక్షిణానవున్న ఆంధ్రదేశాన్ని వీరుపరిపాలించారు.

200–600 మధ్యకాలంలో పల్లవుల విష్ణుకుండిన రాజుల పరిపాలన జరిగింది యీ కాలంలోనే నిరంకుశ భూస్వామి రాజ్యాంగ యంత్రం నెల కొల్పబడినట్లు తెలుస్తూవుంది.

200 నాటికి శాతవాహన రాజ్యం అస్తమించింది. యీవంశస్థులు క్రీ॥ పూ॥ 200 లో పరిపాలన ఆరంభించి 400 ఏండ్లు పాలించారు. యజ్ఞశ్రీ శాతకర్ణితర్వాత ఒకరిద్దరు పరిపాలన సాగించినప్పటికీ వీరుప్రసిద్ధులు కారు.

218 వాసిష్ఠీపుత్రి. బహుబలశాంతిమూలుడు. యితను వీరపురుష దత్తుని కుమారుడు యితని చెల్లెలు. కంద బలశ్రీ వనవాస మహారాణి యితను వైదికమతావలంబుడయి యజ్ఞయాగాలు చేశాడు వీరిస్త్రీలు నాగార్జున కొండ బౌద్ధారామాలకు విరివిగా దానాలుచేశారు.

250 ప్రాంతంలో నాగార్జునకొండవద్ద ఇక్ష్వాకురాజులు ఒకశాసనం వేయించారు.

250 ప్రాంతం అక్షపాదుడు లేక గౌతముడు అని కొందరి అభిప్రాయం యితను శబ్దసమాధోపాసకుడు. ఈశ్వరుడు కర్మఫలంకారణవాది. జీవసర్వవ్యాపకుడు వగైరాలు యితనిసిద్ధాంతాలు. (యితను న్యాయదర్శన వేత్త అయిన గౌతముడు మాత్రంకాదు. అతనే యితనని కొందరి అపోహ మాత్రమే.)

250 హరివర్మ న్యాయశాస్త్రాన్ని విపులీకరించినవాడు

270–85 జయవర్మ కృష్ణాజిల్లా కోడూరు రాజధానిగా పరిపాలించిన స్థానిక ప్రభువు బృహత్పలాయన వంశస్థుడు.

275 లో పల్లవులు దాడిచేసి ఇక్ష్వాకులను జయించి కృష్ణాజిల్లాలోని దక్షిణభాగాన్ని వారిరాజ్యంలో కలుపుకున్నారు. పల్లవులు వైదికసాంకు పరిపాలనసాగించారు.

295–315 దామోదరవర్మ యితను కందారరాజు చేజెర్లరాజధానిగా పరిపాలన సాగించాడు. పల్లవరాజు లితనిని ఓడించి సామంతునిగా చేసుకున్నారు.

300 ప్రా॥ జైమినికాలమని కొందరియూహ.

300 ప్రా॥ వ్యాసుడు పరబ్రహ్మవాది. ఉపనిషత్‌ల సమన్వయం చేసినవాడు. గ్రంథజ్ఞానాని ప్రాముఖ్యతనిచ్చువాడు. (వేదవ్యాసుడుకాదు)

300–420 సాలంకాయనుల కాలం వీరు వేంగి రాజధానిగా కృష్ణ గోదావరి మధ్య ప్రాంతాన్ని పాలించారు. వీరు మొత్తం ఆరుగురురాజులు పరిపాలనచేశారు. వీరు బౌద్ధవైదికమతాలను సమంగా ఆదరించారు.

300–400 మధ్య కరికాళచోళుడు యితను చోళవంశపు మూల

పురుషుడు కావేరీనదికి ఆనకట్టకట్టించినవాడు.

3 వ॥ శ॥ సింహళరాజవంశ చరిత్రయైన "మహావంశము" లో నాగార్జునుని శిష్యుడైన ఆర్యదేవుడు 3వ॥శ॥లో పాలించిన విహారతిష్యునకు సమకాలీనుడని పేర్కొనబడింది.

300 నాగార్జునునికాలమని డా॥ విద్యాభూషణుని అభిప్రాయం.

3 వ॥ శ॥ అసంగుడు యోగాచార శాఖాస్థాపకుడు.

308 మగధరాజాన్ని గుప్తవంశపురాజులలోని వాడగు చంద్రగుప్తుడు వశపర్చుకొని సామ్రాజ్యాన్ని సుస్థిరంచేసి మగధరాజ్యాన్ని పతనావస్థ నుంచీ ఉచ్ఛస్థితికి తీసుకొని వచ్చాడు.

320 గుప్తవంశీయుల సామ్రాజ్యారంభకాలపునాలని కొందరి అభిప్రాయం.

331 సముద్రగుప్తుడు (మగధరాజ్యాన్ని ఆక్రమించిన చంద్రగుప్తుని కొడుకు) ప్రసిద్ధ సంస్కృత చంపూరచయితయగు హరిసేనుడు యితని ఆస్థానపండితుడు. ఆంధ్రదేశపు కళింగరాజు మహేంద్రునీ (పిష్టపురము పిఠాపురము) యితని రాజధాని) వేంగిసమీపంలో (ఏలూరు) కంచిరాజగు విష్ణుగోపునిఓడించి, అటునుంచి వెనకకు మళ్లిమహారాష్ట్రాన్ని వశపరకొని 350 ప్రాంతంకల్లా పాటలీపుత్రంచేరుకున్నాడు. 342–43 లో యితను వేంగీపైదాడిచేశాడని తెలుస్తూవుంది. యితను దాదాపు భారతదేశాన్నంతా జయించి సువిశాల సామ్రాజ్యాన్ని స్థాపించాడు. ఆర్యావర్త రాజులైన రుద్రదేవుడు, మాతిల, నాగదత్త, చంద్రవర్మ, గణపతినాగ, నాగసేన, నందిన అచ్యుతబలవర్మ వగైరాలనంతా పరాజితులకావించి, మూరాలన్నింటి పైన అధికారాన్ని సంపాదించాడు. దక్షిణాపథరాజులైన కోసల మహేంద్ర మంటరాజు కొట్టూరుస్వామి దత్తుడు. కంచివిష్ణుగోపుడు వేంగి హస్తివర్మ దేవరాష్ట్రకుబేరుడు. మహాకాంతార వ్యాఘ్రరాజు పిష్టపుర మహేంద్రుడు ఎరండపల్లదమనుడు అవముక్తనీలరాజు పాలక్క ఉగ్రసేనుడు కుస్థలపురపు ధనంజయుడు వగైరా రాజులనందరినీ జయించి తిరిగీ వారివారి రాజ్యాలను వారికే యిచ్చివేశాడు. యితను యింకా ఆటవికరాజులను కూడా జయించినట్లు చెప్పబడుతూవుంది. 375 ప్రాంతంలో సముద్రగుప్తుడు మరణించాడు.

337 కాన్‌స్టాంటిన్ మరణం.

350 నుంచీ 440 వరకు. పిఠాపురం రాజధానిగా దక్షిణకళింగను మాఠర వంశస్తులు పరిపాలించారు. యీవంశంలోని ప్రథముడు వాసిష్టీ పుత్రి శక్తివర్మ వీరితర్వాత గుణవర్మ ప్రభంజనవర్మ అనంతవర్మ విల మంచిలిరాజధానిగా 485 వరకు పరిపాలించినతర్వాత యీవంశం అంత రించింది.

361లో జూలియస్. అను రోమ్‌చక్రవర్తి వద్దకు భారతదేశంనుంచి రాయబారివర్గం కానుకలను తీసికొనివెళ్లినట్లు 390లో మరణించిన॥ అమ్మి యనుస్ మార్సెల్లినుస్॥ వ్రాసినాడు. యిదేవిషయాన్ని 385లో మరణించిన సెక్స్‌ట్ అరెల్లియస్॥ కూడా తెలియజేశాడు.

369–489 మధ్య కాకతీయ వంశస్థుడు అయిన మాధవవర్మ చిన్న పరి పాలకుడుడయాడు యితనితో ప్రారంభమయిన కాకతీయ సామ్రాజ్యము మూడుపూలు అరుకాయలుగా విలసిల్లి 1292–1369 మధ్యపాలించిన (రెండవ) ప్రతాపరుద్రునితో అంతమయింది.

375 రెండవచంద్రగుప్తుడు (యితను సముద్రగుప్తుని కుమారుడు) విక్రమాదిత్యుడుఅను బిరుదాన్ని పొందినవాడు యితను తనసామ్రాజ్యాన్ని మాళవ ఘూర్జర. దేశముల సముద్రతీరం వరకు విస్తరింప జేశాడు. యితర దేశాలలో వర్తకవ్యాపారభివృద్ధి విశేషంజరిగిన కాలమిది. యితని కాలంలో పశ్చిమ దేశపు శకవంశం నశించి. గుప్తసామ్రాజ్యంలో కలిసిపోయింది యితను 413లో చనిపోయాడు యితని అనంతరం యితనికుమారుడు. కుమారగుప్తుడు. వగైరా గుప్తవంశీయులు 6వ॥ శ॥ వరకు పరిపాలించారు. యీగుప్తసామ్రాటులంతా. హిందూ (వైదిక) సంస్కృత పరులైనప్పటికి బౌద్ధమతాన్నికూడా ప్రోత్స హించాడు.

395–420 అత్తివర్మ. నర్సరావుపేట చేజెర్లరాజధానీగా పరిపాలన సాగించిన స్థానిక ప్రభువు.

399 ఫాహియాన్ చైనాయాత్రికుడు. యితను 399 లో భారత దేశంవచ్చి 14 సంవత్సరాలు భారతదేశంలో పర్యటించాడు. యితని యితని యాత్రావిశేష వర్ణనలు భారతదేశపు గుప్తరాజుల కాలాన్నే

సంస్కృతినీ తెలుసుకోనేందుకు చాలా ఉపయుక్తంగా ఉంటున్నవి.

400 ప్రాంతం. దిఙ్నాగుడు. యితను ఆంధ్రబౌద్ధభిక్షువు నలందా విద్యాలయ పరిషత్సభాపతిగాకూడా వుండినాడు. చైనాయాత్రికుడు హుయాన్ సాన్ యితనివద్ద శిష్యత్వాన్ని పొందినట్లు చెప్పబడుతూ వుంది. యితను వసుబంధుని శిష్యుడు. వాత్స్యాయనుని న్యాయభాష్యాన్ని ఖండిస్తూ|| ప్రమాణసముచ్చయం — న్యాయప్రవేశ|| హేతుచక్రడమరు|| అలంబన పరీక్ష ప్రమాణశాస్త్రపరీక్ష వగైరా గ్రంథాలను రచించాడు. వీటి ద్వారా న్యాయశాస్త్ర విపులీకరణకూడా జరిగింది. యితను ఎక్కువకాలం వేంగిలో నివసించినట్లు చెప్పబడుతూవుంది.

4–5 శ|| కాళిదాసు. యితను గుప్తసామ్రాట్టుల కాలంలోనివాడు హరిసేనుడు, ఆర్యభట్టు, వరాహమిహిరుడు. వగైరాలంతాగుప్తకాలపువారే 4వ|| శ లో పల్లవరాజులు. నెల్లూరు రాజధానిగా జమ్మలమడుగు (రేనాడు) పొద్దుటూరు. పులివెందుల వగైరా ప్రాంతములను పాలించారు.

400 ప్రాంతం—అసంగుడు. మాయావాది.

400 పతంజలి. సిద్ధి—సమాధీవాదం ద్వైతవాదం యితనిసిద్ధాంతాలు (క్రీ|| పూర్వపు పతంజలి కాదు యితని)

4వ|| శ తాబ్దారంభంలో అకృష్ణుడు. యితను వసుబంధునికిపూర్వుడు కాళిదాసు ఈశీతకృష్ణుడు యిద్దరు ఒకరేనని చెప్పేందుకు ఆధారలున్నాయని స్వస్నేశ్వరుడు చెప్పాడు.

4వ|| శ పూర్వార్ధమునకు చెందినవాడు. వసుబంధువు. అసంగుడు ననికూడా చెప్పబడుతువుంది

4 వ|| శ|| వాడు వాత్స్యాయనుడనిన్నీ దక్షిణభారతీయుడనిన్నీ డా|| విద్యాభూషణుని అభిప్రాయం.

407 లో కుమారవిజయుడు. నాగార్జునుని గ్రంథములను చీనా భాషలోనికి అనువదించాడు నాగార్జునుడు క్రీ|| శ|| 2వ శతాబ్దానికి చెందిన వాడని యితను తెలియజేశాడు. చైనాకూడావెళ్లి వచ్చాడు.

420 నుంచి 620 వరకు రెండువందల ఏండ్లు ఆంధ్రదేశాన్ని విష్ణు

కుండినరాజులు. పరిపాలించారు. వీరుధాన్యకటకం రాజధానిగా కృష్ణా గోదావరి మధ్యప్రాంతాన్ని పాలించారు (యీకాలంలో కళింగదేశం. మారఠ గాంగవంశస్థుల పాలనక్రింద వుండినది.) యీవంశంలో (విష్ణుకుండిన) మొత్తం. 9మంది రాజులుపరిపాలించారు మాధవవర్మ యీవంశస్థాపకుడు యితను (420-53) అశ్వమేధ. రాజసూయయాగాలనుచేశాడు. అమరావతీ స్థూపాన్ని ధ్వంసం చేయించినట్లు చెప్పబడుతూవుంది. వేంగీకూడా వీరి పాలనలో ఉండినది.

430 శబరుడు. తర్వాతివాడే కానీ, పూర్వవువాడుకాదని కీత్ పండితుని అభిప్రాయం.

431 సుగుణవర్మ. యితను నాగార్జునుడు సాతవాహన చక్రవర్తికి వ్రాసిన సుహృదయలేఖను సంస్కృతంలోకి అనువదించాడు.

450 లో విలష్ణుకుండో మాధవవర్మ, అశ్వమేధ. రాజసూయ యాగాలు చేయుట.

453 లో అత్తిలుని మరణం.

458–88 చాళుక్య విజయాదిత్యుడు. యితను త్రిలోచన పల్లవునితో పోరాడి ఓడిపోయాడు. యితనిభార్య గర్భవతిగావుండి కడపజిల్లా ముదివేముల అనుగ్రామంలోని విష్ణుశర్మఅను బ్రాహ్మణుని యింటిలో తలదాచుకొనింది. యీమెకు పుట్టిన వాడే విష్ణువర్ధనుడు. చాళుక్య అనుపేరు చళుకీ– చల్కి–. సలుకి. సమీఅను ద్రావిడపదాల రూపాంతరమేనని|| కీ|| శే|| కొమర్రాజు లక్ష్మణరావుగారు తెల్పారు. దీన్నిబట్టి. చాళుక్యులు దక్షిణాది ద్రావిడజాతికి చెందినవారేనన్నే విషయం స్పష్టమవుతూవుంది.

458–88 త్రిలోచన పల్లవుడు, యితనిరాజధాని. కంచి. యితను కడపవద్ద చాళుక్య విజయాదిత్యుని ఓడించి. ఆంధ్రదేశాన్నంతా జయించాలనే తలంపుతో. తీవ్రప్రయత్నంచేసి కావేరినది సరిహద్దులవరకు వెళ్లాడు కానీ. కావేరిపట్టణము రాజధానిగా పరిపాలన చేస్తూవుండిన కరికాళ చోళుడు. ఆంధ్రప్రదేశపు మాధవవర్మ యిద్దరూ కలిసి. కావేరీముఖ ముఖద్వారం వద్దనే త్రిలోచన పల్లవుని ఓడించి. అతని సామ్రాజ్య వాంఛ ధ్వంసంచేసి వేశాడు.

475లో ఆర్యభట్టు జననం. యితను ప్రఖ్యాత జ్యోతిష్ శాస్త్ర పండితుడు. ఆర్యసిద్ధాంతం అనుగ్రంథాన్ని కూడా రచించాడు. యితనినే భారతదేశంలో సౌర. కేంద్రీయ. మతప్రచారం చేసినవాడు భూమి. అన్యోన్యగ్రహాలు. సూర్యునిచుట్టు ప్రదక్షిణచేస్తున్నవి. అని నిరూపించాడు బీజగణిత శాస్త్రాన్ని కూడా రచించాడు.

484 లోహీరోడోటస్—అను గ్రీక్ చారిత్రకారుడు. భారతదేశాన్ని గురించి ఒకగ్రంథాన్ని రాశాడు.

497 ప్రాంతం నాగవంశపురాజుల పరిపాలన ఆరంభమయింది. మొదట్లో దంతపురివీరికి రాజధాని 570 తర్వాత ముఖలింగం రాజధానిగా పరిపాలించారు. వీరిపరిపాలన 15వ|| శ|| లో గజపతిరాజులు తలయెత్తే వరకు సాగుతూనేవొచ్చింది. 7వ శ|| అనంతరం. గాంగరాజులు కటకం— నగరాన్ని రాజధానిగా చేసుకొన్నారు.

5వ|| శ|| మహాకవి దండి. యితను ప్రఖ్యాతిచెందిన ప్రాచీనమహా కవులలో నొకరు. యితను రచించిన కావ్యాదర్శము దశకుమారచరితం, ఛందోవిచ్ఛిత్తి. కళాపరిచ్ఛేధం. అను గ్రంథాలు ప్రముఖస్థాన మాక్రమించాయి.

500 ప్రాంతంలో జగ్గయ్యపేటవద్ద జీవించిన సిద్ధనాగార్జునుడు. రసవాదానికి మూలపురుషుడని చెప్పబడుతూవుంది.

5వ|| శ|| లో ఫాస్సాయెస్ (ఫాహ్యాన్) చైనాయాత్రికుడు భారతదేశంలో పర్యటించుట.

5వ|| శతాబ్దంనుంచి. 10వ శతాబ్దంవరకు. శైవమతాభివృద్ధి నెందిన కాలం.

5వ|| శ|| రాజసింహవర్మ కాలం. పల్లవచక్రవర్తి శైవమతాభిమాని

500 కుమారిలుడు. భవభూతికి గురువుఅని చెప్పబడుతూవుంది. 500–650 మధ్యవాడు.

5వ|| శ|| ప్రశస్తపాదుడు. యితను కణాదుని వైశిక గ్రంథావళి పదార్థ ధర్మ సంగ్రహము|| అనుపేరుతో సూత్రభాష్యం రచించాడు.

500 దిజ్నాగుని కాలమని కొందరి అభిప్రాయం.

5వ॥ శ॥ విజ్ఞానవాదం ఉత్పన్న మయినకాలం.

500-70 మధ్యవారు. ధర్మపాలుడు. పరమార్థుడు వీరిద్దరు వైశేషిక మతవాదులు.

515-46 విష్ణుకుండిన మాధవవర్మ కాలమని చెప్పబడుతూవుంది (బహాయితను మొదటి మాధవవర్మ కాక మరొకరు కావచ్చు. యీవంశస్థు లంతా. అశ్వమేధ రాజసూయయాగాలు చేసినవారే.)

518 లో చైనాయాత్రికుడు. సుంగియున్. భారతదేశమురాక. యితను భారతదేశంలో మూడు సం॥ రములు పర్యటించాడు. యితని యాత్రా విశేషవర్ణనలు నాటి భారతదేశ పరిస్థితిని చక్కగా వర్ణిస్తుంది.

520-600 దిజ్నాగుని కాలమని కొందరి అభిప్రాయం.

522 భాస్కరుడు ప్రఖ్యాత గణితశాస్త్రవేత్త

528 జింపారకులుడు. యితను హూణుడు. యితని రెండవ బాలాదిత్యుడు ఓడించివేశాడు. యీసందర్భంలో మాళవరాజగు యశోధర్ముడు వగైరా హిందూరాజులంతా కలిశారు.

530 లో భారతరాయబారి-కాన్స్టాంటు నోపిల్ను వెళ్లినట్లు జొనన్నెస్ మలాదా॥ తెలియజేశాడు.

550 దాదాపు శ్రీకృష్ణమిత్రుడు వేదాంత సంబంధ నాటకమును రచించినాడు.

546-611 విష్ణుకుండో రాజులలో ఆఖరి. మాధవవర్మ (యీవంశం లో మాధవవర్మలు చాలామంది పరిపాలనచేశారు.) యితనికాలంలోనే గణస్వామి-అను నతడు. ॥జనాశ్రయ ఛందోవిచ్ఛిత్తి ॥అను గ్రంథాన్ని రచించాడు. యీరాజు తనకుమారుడు ఒకనేరంచేసినందుకుగాను. కొరత వేయించాడు. యీకాలంలో న్యాయనిర్ణయం బహుకఠోరంగా ఉండేడిది కాలినూనెలో ముంచటము చెరువులలోముంచటము. వగైరాలుకూడా శిక్షాపద్ధతిలో వుపయోగించేవారు యీకాలంనాటికే తెలుగుల్లో. కంద. గీత. సీసపద్యాలు రచిస్తూవుండినట్లు జనాశ్రయ ఛందోవిచ్ఛిత్తిద్వారా తెలియవస్తున్నది.

550 కారైక్కాల్ అమ్మై. యీమె తమిళదేశం రచయిత్రి. తిరువాలంగాడు నివాసిని. తిరుయిరట్టుమ్. మణిమాలెం. అద్భుతతిరువందాది వగైరా గ్రంథాలు రచించింది. యివి తమిళ వాఙ్మయంలో ప్రథమబంధాలుగా సక్రింపబడ్డాయి.

550 వాతాపిచాళుక్య వంశస్థాపన శక్తిహీనమయిన వాకాటక వంశాన్ని ఓడించి ప్రథమ చాళుక్యపులకేసి యీ వంశాన్ని స్థాపించాడు. పులకేసి వాతాపి రాజధానిగా (నేటిబిజాపూరులోని బాదామి) పాలించాడు. రాజధాని పేరుతోనే వీరు వాతాపిచాళుక్యులు అని చెలామణీఅయినారు. యితను 565 వరకు పాలించి అశ్వమేధయాగంచేసి తన దిగ్విజయాన్ని చాటుకొన్నాడు.

550 నాటి వాడు. గౌడపాదుడని వాల్లెసర్ అభిప్రాయం గౌడపాదుని "కారికను" భావవివేకుని "తర్కజ్వాల" టిబెట్టుభాషాంతరీకరణలో పేర్కొనటాన్ని బట్టి భావవివేకుడు యువాన్ చ్వాంగ్ కు పూర్వపువాడగుట బట్టి యీ నిర్ణయం చేయబడింది.

565 నుంచీ 597 వరకు కీర్తివర్మ పాలించాడు. మొదటి పులకేశి కుమారుడు.

566–97–98 మహారాజకీర్తివర్మ పురురణపరాక్రమ బిరుదువహించినవాడు. చాళుక్యసామ్రాజ్యం యితని కాలంలో విస్తరించింది. బాదామి యితని రాజధాని యితని పుత్రుడు రెండవ పులకేశి.

570 ఆగస్టు 29 తేదీన మహమ్మదు జననం. అరేబియాముఖ్యపట్టణమయిన మెక్కాలో అబ్దుల్లా భార్య అమీనాకు జన్మించాడు. మహమ్మదు పుట్టకమునుపే తండ్రిమరణించాడు. తల్లి కూడా యితని బాల్యమందే చనిపోయింది. అరేబియా ప్రజల్లోనున్న మూఢనమ్మకాలకు వ్యతిరేకంగా పోరాడటంలో చాలా కష్టనష్టాలకు గురిఅయాడు. మహమ్మదు నూతన సూత్రాలను అణచివేసేందుకు మక్కాలోని మతకర్తలూ, పెద్దమనుషులూ మహమ్మదును హింసించటం ప్రారంభించారు, మహమ్మదు తనఅనుచరులతో మదీనాకు పరారిఅయి. అక్కడ నిలదొక్కుకొని. తననూతన మతసాంప్రదాయాలను అమలులో పెట్టేటందుకు. కొన్నియుద్ధాలుకూడాచేసి ఆఖరుకు విజయాన్ని సాధిస్తాడు. యితనికి పెక్కుమంది భార్యలువుండినట్లు

మహమ్మదు జీవితచరిత్రలో చెప్పబడింది. ఇస్లాంమత ప్రవక్త (మూల పురుషుడు.) యితనే

575 నాటిశాసనం కడపజిల్లా కలమల్ల గ్రామం లోలభించింది. తెలుగు శాసనాలలో మొట్టమొదటి దిదేనని చెప్పబడుతూవుంది.

580 ప్రాంతం జినగుప్తుడు. చైనా వెళ్లాడు యితను 37 సంస్కృత గ్రంధాలను చైనాభాషలోనికి అనువదించాడు.

588 కాళిదాసు. విక్రమాదిత్యుని నవరత్నాలలో ప్రథముడుగా చెలామణి అయినవాడు.

590–600 సింహవిష్ణు. పల్లవదేశాన్ని వెలుగులోకి తెచ్చినవాడు (యీ వంశం. సింహళ నాగవంశ రాజ కుమారిని చోళరాజు వివాహ మాడగా ఆమెకుమారుడు తిరిగి సింహళానికి నాగవంశ శాసకుడుగా పోయినాడు. యితను పాలించిన లేక యితనితల్లి జన్మించినస్థలం మణిపల్లివమ్ స్థలనామాన్నిబట్టి యీాతనివంశంవారు పల్లవులుగా చెలామణీ అయారని చెప్పబడుతూవుంది). సింహవిష్ణు కంచిరాజధానిగా చోళ చేర, పాండ్య లంక వగైరాలను జయించి కీర్తిని సంపాదించాడు.

590–650 మధ్యకాలం. కుమారిలుని కాలమని కొందరి అభిప్రాయం. దాక్షిణాత్యుడు బౌద్ధ విద్వేషి. భవభూతి ప్రభాకరుడు మండనమిశ్రుడు యితని శిష్యులేనని చెప్పబడింది.

593 లో అచ్చుపని. చైనాలో ప్రారంభమయిందని చెప్పబడుతూ వుంది.

597 నుంచీ 609 వరకు మంగళేశ్వరుడు పరిపాలించాడు యితను మొదటి పులికేశి కుమారుడు.

6వ॥ శతాబ్దాంతం. క్షుణకుడు యితను రాజా విక్రమాదిత్యుని నవ రత్నాలలో రెండవవాడు. యితను వ్రాసినగ్రంధమేదీ బయల్పడలేదు. కానీ కొన్నిశ్లోకాలు యితని పేరుతోనున్నాయి.

6వ॥శ॥ ఘటకర్పర. విక్రమాదిత్యుని ఆస్థానపండితుడు ॥ఘటకర్పర॥ విక్రమాదిత్యుని ఆస్థానపండితుడు ॥ఘటకర్పర॥ అనుచిన్నపుస్తకాన్ని రచించాడు.

6వ|| శ|| ఘటోత్కర్గ. యితను కాళిదాసాది నవరత్నాలను జయించేందుకు కాళికాదేవినిగూర్చి తపస్సుచేస్తాడు. కాళికాదేవి ప్రత్యక్షమై కాళిదాసు మినహా మిగతావారిని జెయించెందుకు వరము ప్రసాదిస్తాది.

6వ|| శ|| ధన్వంతరి, ఘటకర్పర. క్షపణక వగైరాల సమకాలికుడు యితను వ్రాసిన ప్రత్యేకగ్రంథమేదీ అగుపించదు కానీకొన్నిశ్లోకాలద్వారా యితని ఉనికి తెలియవస్తూవుంది.

6వ|| శ|| బాణభట్టు. సంస్కృతకవి. హర్షచరిత్రము. కాదాంబరీ అను రెండు గద్యకావ్యాలను రచించాడు. చండికాశతకం అనుపద్య కావ్యము పార్వతీ పరిణయమను చిన్ననాటకముకూడా రచించాడు. యితను కన్యాకుబ్జదేశాధిపతి అయిన రాజాహర్షవర్థనుని ఆస్థానపండితుడు.

600 ప్రాంతం—భర్తృహరి. విక్రమాదిత్యుని సోదరుడు. యితను తనభార్య దుశ్చరిత్రకు ఖిన్నుడైవన వాసిఅయినాడని చెప్పబడుతూవుంది. వాక్యా ప్రదీపఆను వ్యాకరణగ్రంథం. భట్టుపేరుతోగల కావ్యము పసిద్ధి చెందిన గ్రంథాలు. కానీ యీశతాబ్దంలోనే యిద్దరు భర్తృహరులు ఉండినారనీ యీరెండుకావ్యాలు ఒకరివేకావనీ. భావించబడుతూవుంది. భర్తృహరి. 7 తూర్లు సన్యాసించి. 7 తూర్లు గార్హస్థం స్వీకరించాడు. భర్తృహరి సుభాషితాలు అనే పదరత్నాలు ప్రసిద్ధిపొందినది.

6వ|| శ|| భానుగుప్తునికాలం. యితని సేనాపతి అయిన గోపరాజు చనిపోగా అతనిభార్య సహగమనం చేసినట్లు శిలా శాసనంద్వారా తెలుస్తున్నది.

600—650 ప్రాంతం. ఎలిఫెంటాగుహల నిర్మాణం జరిగింది. అంచనా కానీ యీగుహనిర్మాణకాలాన్ని తెలియజేసే ఆధారాలు లభ్యం కావటంలేదు. యివి బొంబాయికి పశ్చిమంగా ఆరుమైళ్ళలోనున్న ఒక చిన్నద్వీపంలో నున్నాయి, మహేశుడు (శివుడు) యిక్కడ ప్రధాన శిల్పం (పోర్చుగీసువారికి యిక్కడ ప్రప్రథమంగా ఏనుగు చిత్రం అగుపించింది. దాన్నిబట్టి || ఎలిఫెంటో—అనేపేరు వచ్చింది.

6 వ|| శ|| ప్రభాకరవర్ధనుడు. యితడు హర్షునితండ్రి. యిడు పుత్రిక రాజ్యశ్రీని. మౌఖరిపాలకుడైన గృహవర్మకిచ్చి వివాహంచేశాతని

ప్రభాకరవర్ధనుని మరణానంతరం. బెంగాలు పాలకుడైన శశాంకుడు మాళవపాలకుడైన దేవగుప్తుడు గృహవర్మపై దాడిచేసి గృహవర్మను సంహరించి రాజ్యశ్రీని బందిగా తీసుకెళ్లారు. రాజ్యశ్రీ బందిఖానానుంచి తప్పించుకొని అరణ్యాలలో సంచరిస్తూ వుండగా హర్షుడు ఈమెను వెతికి తీసుకొస్తాడు.

600–30 మహేంద్రవర్మ పల్లవవంశంలో ప్రసిద్ధిచెందిన పరిపాలకుడు యితను శైవభక్తుడుగావుండి. తిరుచినాపల్లి. పల్లవారం వగైరా ప్రదేశాల్లో శైవాలయాలను కట్టించి శైవమత ప్రచారార్థమై చాలాకృషిచేశాడు.

6వ॥ శ॥ ఖినా వరాహమిహురునిభార్య యీమె లంకావాసులద్వారా జ్యోతిర్విద్యను సంపాదించింది. యీవిద్యలో యీమెభర్తా. మామ అయిన వరరుచి. యీమెను కిందుగానే వుండేవారట.

600 దిఙ్నాగుడు. కాళిదాసు సమకాలికుడని కొందరి అభిప్రాయం.

600 దివాకరుడు. సంస్కృతకవి కన్నౌజురాజా హర్షవర్ధనుని ఆస్థానకవి. యితను నిమ్నకులస్థుడైనప్పటికీ హర్షుని ఆస్థానంలో బాణుడు మయూరుడు వగైరాల వలెనే గౌరవింపబడినాడు.

600–700 ప్రాంతం వరకు తెనుగు, కన్నడభాషలలిపి ఒకటిగానే చెలామణీ అయింది. తర్వాత కాలంలో గుండ్రటి అక్షరాలతో తెలుగులిపి ప్రత్యేకతను సంపాదించుకొంది. తెలుగు ద్రావిడభాషా కుటుంబంలో నుంచీ పుట్టిందేననేవిషయం సర్వజనాంగీకారమైనది.

600 ప్రాంతం ప్రభాకరుడు "బృహతి" అను గ్రంథకర్త.

600 ప్రాంతం దండి కాలమని కొందరు.

6 వ॥ శ॥ లో గదంబరాజగు మయూరశర్మ. శ్రీశైలపర్వతము వరకు తన స్వాధీనతచేసుకొని పాలించాడు.

600 నాటికి ఆంధ్రలో బౌద్ధమతం నామావశిష్టమై జైన హిందూ మతాలు మాత్రమే మిగిలాయి.

6 వ॥ శ॥ నుంచే గ్రీసు యిండియాలమధ్య ఎక్కువ సంబంధాలుండినట్లు కనుగొనబడింది.

6–7 శ|| లలో బెంగాలులోని గౌడదేశమునుండి ఆనాటిరాజుల దుష్పరిపాలనకు తాలలేక తెనుగు దేశమువచ్చి గౌడులై తర్వాత జైనమతావలంబులై తర్వాత గోమఠానుయాయులైయుందురని వారి కులదేవతయగు కన్యకాంబను విష్ణువర్ధన రాజు బలాత్కరించె నన్నగాథనుబట్టి వారు 6–7 శతాబ్దాలలోవచ్చియుండెదరని చెప్పవచ్చు.

600 వరాహమిహిరుడు. యితను ఖగోళశాస్త్రంలో ప్రవీణుడు కాళిదాసు వగైరా నవరత్నాలలోనివాడు.

6వ|| శ|| అప్పయ్యదీక్షితుడు. ||కల్పతరుపరిమళ|| మను గ్రంథకర్త కాలం.

6వ|| శ|| పరమార్థునికాలం. బౌద్ధసన్యాసి షష్టితంత్రమనుగ్రంథాన్ని చైనాభాషలోనికి అనువదించటమేగాక భాష్యాన్నికూడా రచించాడు.

6|| వ శ|| నాటికి చైనాలోని ఒక్కలో. యాం రాష్ట్రంలో 10 వేల భారతీయ కుటుంబాలవారు 3 వేలమంది బౌద్ధసన్యాసులూ. నివసిస్తూవుండినారు.

606–36 హర్షవర్ధనుడు. కన్నౌజ్ రాజధానిగా ఉత్తరహిందూస్థానమంతా జయించి సువిశాల సామ్రాజ్యాన్ని స్థాపించాడు యితను బౌద్ధ హిందూ జైనమతస్థుల నందరినీ సమంగా ఆదరించాడు. యితని సోదరుడు రాజవర్ధనుడు చనిపోగా 16 సం|| వయస్సులోనే యితను సింహాసనాన్నధిష్టించాడు యితనితండ్రి ప్రభాకరవర్ధనుడు. కాదంబరి. గ్రంథకర్త అగు భట్టభాణుడు యితని ఆస్థాన పండితుడు. యితను స్వయంగాకూడా గొప్పవిద్వాంసుడు. రచయిత. సంస్కృతనాటకాలను రచించాడు. బౌద్ధ మతాన్ని స్వీకరించాడు. 629 లో పశ్చిమచాళుక్యుడైన రెండవ పులకేశిపై దండెత్తి ఓడిపోయాడు. యితని అంత్యదశ 643లో బెంగాల్ సముద్ర ప్రాంతంలోనున్న గంజాంపై ఆక్రమణచేసి విజయాన్ని స్థాపించాడు. యితనికాలం 610 నుంచీ 650 అనీ 628 నుంచీ 648 అనికూడా పరిశోధకులు అంటున్నారు.

606–42 రెండవ పులకేశి. వాతాపిచాళుక్య వంశస్థుడు. యితను యితనివంశస్థుడేఅయిన మంగళేశ్వరుని పదవీచ్యుతునిజేసి సింహాసనాన్ని.,

ఆక్రమించాడు. కంచిని పాలిస్తున్న, పల్లవ మహేంద్రవర్మను ఓడించి కదంబ వంశస్థులనుంచీ కర్నాటకాన్ని జయించి వేంగికి, తనసోదరుని పరిపాలకునిగా నియమించాడు. యీవిధంగా తూర్పుచాళుక్యశాఖ ఒకటి తయారయింది. అనేక విజయాలు సాధించినకారణంగా పరమేశ్వర అనే బిరుదంపొందాడు. పారశీకసామ్రాట్ రెండవ ఖుస్రూతోకూడా రెండవ పులకేసి దౌత్యసంబంధాలను కల్గివుండినాడు. ఆఖరులో పల్లవ నరసింహవర్మ దాడిచేసి రెండవ పులకేశిని సంహరించాడు. అనంతరం 13 స॥ వరకు చాళుక్యసింహాసనం. అస్తుబిస్తుగా వుండిపోయింది.

610 హేరాక్లియస రాజ్యపాలనారంభం

611 సత్యాశ్రయ పులకేశి. యితను మహారాష్ట్రదేశంలో. బాదామి నగరాన్ని రాజధానిగా. దక్షిణహిందూదేశాన్ని పాలించాడు ఆంధ్రలో విష్ణుకుండినరాజుల ప్రభావం సన్నగిలుతున్న కాలంలో పులకేశి ఆంధ్రదేశముపై దండెత్తి కృష్ణానదీ తీరంలో జరిగిన ఘోరయుద్ధంలో ఆంధ్రరాజులను ఓడించి. పృధ్వీ యువరాజు అను తనసేనానిని రాజప్రతినిధిగా నియమించాడు. కానీ ఆంధ్రరాజులు పులకేశికి సంపూర్ణంగా తలవొగ్గక తిరుగుబాట్లు లేవదీయగా తిరిగీ 624లో పులకేశితమ్ముడైన కుబ్జవర్ధనుడు. ఆంధ్రదేశముపై దండెత్తి కొల్లెరువద్ద. శతృవులనోడించి చాళుక్య రాజ్యానికి (ఆంధ్రలో) శంకుస్థాపనచేశాడు. వేంగీనగరం రాజధానిగా కుబ్జవర్ధనుడు రాజ్యాన్ని స్థాపించాడు.

611 విష్ణుకుండిన రాజ్యాన్ని మూడవ మాధవవర్మ పరిపాలిస్తూ వుండగా ఆంధ్రపై పశ్చిమచాళుక్యుల దండయాత్రలు ప్రారంభమైనవి. విష్ణుకుండిన వంశానికి అంతిమఘడియలివి.

615 కందరాజు. చేజెర్ల రాజధానిగా (నర్సరావుపేట) పరిపాలన సాగించి స్థానిక ప్రభువు. ఆనంద గోత్రికుడు యితను.

616 లో రెండవ పులకేసి (చాళుక్యా) సుశర్మవంశీకుడగు (పల్లవుడు) మహేంద్రవర్మను ఓడించి. వేములకోటను వశపరచుకొని (పులివెందుల) యీప్రాంతమునగల పాళియగాండ్ర నందరను ఓడించి తనదిగ్విజయాత్ర చిహ్నముగా. నొకపట్టణము. పులికేసి విందుల (నేటిపులివెందుల కడప జిల్లా) పేరుతో నిర్మించినట్లు తెలుస్తూవుంది.

620 ఉద్యోతకరుడు. యితను వాత్స్యాయనుని మహాభాష్యానికి—న్యాయవార్తికము—రచించి సమర్థించాడు.

620—80 మధ్య భవభూతి కాలమని కొందరు.

622 మహమ్మదు. అబూ బెకరుతో మదీనాకు పరారీఅయిన సంవత్సరం. దీనినే హజరా అంటారు. అంటే 1952 డిసెంబరు 21 తేదీ నాటికి. 1372 వ హజరీ ప్రారంభమవుతుంది. మొగల్ చక్రవర్తులు ఆమలులోనికి తెచ్చినది ఫసలీ అంటే 1952 జులై 1వ తేదీనాటికి 1362వ ఫసలీ ప్రారంభమవుతుంది. యిది నందన సం॥ ఆషాఢ శుద్ధ నవమి మంగళ వారానికి సరిఅవుతుంది.

625 నుంచి 1118 వరకు ఆంధ్రదేశం వేంగీ చాళుక్యుల పరిపాలనలో ఉండినది. మొత్తం 32 మంది రాజులు పరిపాలించారు. ప్రథమంలో వీరి రాజధాని పిఠాపురం. తర్వాత ఏలూరువద్దనున్న పెదవేగి (వేంగి) 920 నుంచీ 20 వరకు రాజమహేంద్రవరం. రాజధానిగా పరిపాలించారు. యీవంశస్థాపకు (వేంగీచాళుక్య) డయిన కుబ్జవిష్ణువర్ధనుడు. ఆంధ్రదేశంలో గణకోవిదుడై దుర్గమాలను వశపరుచుకొనుటలో అతిచాకచక్యం కనుబరచాడు. కాబట్టి యితనికి—విషమసిద్ధి—అనే బిరుదుకూడా ప్రసాదించబడింది.

628 బ్రహ్మగుప్తుడు ప్రఖ్యాత జ్యోతిశ్శాస్త్రవేత్త.

630—58 నరసింహ్మవర్మ. పల్లవచక్రవర్తి. యితడు పరమేశ్వర బిరుదును వహించిన రెండవపులకేశిని ఓడించటమేకాకుండా పెక్కుమంది రాజులనుకూడా ఓడించాడు. యితను నిర్మించిన మందిరాలలో మామల్లపురపు (మహాబలిపురం) మందిరనిర్మాణం మహాద్భుతమైనది. నరసింహవర్మ అనంతరం యీవంశం. నిర్బలులచేతిమీదుగా నడుస్తూవచ్చి 900 లలో పల్లవ అంతిమరాజు ॥అపరాజితుడు॥ చోళరాజైన ఆదిత్యునిచేఓడిపోవటంతో పల్లవసామ్రాజ్యం చోళసామ్రాజ్యంలో లీనమైపోయింది. నరసింహవర్మను ॥ మామల్ల॥ అనికూడా వ్యవహరించారు.

630లో హుయాన్ సాంగ్ (చైనాయాత్రికుడు) యాత్రకు బయలుదేరి. టర్కిస్థాన్ నుంచి హిందూకుష్ పర్వతాలుదాటి. ఆఫ్గనిస్థాన్

పర్యటించి నాటి కాలంలో శిల్పకళా సంపదలతో అలరారుచుండిన గాంధారరాష్ట్రం చేరుకున్నాడు. గాంధారరాష్ట్రంలో కొన్నిలక్షల బౌద్ధారామాలు విలసిల్లినట్లు యితను తెలియజేశాడు.

626 లో మహమ్మదు మదీనానుంచీ తిరిగి మక్కాకువచ్చాడు.

632 లో మహమ్మదు మరణం.

633–63 జయసింహుని కాలం యితను కుబ్జవిష్ణువర్ధనుని. కుమారుడు యితని పెదతండ్రిఅయిన పులకేశి (రెండవ) మరణానంతరం స్వతంత్రితను ప్రకటించుకున్నాడు.

634 భారవి సంస్కృతకవి. కిరాతార్జునీయము గ్రంధకర్త (కాళిదాస సమకాలీనుడని కొందరిఅభిప్రాయం) కొందరు 4వ|| శ|| వాడని అంటారు 634 లో తయారుచేయబడిన శిలాశాసనంలో యితనిపేరు ఉల్లేఖింపబడింది.

635 ధర్మకీర్తి కాలం, దక్కను (త్రిమలయము) లో జన్మించాడు. బహుశా సత్యాశ్రియ పులకేశి కాలం నాడుకావచ్చు. యితను బ్రాహ్మణుడైనప్పటికీ బౌద్ధుడై మగధ. ధర్మపాలునివద్ద ధర్మాధ్యయనం చేసి మహాపండితుడుగా చెలామణీఆయినాడు. నలందా విశ్వవిద్యాలయంలో ఆచార్యుడుగా పనిచేశాడు. యితను తిరిగిదక్షిణాపథానికివచ్చి. కుమారిలుని వద్ద హిందూధర్మశాస్త్రం అధ్యయనంచేసి. తదుపరి. వాదమందు కుమారిలుని ఓడించి వేశాడు.

635లో. రెండవపులికేసి కొంకణను పాలించిన గుప్తులలో బొంబాయి (ఎలిఫెంటా) పరిసరాలలో. గొప్పయుద్ధముచేసి ఓడించాడు.

636–37 ప్రప్రథమంగా అరేబియనుల ఆక్రమణ. బొంబాయివద్ద దానామీద జరిగింది కానీపరాజితులై పోయారు. దీనితర్వాత అపుడపుడు థనోచ సిందు దేవలవగైరా ప్రాంతాలపైన దాడులుచేస్తూనే వచ్చారు. కానీ ఫలంపొందలేక పోయారు.

640 ప్రాంతంలో చీనాయాత్రికుడు హ్యూయాన్‌సాంగ్. రెనాటి సీమ అయిన పులివెందుల జమ్మలమడుగు ప్రొద్దుటూరు కమలాపురం తాలూకాలలో కొంతభాగాన్ని పర్యటించి యీప్రాంతానికి చూళియ

అను చీనాపదాన్ని ఉపయోగించాడు. అంటే ఈదేశ మొక రాజుస్వాధీనం మందులేక దేశముకొల్లగొట్టబడి. పట్టణములందును పల్లెలయందును జనం శూన్య మైచ్రకూరచితుగిలును. దుష్ట్రివర్తకులును అగుజనులతో నిండియుండెడి దని యీ ప్రాంతాన్ని వర్ణించాడు.

641 నుండి 73 వరకు జయసింహ సర్వసిద్ధి యితను విషమసిద్ధి పుత్రుడు యితని పేరున నిర్మింపబడిన సర్వసిద్ధిగ్రామం. విశాఖజిల్లాలో యిప్పటికీఉంది. యితను నౌకాయుద్ధంలో గొప్పప్రవీణుడు. దండి. దశ కుమారచరితంలో జయసింహుని కళింగదండయాత్ర వర్ణించబడింది. యితను కళింగరాజును నౌకాయుద్ధంలో ఓడించి కళింగరాజు కూతురైన కనకలేఖను వివాహమాడాడు. తెలుగులో విప్పరుగ్రామంలో యితనిశాసనం ఒకటి దొరికింది యిదేప్రథమ శాసన (తెలుగులో) మని చెప్పబడుతూవుంది.

641 లో హ్యూయాన్‌సాంగ్. బాదామినగరాన్ని దర్శించి. పులికేశి పరిపాలనను. నగరవైభవాన్ని దర్శించి. పులికేశి పరిపాలనను. నగరవైభవాన్ని కొనియాడాడు.

648 నారాయణస్వామి. దాక్షిణాత్యుడు ప్రసిద్ధ వైద్యశాస్త్రవేత్త యితనిని చీనాచక్రవర్తి పిలిపించుకొని మృత్యుంజయ రసాయనాన్ని చేయించుటకు ప్రయత్నించాడు. కానీ యీప్రయత్నంలోనే వీరిద్దరు మరణించారనే విషయాన్ని—కోత్సంగ్—తెలియజేశాడు.

648 బత్మాను 3 వ ఖలీపా అయాడు.

648 నవీచంద్రుడు. ప్రశస్తపాదుని రచనలపై నాధారపడిన యొక వైశేషిక గ్రంధాన్ని ||దశపదార్థ శాస్త్రము|| రచించాడు.

650–700 కుమారిలునికాలం ప్రఖ్యాత తత్వశాస్త్రవేత్త వైదికుడు వేదభాష్యకారుడు మీమాంసా వార్తికము అనుగ్రంధాలు రచించాడు. యితను బౌద్ధధర్మరహస్యాలను బౌద్ధ పండితులద్వారా అభ్యసించి తుదకు బౌద్ధమతాన్ని ఖండించాడు. యీగురు ద్రోహానికి ప్రాయశ్చిత్తముగా ప్రయాగలో అగ్నిగుండంలో దుమికి చనిపోతూవుండగా శంకరుడు కుమారిలుని కల్సుకునేందుకు వస్తాడు. కుమారిలుడు. దక్షిణభారతంలోని బీహార్ బ్రాహ్మణ వంశంలో జన్మించాడని చెప్పబడుతూవుంది

654 లో స్థవిరప్రాజ్ఞుడు. బౌద్ధపండితుడు. యితను హూయాన్ సాంగ్ కు ఒక లేఖవ్రాశాడు.

655–80 ప్రథమ విక్రమాదిత్యునికాలం యితను రెండవపులికేసి ఉత్తరాధికారి యితను తనవంశం కోల్పోయినకీర్తిని పునఃప్రతిష్ట చేశాడు యితని తర్వాత వినయాదిత్యుడు. రెండవ విక్రమాదిత్యుడు. పరిపాలించారు. వీరందరికీ పల్లవరాజులతో సంఘర్షణజరుగుతూనే వచ్చింది. యీ వంశపు ఆఖరివాడు రెండవకీర్తివర్మను 753 లో రాష్ట్రకూటపాలకుడైన దంతిదుర్గ ఓడించి చాళుక్యవంశాన్ని నాశనంచేశాడు.

675–85 లో చైనాయాత్రికుడు ఇత్సింగ్ నలందా విశ్వవిద్యాలయంలో ఆచార్యుడుగా పనిచేశాడు. యితను నాగార్జునుడు ఒకటవ శతాబ్దంలో జీవించాడనీ కనిష్కుని సమకాలికుడనీ వ్రాశాడు. 671 లో యితను బయలు దేరాడు.

681 వినయాదిత్యుని పాలనారంభం. బాదామి చాళుక్యుడైన విక్రమాదిత్యుని పుత్రుడు యితనికి సత్యాశ్రయ, రాజాశ్రయ బిరుదులు కలవు.

680 ప్రాంతం శంకరుని జన్మకాలమని ఆర్|| జి|| భండార్కర్ వాదం 6వ, శతాబ్దాంతమందుగానీ లేక మధ్యకాలమందుగానీ శంకరుడుండినాడని తెలాంగుపండితుని అభిప్రాయం. శంకరుని, సూత్రభాష్యమున పేర్కొనబడిన 'పూర్ణవర్మ' ఆ కాలముననుండినాడని తెలాంగుపండితుని వాదం 8 శతాబ్దానికి చెందినవాడు శంకరుడని కొందరివాదం.

694 విజయాదిత్యుని పరిపాలనారంభం. యితను బాదామిచాళుక్య వినయాదిత్యుని కుమారుడు. యితను 702 లో అలంపుర క్షేత్రము దర్శించి అక్కడి బాల బ్రహ్మేశ్వరాలయానికి ప్రాకారము ముఖమంటపము కట్టించాడు.

7 వ|| శ|| నాలందావిశ్వవిద్యాలయ ఉచ్ఛదశ యిందులో నక్షత్ర గణిత శాస్త్రము నీటిగడియారము 18 శాఖల బౌద్ధ శాస్త్రములు శిల్పవిద్య సాంఖ్య వేద బ్రాహ్మణాలు వ్యాకరణ తర్కశాస్త్ర వైద్య వగైరాలంతా సంస్కృత భాషలలో బోధింపబడేవి. 6 విభాగాలతో 100,00 మంది విద్యార్థులు 1500 మంది అధ్యాపకులు గల్గివుండినది.

7 వ॥ శ॥ విశాఖదత్తుడు సంస్కృత నైతికకని ముద్రారాక్షసము అను గ్రంథాన్ని రచించాడు. సంస్కృత సాహిత్యంలో యీ గ్రంథానికి చాలా ఆదరణవుంది. "మిస్టర్ హైలింగ్" అభిప్రాయప్రకారం యీ గ్రంధరచనా కాలం 7 వ॥ శతాబ్దమని తెలియజేశాడు. ముద్రారాక్షసము చంద్రగుప్త చాణక్యుల చరిత్రను తెలియజేస్తుంది.

7 వ॥ శ॥ లో కులశేఖర రాజర్షి యితను తిరువాన్కూరు రాజధానిగా పరిపాలన సాగించాడు.

7 వ॥ శ॥ లో గౌడపాదుడు 7 వ॥ శతాబ్దాంతమున గానీ 8 వ॥ శతాబ్దారంభమున గానీ వుండునని చెప్పబడుతూవుంది. యితను శంకరుని గురువైన గురుగోవిందునికి గురువుఅని చెప్పబడుతూవుంది. అద్వైత వేదాంత శాస్త్రమును తర్కయుక్తముగా ప్రదర్శించినవారిలో ప్రథముడు గౌడ పాదుడే.

7 వ॥ శ॥ మధ్యభాగంలో భర్తృహరి మరణించి వుండవచ్చునని మాక్సుముల్లర్ అభిప్రాయం.

7 వ॥ శ॥ మాణిక్కవాసగరు, సుందరరు అను తమిళ శైవభక్తుల కాలం.

7 వ॥ శ॥ మండనమిశ్రుడు బాదాపు కుమారిలుని సమకాలికుడు.

7 వ॥ శ॥ శాంతిదేవుడు మాధ్యమికవాది అని కొందరి అభిప్రాయం. కాదు యోగాచారుడనీ కొందరి అభిప్రాయం యితను బోధచర్యావతారము "శిక్షాసముచ్ఛయము" అను గ్రంథాలు రచించాడు.

7 వ॥ శ॥ లో (60 వ హిజరీ) ముస్లింల సింధుఆక్రమణ.

700 ప్రాంతం కుమారిలభట్టు—ప్రభాకరపండితులకాలమని కొందరి అభిప్రాయం.

7 వ॥ శ॥ చంద్రకీర్తి మాధ్యమికసూత్రాలకు సంస్కృతభాష్యము రచించాడు.

712 మహమ్మద్ బిన్ ఖాసిమ్—అరేబియా నావలను ఎవరోదోపిడి చేశారనే కారణంగా హజ్జాజ్ ఖలీఫాతో అనుజ్ఞతీసుకొని కాసిమ్ సింధు

పైనికి దండయాత్రకు పంపాడు (యీనావల దోపిడీ అనేవిసాకుమాత్రమే భారతదేశంపై అరబ్బులకు ఆదివరకేకన్నుపడింది అనేది స్పష్టమే) యీసమయంలో సింధుప్రాంత పరిపాలకుడైన—డాహిర్ అయోగ్యత కారణంగా సింధు పతనం సంప్రాప్తమయింది.

725 ఒకటవనాగభట్టు. యిపడు గుర్జరప్రతిహార వంశపు మూల పురుషుడు. వీరిప్రథమ రాజ్యస్థాపనా ప్రదేశాన్నిగురించి. అభిప్రాయ భేదాలున్నాయి. దక్షిణరాజపుత్రస్థానమని కొందరు మాళవదేశంలోనని కొందరు. అభిప్రాయపడుతున్నారు. యితను సింధులోని అరబ్బు పరిపాలకులతో పోరాడి ఓడించివేశాడు (యితనితర్వాత వత్సరాజు యీవంశంలో ప్రసిద్ధుడు) యితను. మగధ. బెంగాలును పాలిస్తున్న ధర్మపాలుని ఓడించాడు. దక్షిణరాష్ట్ర కూటానికిచెందిన ధ్రువరాజు. వత్సరాజును. ధర్మపాలుని యిద్దరినీ ఓడించటంతో ఉత్తరభారతదేశంలో దక్షిణరాష్ట్రకూట వంశపరిపాలన కొనసాగింది. కానీధ్రువరాజు పుత్రులు స్తంభ—గోవిందుల మధ్య అధికారసంఘర్షనలు కారణంగావీరు అనతికాలంలోనే ఉత్తరదేశాధికారాన్ని కోల్పోయారు.

725 యశోవర్మ. యితను చంద్రవంశపురాజని చెప్పబడింది. యితను కనౌజును ఆక్రమించి ఉత్తరభారతదేశాన్నంతా (దాదాపు) పరిపాలించాడు. 731 లో రాజదూతను చీనాదేశానికి పంపాడు ।।ఉత్తర రామచరిత।। రచయిత భవభూతి ।।గౌడవాహో-రచయిత।। వాక్ పతి యితని ఆస్థానకవులు. కాశ్మీరుపరిపాలకుడు లలితాదిత్యుడు. యితనితో స్నేహంగా వుంటూ 740 లో స్నేహాన్నివిస్మరించి దాడిచేసి. యశోవర్మను ఓడించాడు యశోవర్మ ఆయుద్ధంలోనే మరణించాడు. కానీ లలితాదిత్యుడు కనౌజుపై అధికారాన్ని పొందలేకపోయాడు యశోవర్మ కుమారుడు వజ్రాయుధుని కాలంలోకూడా లలితాదిత్యునితో సంఘర్షణ సాగుతూనేవుంది. వజ్రాయుధుని కుమారుడు. యింద్రాయుధునికాలంలో మగధరాజైన ధర్మపాలుడు 783 లో దాడిచేసి యింద్రాయుధుని ఓడించి తన ఆశ్రితుడైన చక్రాయుధుని. కనౌజు సింహాసనముపై గూర్చుండబెట్టాడు.

728 నుంచీ 1568 వరకు వివిధవంశపు రాజులకు చిత్తూరు రాజధానిగా చెలామణి అయివుంది.

748 లో ఒకకాళిదాసు కాలం. యితను మహాకవి భవభూతికి. సమకాలీనుడని చాలమంది అభిప్రాయం.

750–74 మధ్యకాలంలో భాగతీయపండితులు బాగ్దాద్ వెల్లుతూ గణితశాస్త్రము జ్యోతిశ్శాస్త్రాలకు సంబంధించిన గ్రంథాలను వెంటతీసు కెళ్లారు,

750 దండి యీప్రాంతపువాడని కొందరి అభిప్రాయం.

765–780 కాలంలో ఎల్లోరలోని కైలాసనాథాలయం రాష్ట్ర కూట ప్రభువులలోని మొదటికృష్ణరాజుకాలంలో తయారుచేయబడింది.

771 చార్లమను రాజ్యపాలనారంభం.

772–806 నాల్గవవిష్ణువర్ధనుడు. యితను చాళుక్యరాజులలోనివాడు.

772–803 దామోదరగుప్త. కాశ్మీర్ నివాసస్థుడు ||కుట్టనీమత|| అను గ్రంథరచయిత. రాజతరంగిణిలో యితను మహారాజా జయపీడుని మంత్రి అనిచెప్పబడింది. కుట్టనీమతగ్రంథంలోనే వేశ్యలయొక్క మాయో పాయాలను వర్ణించబడింది.

772–803 జయపేడ్–కాశ్మీరు పరిపాలకుడు.

776–క్షీరస్వామి. కాశ్మీర్ పండితుడు. మహారాజాజయపీడుని కాలపువాడు రాజతిరంగిణీలో శా|| శకం 700వాడని చెప్పబడింది అంటే క్రి|| శ|| 776–813 యితను జయాపీడుని రాజగురువు. అమరకోశానికి టీకావ్రాశాడు.

779 భట్టోద్భవ. కాశ్మీర్ పండితుడు జయపీడుని సభాపండితుడు. అలంకార సంగ్రహము అనుగ్రంథాన్ని రచించాడు. దీనికి టీక ప్రతీ హరేందరాజు రచించాడు. యితనిగురించి పండితులు–ఉద్భటభట్టు–ఉద్భటాచార్య అనుపేర్లతో పిలిచారు. కుమారసంభవమను గ్రంథాన్ని భట్టోద్భవ రచించాడు కానీ దానిజాడ తెలియరావటంలేదు.

770 నుంచీ 830 వరకు పల్లవరాజయిన దంతివర్మ పరిపాలనా కాలం.

780 లో శంకరాచార్యులు జన్మించారని కొందరిఅభిప్రాయం. యిప్పటి ఉత్తర తిరువాన్కూరులోని కలడిగ్రామంలో జన్మించాడు. 7 ఏండ్లవయస్సులోనే విద్యావంతుడై వేదాంత (వైదిక) మతాన్ని పునరుద్ధరించాడు యీాయన శైశవమందే తండ్రిచనిపోయాడు. జైన బౌద్ధ వగైరా నామ పక్షమతాలన్నింటినీ నిర్మూలించేందుకు తీవ్రకృషిచేశాడు.

780–91 ధారావర్షుడు. రాష్ట్రకూటప్రభువు యితని అసలుపేరు ధ్రువమహారాజు.

784 మూడవ గోవిందరాజు మహారాష్ట్ర–రాష్ట్రకూట ప్రభువు. యితను రేనాటి రెడ్డిరాజులను పారద్రోలినట్లు చెప్పబడుతూవుంది.

790 విఠలదేవరాయలు. యితను మండలేశ్వరుడు. జైనుడుగావుండి అనంతరం వైష్ణవమతాన్ని స్వీకరించి విష్ణువర్ధనుడు—అని పేరుపెట్టుకున్నాడు. యితను అనేకజైన దేవాలయాలను విధ్వంసంచేయటమేగాక వైష్ణవ వాద ప్రభావితుడై జైనవిద్వాంసుల క్రూరహింసలకు గురిజేశాడు.

791–94 గుర్జరపాలకుడైన నాగభట్టు కన్నౌజును స్వాధీనంజేసుకున్నాడు. నాగభట్టు ప్రతీహారవంశస్థుడు. యీా వంశస్థులు దాదాపు 1050 వరకు కన్నౌజును పరిపాలించారు. గుర్జరప్రతీహారులు సూర్యవంశజులమనిచెప్పుకున్నారు. కానీవీరు విదేశీయులని చాలామంది అభిప్రాయపడున్నారు. రెండవ నాగభట్టు కొడుకు రామభద్రుడు. సింహాసనానికి వచ్చిన సమయంలోనే మగధ ధర్మపాలుడుకూడా మరణించి. ధర్మపాలుని కొడుకు దేవపాలుడు సింహాసనానికి వచ్చాడు. రామభద్రునికీ దేవపాలునికీ నిరంతర సంఘర్షణ జరుగుతూ ఉండినది.

793–815 ముమ్మడి గోవిందరాజు. యితను రాష్ట్రకూట ప్రభువైన ధారావర్షుని కుమారుడు యితనికి ప్రభూతవర్షుడు అన్న బిరుదుకూడా వుంది.

8వ॥ శ॥ లో జపాన్‌ప్రభుత్వం ప్రపంచంలోకల్లా అత్యున్నతమైన బౌద్ధవిగ్రహాన్ని చేయించనెంచి 550 టన్నుల రాగినిఉపయోగించి విగ్రహాన్ని తయారుచేశారు. దీని నిర్మాణానికి 10 సంవత్సరాలు పట్టింది.

8 వ॥ శ॥ లో శ్రీహరినారాయణుడు. యితనిది ఝుంఝుణవానగర

ప్రభువగు శార్దూలమహారాజుకు పురాణాలుచెప్పు సుఖలాలజీపండితుని కుమారుడు. యితను స్కాంధపురాణాంతర్గత. గరుడ పురాణానికి అనుకరణగా గరుడపురాణాన్ని విస్తృత రూపంలో రచించాడు.

8వ॥ శ॥—త్రివిక్రమభట్టు. యితను ప్రసిద్ధవిద్వాంసుడైన దేవాదిత్యుని కుమారుడు. యితనితండ్రి దేశాంతరంపోగా. విదేశీబ్రాహ్మణుడు రాజువద్దకు శాస్త్రచర్చనిమిత్తమై వచ్చాడు. రాజు త్రివిక్రముని పిలిచి పండితునితో వాదించమంటాడు. విద్యావిహీనుడైన త్రివిక్రముడు సరస్వతీ మందిరంలో ప్రవేశించి సరస్వతిని వేడుకొనగా సరస్వతిప్రత్యక్షమై యితని తండ్రి తిరిగివచ్చేవరకు యితను విద్యావంతుడుగా ఉండునట్లు వరమిస్తుంది. విదేశీపండితుని ఓడించి నలచం పూ॥ అనేగ్రంథాన్ని తయారుచేస్తూవుంటాడు 7 ఆశ్వాసాలు పూర్తయేలోగా యితనితండ్రి దేశాటనంనుంచీ తిరిగివస్తాడు వెంటనే త్రివిక్రముడు విద్యావిహీనుడై చంపూ కావ్యం అసంపూర్ణంగా నిలిచిపోయిందని గాథ.

8వ॥ శతాబ్దారంభం భవభూతి. యితను సంస్కృతంలో ప్రసిద్ధ నాటకకర్త— వీరీచరిత్ర—మాలతీమాధవం - ఉత్తరరామచరితం — అనుమూడు నాటకాలను రచించాడు యితని జన్మస్థానం పద్మపురం. తండ్రి నీలవంతుడు తాత భూపాలభట్టు. తల్లిజాతుకర్ణి. యితనిరచనాశైలి కరుణారసంగా వుంటుంది. రాజా యశోవర్మ ఆస్థానపండితుడు.

8॥ శ॥ ధర్మదాసు. సంస్కృతకవి. మగధ దేశవాసి అని చెప్పబడుతూవుంది. బౌద్ధధర్మాభిమాని విదగ్ధముఖమండన్ అను గ్రంథకర్త.

800 చార్లమనుకు పోపుపట్టాభిషేకం చేయుట.

800–1000 యీమధ్యకాలంలో విష్ణుధర్మోత్తరమను పురాణంర చించబడింది. యిదిచిత్రలేఖనాది విషయాలనుకూడా తెలియజేస్తుంది.

800 మాణిక్యనంది పరీక్షాముఖసూత్రము అను గ్రంథకర్తయైన మతస్థుడు.

808–47 చాళుక్యనరేంద్ర మృగరాజు. యితనికాలంలో సింహాసనం కొరకు అన్నదమ్ముల బిడ్డలమధ్య అంతఃకలహాలు ప్రారంభమైనాయి. యిందులో రాష్ట్రకూటరాజులు జోక్యంకలుగ జేసుకొని భీమసళుక్కి అను

నతనిని వేంగిసింహాసనముపై కూర్చుండబెట్టారు. కానీ నరేంద్రమృగరాజు అను బిరుదు వహించిన రెండవ విజయాదిత్యుడు 12 సం॥ లు అరణ్యవాసం చేసి సైన్యాలనుకూడగట్టుకొని భీమసలుక్యుని పారద్రోలి తిరిగి వేంగీ సింహాసనం ఆక్రమిస్తాడు. యితని పరిపాలన 40 సం॥ రాలలోను మొత్తం 108 యుద్ధాలుచేసి శత్రువులఓడించి, ఆపాప పరిహారార్థం 108 శివాలయాలను నిర్మించాడు.

814 చార్లమను మరణం.

820 వాచస్పతి మిశ్రుడు. న్యాయవార్తికా తాత్పర్యటీకా అను గ్రంథాన్ని రచించాడు. విక్రమ శకం 898 నాటివాడైనట్లు తెలుస్తావుంది. సాంఖ్యతత్వకౌముది, భామతిఅనే ప్రసిద్ధ గ్రంథాలనుకూడా రచించాడు.

835–90 భోజరాజు (గుర్జర ప్రతీహారవంశస్థుడైన రాజభద్రుని కొడుకు) యితను తనసామ్రాజ్యాన్ని విస్తారంచేయుటమేగాక సాహిత్య ప్రియుడనికూడా గణుతికెక్కాడు. భోజ కాళిదాస. అన్న పేరుతో చిత్రాతి చిత్రకథలు ప్రచారంలో వున్నసంగతి అందరు ఎరిగినవే.

849–92 మధ్యకాలపువాడు. చాళుక్య గుణగవిజయాదిత్యుడును యితను తనసామ్రాజ్యాన్ని ఒడుదుడుకులనుంచీ సుస్థిరం చేయుటమేగాక విస్తృతంకూడా చేశాడు. గాంగ, పల్లవ, నోలంబ, వైదుంబ, బాణుల. ఓడించివేశాడు నెల్లూరుజిల్లాలో బోయలు తిరుగుబాటు చేయగా యితని సేనాని పండరంగుడు తిరుగుబాటును అణచివేశాడు. యితనికాలంలోనే ఒంగోలువద్ద (ధర్మవరంలో) మొట్టమొదటసారిగా తెలుగు సీసపద్యాలతో కూడిన ఒకశాసనం వేయబడింది.

855–80 మధ్యకాలంలో—అవంతివర్మ అను నతను కాశ్మీరును పరిపాలించాడు.

855–80 ఆనందవర్ధనునికాలం. యితను ప్రసిద్ధసంస్కృత అలంకార శాస్త్రపండితుడు. (కాశ్మీర్ అవంతివర్మ) కాలంలోఉండినాడు యితను కావ్యాలోక్—ధ్వన్యాలోక్—సహృదయాలోక్—అనుసంస్కృత గ్రంథాలు రచించాడు.

868 ప్రాంతంలో. వరగుణుడు కేరళను పరిపాలించాడు. యితను వేయించిన శాసనాలద్వారా యీకాలంలో దక్షిణప్రాంతంలో బౌద్ధమతం చాలావ్యాప్తిలోవుండినట్లు తెలియవస్తున్నది.

875–907 ప్రథమాదిత్యుడు. చోళవంశపువాడు. యీవంశం చాలా ప్రాచీనకాలంలోనుంచీ అక్కడక్కడ అగుపిస్తూనేవుంది కానీ ప్రఖ్యాతిలోకిరాలేక పోయింది (అశోకుని శిలాశాసనాలలోకూడా యీ వంశ ప్రసక్తివుంది) యీవంశస్థుడైన విజయల అను నతను. తంజావూరు పల్లవరాజులక్రింద సామంతుడుగా వుండినాడు యితని పుత్రుడే. ప్రథమాదిత్యుని కుమారుడు పరాంతకుడు 907–47 వీరికాలంలో పల్లవరాజుల శక్తి నుంచి విడివడి స్వతంత్రతను సంపాదించుటమేగాక బలవత్తరమైన చోళ రాజ్యస్థాపనకు పునాదులు వేశారు. పరాంతకుడు. పాండ్య లంక. దేశాలను జయించి వంశప్రతిష్ఠను యినుమడింప జేశాడు. యితనిరాజధాని తిరుచునాపల్లి సమీపంలోని ఉరయూరు) యితనుశైవభక్తుడు. పరాంతకుని పుత్రుడు పరాంతకుని పుత్రుడు. రాజాదిత్యుడు. యితనిని రాష్ట్రకూటరాజులు 948 లో నాక్కోలా యుద్ధంలో ఓడించారు. తదనంతర కాలంలో యీ వంశస్థుల ప్రభావం సన్నగిలింది.

క్రీ॥ శ॥

1014–41 లో తిరిగీ రాజేంద్రచోళునిద్వారా యీ వంశ ప్రతిష్ఠ యినుమడించింది.

891–907 మహేంద్రపాలుడు (భోజరాజు పుత్రుడు) యితని కాలంలో యితనితండ్రి సంపాదించినపేరు ప్రతిష్టల్ని కొంతవరకు కాపాడాడు. యితనిపుత్రుడు మహీపాలుడు.

892–921 ప్రథమచాలుక్య, భీముని పరిపాలనా కాలం

900 ప్రాంతంలో రెండవ యుద్ధమల్లుని పరిపాలన సాగినట్లు విజయవాడలోని ఒక శాసనం ద్వారా తెలియ వస్తున్నది.

900 ప్రాంతం సర్వజ్ఞాత్మముని సంక్షేప శారీరక మను గ్రంథకర్త యిందులో శంకరతత్వంకూడా వుంది.

900 యించు మించు భాస్కరునికాలం. యితను బ్రహ్మసూత్రాలకు భాస్కరభాష్యము. అను భాష్యాన్ని రచించాడు.

9వ॥ శ॥ నికి చెందినవాడు. మేదాతిథి యితను మనుస్మృతికి వ్యాఖ్యానంవ్రాశాడు.

9వ॥ శ॥ భట్టుకల్లట. కాశ్మీరుపండితుడు యితనిగురువు. వసు పండితుడు వసుగుప్తుడు రచించిన-స్పందకారిక-అను గ్రంధానికి స్పంద సర్వస్వఅను. టీకాగ్రంధాన్ని భట్టుకల్లటుడు వ్రాశాడు. యితను కాశ్మీరు రాజా అవంతివర్మ సమకాలికుడు. రాజతరంగినితో యితనికాలం 9వ శతాబ్దమని తెలుస్తూవుంది.

9వ॥ శ॥ ఆనందవర్ధనుడు లేక ఆనందగిరి శంకరుని శిష్యుడు ప్రసిద్ధి చెందిన తత్వశాస్త్రవేత్త. శంకర దిగ్విజయం. ఉపనిషత్ వ్యాఖ్యలు భగవద్గీతకు టీక. మొదలైనగ్రంధాలు రచించాడు.

9వ॥ శ॥ నృపతుంగుడు. యితను రచించిన కవిరాజమార్గము. (కార్ణటక) ప్రధమగ్రంధంగా చెప్పబడుతున్నది. యిది. సాహిత్యవిమర్శగాను ఛందశ్శాస్త్రముగాను. పేరొందినది. దీనికంటె మునుపటిగ్రంధాలు నేడు లభ్యంకావు.

9వ॥ శ॥ ధర్మోత్తరుడు. న్యాయబిందుటీక అనుగ్రంధాన్ని రచించాడు.

9వ॥ శతాబ్దారంభం. ఆనందగిరి.

902 లో కాశ్మీరును పరిపాలిస్తున్న శంకరవర్మ చనిపోగా. యితని ముగురుభార్యలు యిద్దరుదాసీలు, ఓక సేవకుడు (జయసింహ) పరలోకంలో తమస్వామికి సేవకీర్తనలు చేసేందుకుగాను శంకరవర్మతో వీరంతా సహగమనం చేశారు.

910–43 ప్రధమమహీపాలుడు భోజుని మనుమడు యీగుర్జర ప్రతీహార వంశం యితనికాలంలో పతనానికి, బీజారోపన జరిగిందనేచెప్పవచ్చు యితనితర్వాత యీవంశస్థులు చాలామందే పరిపాలనసాగించారు కానీ యీవంశపు ప్రాధమిక ప్రతిష్ట సన్నగిల్లుతూ వొచ్చిందేకానీ తిరిగి వీరిలో ఎవరుకూడా సంపాదించలేక పోయారు.

918–25 మొదటి అమ్మరాజు యితను విష్ణువర్ధన వంశస్థుడు.

యితని కాలంలోనే రాజమహేంద్రవరం నిర్మాణం జరిగింది. అనంతర కాలంలో అదే చాళుక్యులకు రాజధానిగా వుండింది.

928–34 రెండవ యుద్ధమల్లుడు యితను బెజవాడ మల్లేశ్వరస్వామి దేవాలయంలో శిలాశాసనం వేయించాడు.

930 ఉత్పలుడు. శైవమతస్థుడు ప్రత్యభిజ్ఞా సూత్రము అను గ్రంథాన్ని రచించాడు.

934–45 కాకర్త్యగుండన యితను కాకతీయ వంశస్థుడు. యితను సామంతుడుగా మధిర మానుకోట తాలూకాలను పరిపాలించినట్లు ఆధారాలు ఉన్నాయి. తదనంతరం వరంగల్లులో పరిపాలనసాగించిన కాకతీయ మతానికి మూలపురుషుడు.

945–70 రెండవ అమ్మరాజు కాలం. చాళుక్యవంశంలో యితను 23వ వాడు యితను జైన దేవాలయాలకు దానాలు చేశాడు.

956 మూడవకృష్ణుని కాలం యితనుమహారాష్ట్రకు చెందిన రాష్ట్రకూటపువాడు.

966 భట్టోత్పల. ప్రసిద్ధజ్యోతిష్ శాస్త్రవేత్త వరామిహిరుని గ్రంథాలకు యితను టీకా వ్రాశాడు. బృహత్ జాతక టీకలో యితని కాలం శా॥ 888 అని తెల్పుకొనటాన్నిబట్టి క్రీ॥ శ॥ 966 వ నాటివాడు అవుతూవున్నాడు.

967 ధోలారావు. యితనికాలంలో జయపుర సంస్థాన నిర్మాణం జరిగింది.

970–1000 ప్రథమ మూలరాజు. యితను చాళుక్యవంశపు మూల స్థాపకుడు. గుజరాతును పాలిస్తున్న ప్రతీహారవంశస్థులను ఓడించి అధికారాన్ని యితను స్వాధీనం చేసుకున్నాడు. యితనిరాజధాని అన్హిలవాడా యితని అనంతరం ప్రథమభీముడు.

1024–60 పరిపాలించాడు. యితను సమర్థ వంతమైన పరిపాలకుడు మహమ్మదు గజనీ. గుజరాతులోని సోమనాథదేవాలయంపై దాడిచేసి

నపుడు సోమనాథుని సంరక్షణార్థం పాల్గొన్నవారిలో యీ ప్రిథమభీముడు కూడా

973 రెండవ తైలపుడు. యితను రాష్ట్రకూటులతో ఆఖరివాడగు కక్కలుని ఓడించి రాజ్యాన్ని ఆక్రిమించాడు. యితను కళ్యాణి (హైదాబాద్ లోనిది) రాజధానిగా పరిపాలన ప్రారంభించాడు కాబట్టి కళ్యాణి చాళుక్య శాఖకు మూలపురుషుడు. యితను దక్షిణప్రిదేశంలోని చోళ వంశీయులను గుజరాతు చాళుక్యులను ఓడించి వేశాడు. ఛేది, మాళవ పరమార రాజ్యాలతో యితనికి సంఘర్షణ జరుగుతూ ఉండినది యితని అనంతరం సత్యాశ్రయ రాజ్యానికి వచ్చాడు.

977 కైయట్—కాశ్మీరు పండితుడు. యితను ఆనందవర్ధనుని దేవీ శత కాశికి టీకా వ్రాశాడు (కైయటో అను పేరుతో మరొక వ్యాకరణ వేత్త కూడా వున్నాడు)

977 జయపాలుడు. లాహోరు పరిపాలకుడు. యితని కాలంలో గజనీరాజుసుబుక్తగిన్ దాడిచేసి పెశావర్ను స్వాధీనంచేసుకున్నాడు. జయ పాలుడు. సుబుక్తగిన్కు 50 ఏనుగులు 10 లక్షలరూపాయీలు యిచ్చి వెనుకకు పంపివేశాడు. కానీ 1001 లో సుబుక్తగిన్ కొడుకు. మహమూద్. తిరిగీ జయపాలునిపై దాడిచేసి జయపాలుని ఖైదుచేసి సాంవత్స రిక కప్పం చెల్లించే ఏర్పాటుపై జయపాలుడు విముక్తిపొందాడు.

984 ఉదయనాచార్యుని కాలమని—న్యాయవార్తికా తాత్పర్య టీకా పరిశుద్ధి—అను న్యాయశాస్త్రి గ్రింథాన్ని రచించాడు. న్యాయకుసు మాంజలినికూడా రచించాడు.

986 అమీర్ సుబుక్తగీన్ భారతదేశ ఉత్తర పడమట ప్రిదేశాలపై ఆక్రమణచేశాడు.

991 శ్రీధరుడు—న్యాయకందల—అను గ్రంథాన్ని రచించాడు.

993–1015 అభినవగుప్త గొప్పసంస్కృత పండితుడు. ప్రిసిద్ద అలంకార శాస్త్రివేత్త యితను సంస్కృతంలో 8 గ్రింథాలను రచించాడు శైవమతస్థుడు.

997 గజనీ (అమీర్ సుబుగ్తగీన్ కొడుకు) సింహాసనాన్ని అధిష్టించాడు,

997–1009 సత్యాశ్రియ (కళ్యాణిచాళుక్యుడు) యితని కాలంలో చోళరాజులతో నిరంతరసంఘర్షణ జరుగుతూవచ్చి ఆఖరుకు రాజరాజ నరేంద్రుని (చోళ) చేతిలోసత్యాశ్రయుడు ఓడిపోతాడు.

1000 దాదాపు శ్రీహర్షునికాలమని (కొందరు)

1000 లో ప్రశస్తపాదుని పరమార్థధర్మ సంగ్రహానికి వ్యాఖ్యానాల రూపంలో శ్రీధరుని న్యాయకందళి–ఉదయనుని కిరణావళి–శ్రీవత్సుని లీలావతి, యీనాలుగు గ్రంధాలురచించ బడ్డాయి.

1000–1011 వేంగిచాళుక్య–శక్తివర్మ కాలం. ఆనాడు కంచిని పాలిస్తున్న రాజరాజకేసరివర్మ తనసైన్యాలను. శక్తివర్మకు సహాయంగా పంపి రాజమహేంద్రివరసింహాసనంపై శక్తివర్మకు అధికారాన్ని సంపాదించి పెట్టాడు.

10వ|| శ|| శారదాతనయుడు (దాక్షిణాత్యుడు) భావప్రకాశనం అనే అలంకార శాస్త్రాన్ని రచించాడు. దీని పీఠికలో. అనేకమైన రూపకాలనుచూచినట్లు దివాకరుడను గొప్పనట శేఖరునిగురించీప్రస్తుతించాడు

1000 దాదాపు శ్రీహర్షుడు యితను మహారాజు ఆదిశూరుడు కన్యాకుబ్జమునుంచి. అయిదుగురు బ్రాహ్మణులను పిల్వనంపగా వచ్చిన వారిలో నొకరు (యితనితండ్రి శ్రీహరి) ప్రశస్తివహించిన నైషధము–గౌడవంశీకుల ప్రశస్తి అర్ణవవల్లన–నవసాహసాంక–ఖండన ఖండప ఖాద్య వగైరా గ్రంధాలను రచించాడు యితను యింకా కొన్నిగ్రంధాలు రచించాడు కానీ అవి నేడుకానరావు.

10వ|| శ|| చెందినవాడు. మేధాతిథి. యితను మనుధర్మశాస్త్రానికి భాష్యము రచించాడు.

10వ|| శ|| కుమారశ్రీకంఠుడు గొప్పనటుడు. యితను–ఆర్యాక్రీడ అనేనాటకాన్ని ప్రదర్శించినందుకుగాను భూరి భూదానంపొందినట్లు దక్షిణ దేశపుశాసనాలు మూడవసంపుటలోని ఒకశాసనం తెలియ జేస్తున్నది.

1000–26 మహమ్మదుగజనీ – సుబుక్తగీజ్ మరణానంతరం గృహ యుద్ధంలో సోదరుడైన యిస్మాయిల్‌ను పదచ్యుతునిజేసి 998లో సింహాసనం అధిష్టించాడు. అనంతరం రెండేండ్లపాటు సైనికశక్తిని సమకూర్చుకొని 1000 నుంచీ 1026 వరకు యితను అంటే మహమ్మదుగజనీ 17 తూర్లు దండయాత్రలు చేశాడు. 1925 లో సోమనాథదేవాలయం (గుజరాత్) అక్రమణతర్వాత ఆఖరు ఆక్రమణ 1926 లో జాటులపైజరిగింది యితనుచేసిన ప్రతిదండయాత్రలోను భారతదేశంనుంచి చేతికందినదల్లా దోచుకొని వెల్లట మేజరిగింది. అంటే యితనిఉద్దేశ్యంలో భారతదేశంలో పరిపాలన చేయటం కాక సంపత్తిని చేజిక్కించుకొనటమేవనేది స్పష్టమే 1030 లో యితను మరణించాడు.

10వ॥ శ॥ దాదాపు నింబాదిత్యుడు లేక నింబార్కుడు. వైష్ణవమత ప్రవక్త ఒకప్పుడు యితను జైనమతాచారితో శాస్త్రచర్చ చేస్తూవుండగా ప్రొద్దుపంకింది. జైనుడు సూర్యాస్తమయం తర్వాత అన్నంతినడు. యీవిష. యాన్ని గ్రహించిన నింబార్కుడు. సూర్యుని నిమ్మచెట్టపై నిలిపి జైనుని భోంచెయ్యమని చెప్పాడట కాబట్టీయితనీకి నింబార్కుడు అనిపేరువచ్చింది యితను ద్వైతాద్వైత సిద్ధాంతాన్ని ప్రచారంచేశాడు.

10 వ॥ శ॥ పద్మగుప్తుడు సంస్కృతమహాకవి. ధారాపుర చక్రవర్తి అయిన భోజుని పినతండ్రి ముంజుయొక్క సభాపండితుడు "నవసాహసాంగ చరిత" అను గ్రంథాన్ని రచించాడు. యితని రచనాశైలి కాళిదాసు. శైలికి సమానంగాఉంటుంది. (కుమారదాసుని జానకీహరణం) అశ్వఘోషుని బుద్ధచరితం కాళిదాసు రఘువంశం పద్మగుప్తుని సాహసాంగచరిత్ర ఒకే శ్రేణికిచెందిన కావ్యాలు యితని రెండవపేరు పరిమల.

10 వ॥ శ॥ అమృతచంద్రాచార్యులు "పురుషార్థ సిధ్యుపాయం" రచించిన జైనమతావళంబి,

10 వ॥శ॥ అమితగతి ఆచార్యులు జైనమతావళంబి "శ్రవకాచారం" సానుయికపధం, రచించాడు.

1000 ప్రాంతం నంబి అండార్ తమిళ శైవభక్తుడు. తమిళంలో శైవగీతములు రచించాడు.

1000 రత్నకీర్తి కాలం బౌద్ధమతావళంబి. తార్కికశాస్త్రంలో ప్రవీణుడు.

1001 నుంచీ 1380 వరకు ఆంధ్రపురాణయుగమని చెప్పవచ్చు. యీ కాలంలోనే సంస్కృత పురాణాలనేకం తెనుగులోకి అనువదించటము లేక అనుకరించటము జరిగింది. యిది ఆంధ్రసాహిత్యానికి ప్రకాశమానమైనకాలం.

1009-14 అయిదవ విక్రమాదిత్యుడు. సత్యాశ్రయపులకేశిఅనంతరం. అయిదవవాడుగా విక్రమాదిత్యుడు రాజ్యానికివచ్చాడు. భోజుడు యితనిపై దాడిచేసి ఓడించాడు.

1011–22 వేంగీచాళుకం విమలాదిత్యుని కాలం. యితను శక్తివర్మ సోదరుడు. యితని సుపుత్రుడే రాజరాజనరేంద్రుడు.

1013 జయపాలుడు. యితను జయపాలుని మనుమడైన అనంగపాలుని పుత్రుడు. 1022 లో మహమ్మద్ గజనీ లాహోర్ పైదాడిచేసి జయపాలుని ఓడించి, లాహోర్ను స్వాధీనంచేసుకొన్నాడు.

1014–15 జయసింహుడు రాజ్యానికి వచ్చుట. అయిదవ విక్రమాదిత్యుని కుమారుడు.

1018 లో రామానుజుడు. యితను తమిళదేశంలో పెరుంబుదూరు అను గ్రామంలో జన్మించాడు. దాదాపు నూరు సంll రాలు జీవించి దక్షిణదేశమందంతటా వైష్ణవమతాన్ని ప్రచారంచేశాడు. శంకరుని అద్వైతసిద్ధాంతాలను రామానుజుడు ఖండించాడు. కాంచీపుర నివాసియగు యాదవ ప్రకాశునివద్ద రామానుజుడు వేదాంతవిద్య నభ్యసించాడు.

1018 మహమ్మదుగజనీ దండయాత్ర.

1020–30 మొదటి బేతరాజు కాకతీయపరిపాలకుడు.

1022 నుంచీ 1063 వరకు రాజరాజనరేంద్రుడు. యితను రాజమహేంద్రవరం రాజధానిగా వేంగీదేశాన్ని పరిపాలించాడు. వీరిది వేంగీచాళుక్యవంశం. రాజరాజు తనమేనమామకూతురిని వివాహంచేసుకొని చోళరాజులతో నున్నసంబంధాన్ని సుదృఢంచేసుకొన్నాడు. యితనితమ్ముడైన విజయాదిత్యుడు సింహాసనంకొరకు నిరంతరం కుట్రలుచేస్తూఉండినాడు. ఫలితంగా రాజరాజు కొంతకాలం అజ్ఞాతవాసంచేసి చోళరాజులసహాయం

తో తిరిగి సింహాసనం ఆక్రమించాడు. కానీ, సింహాసనంకొరకు తమ్మునితో ఆఖరువరకు పోరాడవలసి వచ్చింది. ఆఖరుకు రాజరాజు యీ సంఘర్షణ లోనే ప్రాణాలుగోల్పోవలసివచ్చింది. యితనికాలంలో స్త్రీ శూద్రులకు పఠనశ్రవణాధికారాన్ని కల్గిస్తున్న ఆంధ్ర మహాభారతంలోని, ఆది-సభా అరణ్యాపర్వములు నన్నయభట్టారకుని ద్వారా తెలిగించబడినవి. యితనికాలం 985–1014 అనీ 1044 లో చనిపోయాడనీ కొందరి అభిప్రాయం.

1026 మహమ్మదుగజనీ గుజరాతులోని ప్రపంచ ప్రశస్తి చెందిన సోమనాధదేవాళయంపై దాడిచేశాడు. సోమనాధదేవాళయ సంరక్షణార్ధమై చాలామంది రాజపుత్రులు వచ్చి పోరాడారు. యీ యుద్ధంలో 500 మంది రాజపుత్రులు చనిపోయారు. ఆఖరుకు గజనీ విజయాన్ని సాధించాడు. శివలింగాన్ని బ్రద్దలుకొట్టి ధనరాసులు దోచుకొని, పూజారులను బానిసల్ని గా అమ్మేందుకు తీసుకొనిపోతూ శివలింగంయొక్క రాతిముక్కలను గజనీ పట్టణానికితీసుకెళ్లి మసీదుముందర సోపానశ్రేణిలో వేయించాడు.

1030–75 మొదటి ప్రోలరాజు కాకతీయ పరిపాలకుడు.

1040–50 ప్రాంతంలో నన్నయభట్టారకుని ద్వారా ఆంధ్ర మహాభారతకృతి సమర్పణం (రాజరాజుకు) జరిగింది.

1042–68 ప్రధమ సోమేశ్వరుడు. యితను కళ్యాణిచాళుక్యవంశస్థుడు. ప్రసిద్ధిచెందినపరిపాలకుడు. కళ్యాణిచాళుక్య వంశప్రతిష్ఠ భారతదేశంలో పెంపొందటానికి కారణభూతుడైనవాడు.

1045 ప్రాంతం వల్లభాచారి దక్షిణదేశవు తెలుగు బ్రాహ్మణుడు.

1050–1116 కృష్ణమిత్రుడు. ప్రబోధచంద్రోదయమను నాటకకర్త చందేల్ పాలకుడైన రాజాకీర్తివర్మ ఆస్థానపండితుడు.

1050–1100 కీర్తివర్మ (చందేల్ పాలకుడు) యితను ఛేదిపాలకుడైన కర్ణదేవుని ఓడించాడు.

1050 నుంచీ 1375 వరకు ఉత్తరదేశ సాహిత్యరంగంలో (హిందీలో) వీరగాధాకాలంగా పేర్కొనవచ్చు.

1050 నుండి 1350 వరకు ఓరుగంటి (వరంగల్లు) కాకతీయ చక్రవర్తులు రాజ్యపాలనచేసిన కాలం.

1050 పండితమల్లిఖార్జునుని జననం.

1056 ప్రాంతం వైదుంబభీమమహారాజు యింగల్లునాడును పరిపాలించిన వైదుంబులోనివాడు. (నేటి కడపజిల్లా పులివెందులతాల్కూ యిసగు. లూరు యింగల్లునాడు) యితను వేయించిన శాసనంద్వారా రాజరాజనరేంద్రుడు యీ ప్రాంతాన్నిజయించి తన ప్రతినిధిని నియమించగా తిరిగీ వైదుంబులుచాళుక్య ప్రతినిధిని తొలగించి స్వతంత్రులైనట్లు తెలుస్తూవుంది.

1070 నుంచీ 1250 వరకు చోళచక్రవర్తులకాలం.

1075-1110 రెండవబేతరాజుకాలం. కాకతీయవంశ పరిపాలకుడు

1076-1118 చోళకుళోత్తుంగ దేవుడు (రాజరాజు కుమారుడు) చోళచాళుక్య అనగా ఆంధ్ర తమిళ దేశాలకురాజై కంచిరాజధానిగా పరిపాలించాడు. యితని రెండవపేరు రాజేంద్రచోళుడు. యితను సముద్ర సైన్యాన్ని పోషించి బ్రహ్మపుత్ర, సుమిత్ర, పెగూ, అండమాను. నికోబార్ దీవులజయించి వాటిపైన తనఅధిపత్యాన్ని సంపాదించాడు. ఉత్తర దేశాన్ని జయించేందుకుగాను 1083 ప్రాంతంలో తన సైన్యాన్నిపంపాడు కూడా. యితని నిజయస్మారకంగా గాఙ్జైకొండవద్ద సోలాపురం అను నగరాన్ని నిర్మించి దాని తన రాజధానిగా చేసుకున్నాడు. యితను చోళ వంశపు రాజుకూతురును వివాహంచేసుకుని చోళరాజ్యానికి వారసుడై ప్రథమంలో కంచిలో తన పరిపాలనను సాగించాడుకాబట్టి చాళుక్యకు బదులుగా రాజేంద్రచోళుడయాడు. (యితనికాలం 1014 నుంచీ 44 వరకనీ 1023 లో ఉత్తరదేశాన్ని జయించేందుకు సైన్యాల్ని పంపాడని కొందరి అభిప్రాయం.

1076-1126 ఆరవ విక్రమాదిత్యుడు. కళ్యాణి చాళుక్యులలో సోమేశ్వరుని అనంతరం యితను ప్రసిద్ధిచెందినవాడు. యితను తన రెండవ సోదరుని పదచ్యుతునిజేసి సింహాసనాన్ని ఆక్రమించాడు. యితని రాజధాని మహారాష్ట్రదేశంలోని కళ్యాణినగరం, బెంగాలు మాళవ దక్షిణప్రదేశాలను జయించి వంశప్రతిష్ఠను యినుమడింపజేశాడు.

1070-1120 విజ్ఞానేశ్వరయతికాలం యాజ్ఞవల్క్య-స్మృతికి వ్యాఖ్యారూపకంగా "మితాక్షర" అను ధర్మగ్రంథాన్ని రచించాడు. యిది వంగ

దేశంలోతప్ప మిగతా భారతదేశంలో ప్రామాణిక గ్రంథంగా పరిగణింప బడింది.

1076–1108 మొదటి గొంకరాజు. యితని కుమారుడు కంచి పరిపాలకుడైన కుళోత్తుంగుని అధిపత్యాన్ని కాదని స్వతంత్రుడయ్యాడు. (1118 లో)

1081 లో అనంతరాజు చనిపోగా యితని యిద్దరు సేవకులు భార్య మరికొందరు దాసీస్త్రీలు సహగమనంచేశారు.

1084 లో కుళోత్తుంగచోళుడు ప॥ గోదావరి జిల్లాలోని ఒక గ్రామంలో నివసించే వేయి తెలిక కుటుంబాల హరిసౌలభ్యంకొరకుగాను ఒక శాసనాన్ని వ్రాయించియిచ్చాడు.

1085 లో చంద్రదేవుడు యితను–గహారబార వంశస్థుడు–రాజును పాలిస్తున్న. ప్రతిహారవంశస్తుడైన త్రిలోచనపాలుని ఓడించి కనోజును స్వాధీనంచేసుకొని చుట్టు పట్లుప్రాంతాన్నంతటినీ జయించి 1100 లో యితను చనిపోయాడు. యితనిపుత్రుడు ధనపాలుడు సింహాసనంఅధిష్టించాడు

11వ॥ శతాబ్దంలో–ఆంధ్రశబ్దచింతామణి రచించబడింది–దీనిని నన్నయభట్టు రచించాడని ప్రతీతి.

11వ॥ శ॥ లో జయదేవుడు–జయదేవచ్ఛంధము అను–చిం చో గ్రంథాన్ని రచించాడు.

11వ॥ శ॥ మల్లలకవి నాదేంద్రచూడామణి రచించాడు.

11వ॥ శ॥ లో సోమదేవుడు–యితను కాశ్మీరును పాలించిన హర్ష దేవుని సమకాలికుడు. క్రీ॥ పూ॥ 200 నాడు గుణాఢ్యుడు రచించిన కథాసరిత్సాగరాన్ని సంస్కృతంలోకి అనువాదంచేశాడు.

11వ॥ శ॥ లో అమరావతీస్తూపం చాలా ఉచ్ఛదశలోనున్నట్లు తెలుస్తూంది. అందులోని ఒకశాసనంలో ॥చైత్యామత్యున్నతం. యత్ర నానాచిత్ర సుచిత్రితం॥ (11వ॥ శ॥ చెందినదీ శాసనం) అనివుంది.

1100 లో కపిలర్—తమిళరచయిత యితను వేమన బసవయ్య కోవకు చెందినవాడు. సంఘసంస్కరణ కులవిద్వేషాలను నిశితంగా ఖండించటం వగైరాలంతా చేశాడు.

11వ॥ శ॥ నానావిధ నాట్యశాలలపోషణార్థమై తగిన భూవసతులను కుళోత్తుంగుడు ఏర్పరచినట్లు యితనిశాసనం తెలియజేస్తున్నాడు.

11వ॥ శతాబ్దారంభం జీమూతవాహనుడు యితను సనాతన హిందూ శాస్త్రపండితుడు మనుస్మృతికి భాష్యాన్నికూడా రచించాడు. విజ్ఞానేశ్వరుని సమకాలికుడనీ యిద్దరు సన్నిహిత సంబంధం కలవారేననీ చెప్పబడుతూవుంది.

11వ॥ శ॥ లో దామోదరమిశ్ర యితను భోజరాజు సమకాలికుడని కొందరిఅభిప్రాయం ॥హనుమన్నాటక సంగ్రహం॥ రచించాడు.

11వ॥ శ॥ లో—లోల్లటభట్ట-యితను కాశ్మీరం నివాసుడు. సంస్కృత కవి గుమ్మటభట్టకంటే పూర్వపువాడు. యితనికాలం సరిగానిర్ణయించటం కష్టం అయినా పండితులంతా 11వ॥ శతాబ్దివాడేనని అంటున్నారు.

11వ॥ శ॥ భోజరాజు యితను కేవలం రాజ్యాధికారి మాత్రమేగాక సంస్కృత సాహిత్యవేత్తలలో ప్రసిద్ధిచెందినవాడు మాళవదేశపు ధారా నగరపు చక్రవర్తి. యితను రచించిన ॥సరస్వతీకంఠాభరణం॥ భోజచంపూ వగైరా గ్రంథాలు చాలాప్రసిద్ధి చెందినవి మను సంహితకు టీకకూడా రచించాడు. యితనికాలంలో సంస్కృత పండితుల కాదరణ ఎక్కువగా లభ్యమయిన కారణంగా సంస్కృత విద్యావికాసం చెందటము సంస్కృత గ్రంథాలు విరివిగా తయారు కావటము జరిగాయి.

11వ॥ శ॥ భానుమతి. యీమె భోజునికుమార్తె, కాళిదాసుభార్య అని చెప్పబడుతూవుంది. యీమె ఇంద్రజాలవిద్యలో అత్యంత నైపుణ్యం సంపాదించింది.

11వ॥ శ॥ కాళిదాసు. యితను భోజునిఆస్థానపండితుడు. సంస్కృత పండిత కాళిదాసులలో మూడవవాడు. భోజకాళిదాస అన్న పేరుతో చిత్రాతిచిత్ర గాథలను పేరు మోసినదితనే.

11వ॥ శ॥ వాడు కైయట్ కాశ్మీరు పండితుడు వ్యాకరణ మహా భాష్యానికి టీకవ్రాశాడు. యీకాలానికి సంబంధించిన వ్యాకరణంలో యితనికి మంచిపేరుండేది.

11వ॥ శ॥ క్షేమేంద్రుడు. యితను కాశ్మీరరాజా అనంతదేవుని సమకాలికుడు యితనువ్రాసినవి దాదాపు 30 వరకు గ్రంథాలున్నాయి.

11వ॥ శతాబ్దం గోవిందరాజు (మాధవునికొడుకు) మనుస్మృతి టీకాకారుడు.

11వ శతాబ్దాంతం లేక 12 శతాబ్దారంభం చోరకవి లేక బిల్హనుడు కాశ్మీర్ సంస్కృత పండితుడు ॥విక్రమాంకదేవ॥ కర్ణసుందరి నాటకాలు. ॥చౌరపంచశిఖా॥ వగైరా గ్రంథాలను రచించాడు. యితను గుజరాతు వీరసింహరాజు పుత్రికకు విద్యనేర్పుతూవున్న సందర్భంలో యిద్దరుప్రేమించుకొని గాంధర్వవివాహం చేసుకుంటారు. యీసమాచారం రాజుకుతెలిసి బిల్హనునికి శిరచ్ఛేదన చేయమని ఆజ్ఞాపిస్తాడు. బిల్హనుడు వధ్యస్థానానికి పోయేలోగా ప్రేమపూర్వకమైన 50 శ్లోకాలు తయారు చేస్తాడు. యితని పండిత ప్రకర్షకు రాజుప్రసన్నచిత్తుడై యితనిని క్షమించి విడుదలచేస్తాడు, విజ్ఞానేశ్వరుని శిష్యుడు.

1100–65 మధ్యవాడు. బసవుడు. కళ్యానిరాజధానిగా కన్నడ ప్రాంతాన్ని పాలిస్తున్న బిజ్జలుని కోశాధికారి యితను వీరశైవమతస్థుడు. బిజ్జలుడు జైనమతస్థుడు వీరిద్దరిమధ్య అభిప్రాయ భేదాలురాగా బసవుడు కళ్యాణిని విడిచి మైసూరుప్రాంతం వెళ్లిపోతాడు. కానీ బశవుని అనుయాయులు విజృంభించి జైనమతస్థులను హింసిస్తారు. యితని శైవమత సాంప్రదాయంలో కులతత్వాలు పాటించకూడదు. యీ శైవసంఘర్షణ 1166 లో జరిగిందని చెప్పబడుతూవుంది.

1100–44 జయసింహసిద్ధరాజు—యితను గుజరాతుచాళుక్య ప్రథమ భీమదేవుని కుమారుడు—ప్రతిభావంతుడైన శాసకుడు యితను చందేలరాజు మదనవర్మ చేతిలో ఓడిపోయాడు. యితనికి పుత్రులులేని కారణంగా యితని అనంతరం యితనివంశస్తుడైన కుమారపాలుడు రాజ్యానికివచ్చాడు.

1145–72 కుమారపాలుడు—జైనమతావళంబి. ప్రసిద్ధగ్రంధరచయిత జైనగురువు అయిన హేమచంద్రుడు యితని ఆస్థానపండితుడు యితను మాళవ చాళుక్యుల ఓడించి మాళవరాజ్యాన్నికూడా స్వాధీనంచేసుకున్నాడు

1100 వేంగీచాళుక్యుల పరిపాలన అంతమైనకాలం అనిచెప్పవచ్చు.

1100–1170 మధ్యకాలం. మల్లికార్జున పండితారాధ్యుడు ||శ్రీపతి|| ||శివలెంకన|| లు కూడా యీకాలపువారే. వీరుముగ్గురు పండితులే శైవ మత పునరుద్ధరణకు పూనుకున్నవారుకూడా —మల్లికార్జునుని జన్మస్థానం. తూర్పుగోదావరి జిల్లాలోని దాక్షారామం యితనికాలంలోనే వెలనాడు రాజధానిగైన చందనోలులో. రెండవ చోడుడు పాలిస్తూ వుండినాడు. యీతని ఆస్థానంలో) బౌద్ధపండితునికీ మల్లికార్జునునికీ వాగ్వివాదం జరిగింది ఆవాగ్వివాదం తుదకల్లా దూషణ ప్రతిదూషణలతో అంతమయింది. మల్లికార్జునుడు కులమతాలను పాటించాడు. వీరశైవమతస్థాపకుడైన బసవుడు కులమతాలను వ్యతిరేకించాడు.

11వ|| శ|| హిందూదేశముపై దండయాత్రచేసిన ఘజనీవెంట అల్ బిరూనీ—అను పండితుడు భారతదేశంవచ్చాడు. యితను భారతదేశంలో చాలాకాలంవుండి సంస్కృతం అభ్యసించి హిందూపురాణాలూ భగవద్గీత వగైరాలను అధ్యయనంచేశాడు. యితను గణిత ఖగోళ భౌగోళిక పదార్థ రసాయన వగైరాశాస్త్రాలలోకూడా ప్రావీణ్యాన్ని సంపాదించాడు.

1100 నాగవాపి—కళాశాల హైదరాబాదులోని ||వాడి|| కి సమీపంలో. నేటి ||నాగాయి|| అనుచోట యీ కళాశాల వుండినట్లు అచ్చట లభ్యమయిన శాసనాలనుబట్టి తెలుస్తున్నది. యిందులో శైవాగమములు తర్కం వేదాలు. శాస్త్రాలు బోధనావిషయాలుగా వుండినట్లు తెలుస్తూ వున్నది.

11వ|| శ|| లో దేవలస్మృతి ||ఉత్పన్నమయినకాలం సింధుప్రాంత ఆక్రమణకాలంనుంచీ దేశంలోబలవంతంగానూ ఐచ్ఛికంగానూ ముస్లింమతం లోకి మార్చబడిన వారినంతా తిరిగి హిందువులనుగా స్వీకరించేదునుగాను ఈదేవలస్మృతి ఉత్పన్నమయింది.

11వ|| శ|| నింబార్కుడు. రామానుజుని అనంతరము మధ్వాచార్యుని బూర్వము జీవించాడు. వేదాంతపారిజాత సౌరభము|| దశశ్లోకి|| అను గ్రంథాలు రచించాడు.

1100 ప్రాంతంలో దక్షిణతమిళదేశంనుండీ వెల్లాల అను వారువచ్చి కాకతీయుల సేనలోకలసిపోయారు. బహుశా వీరే కాలక్రమంలో వెలమ నాయకులై యుందురని కొందరియూహ.

1100 యాదవప్రకాశుడు. కాంచీపురములో జీవించి ॥అద్వైతార్థ ప్రతిపాదకమను స్వతంత్రభాష్యమును రచించాడు.

11వ॥ శ॥ సెక్కారాయుడు. పెరియపురాణ రచయిత శైవమతస్థుడు

11వ॥ శ॥ అల్బెరూని జీవితకాలం.

1108 నుంచీ 1206 వరకు వెలనాటి చోడులకాలం. యీకాలంలో యీవంశస్థులు నలుగురురాజులు పరిపాలించారు. వీరుగుంటూరుజిల్లాలోని చందవోలు రాజధానిగా చేసుకున్నారు (కృష్ణా. పెన్నానదులమధ్య ప్రాంతమంతా వెలనాడు అని పిలువబడింది.)

1114–60 మదనపాలుడు (గహగవారవంశస్థుడైన చంద్రదేవుని కుమారుడు) యితను అంతసమర్థమైన పరిపాలకుడు కాలేకపోయాడు. యితని అనంతరం సింహాసనమెక్కిన గోవిందచంద్రుడు సమర్థవంతమైన యితనికాలంలో కన్యాకుబ్జతిరిగీ పూర్వవైభవాన్ని వెలగించింది. యితను బెనారస్ (కాశీ) పైనజరిగిన ముస్లింలదాడిని వీరత్వంతో ఎదుర్కొని బెనారస్‌ను రక్షించాడుకూడా.

1114 భాస్కరాచార్యుడు. ప్రసిద్ధజ్యోతిష గణితశాస్త్రవేత్త యితను దక్షిణదేశంలోని సహ్యాద్రి పర్వతప్రాంతంలోని ॥విజ్జడపిడ॥ అను గ్రామనివాసి॥ సిద్ధాంతశిరోమణి అనుగ్రంథాన్ని రచించాడు. యిది నాలుగుభాగాలు 1 లీలావతీలేక పాటిగణితము. 2 బీజగణితము 3 గ్రహణ గణితాద్యము 4 గోలాధ్యాయము యితనిపుత్రుడు లక్ష్మీధరుడు, పుత్రిక లీలావతీ. యీలీలావతీ పేరుతో నే ప్రథమ భాగం తయారుచేయబడిందని చెప్పబడుతూ ఉందియితను రెండవభాస్కరుడు.

1115–58 మధ్యకాలం—కాకతీయ రెండవ ప్రోలరాజు పరిపాలన యితను వీరశైవబసవయ్యకు సమకాలికుడు, రెండవప్రోలరాజు. బిజ్జలునికి సహాయార్థంగా తనసైన్యాలను పంపినట్లు చెప్పబడుతూవుంది.

1116 జయదేవుడు, భక్తికవిగీతాగోవింద, రచయిత బెంగాల్ లక్ష్మణసేనుని ఆస్థానపండితుడు. యితను బెంగాలులోని వానభూమిజిల్లా ॥కేందూల, గ్రామవాసుడు. తండ్రి భోజదేవుడు తల్లి వామదేవి.

1116 కవిరాజ లేక కవిరాయ (బెంగాల్ లక్ష్మణసేనుని ఆస్థాన పండితుడు) రాఘవపాండవీయం అనుగ్రంథాన్ని రామాయణ భారత కథా సంగ్రహాన్ని సమ్మిశ్రితంగా చూవిస్తూరచించాడు.



1117 కాకతీయులు—హనుమకొండనుంచి. ఏకశిలాపురి (వరంగల్)
లో సామ్రాజ్యాన్ని స్థాపించుట.

1118 కళ్యాణిచాళుక్య రాజైన విక్రమాదిత్యుడు. ఆంధ్రదేశముపై దాడిచేసి. వెలనాటి చోడులను. ఓడించి 1118 నుంచీ 1135 వరకు అంటే 17 సంవత్సరాలు దాదాపు ఆంధ్రదేశాన్ని పరిపాలించాడు.

1120–50 మధ్యకాలంలో నన్నెచోడుడు జీవించివుంటాడని పలువురు చరిత్రకారుల అభిప్రాయమైయున్నది. యితను కుమారసంభవమను స్వతంత్ర కావ్యాన్నిరచించిన ప్రసిద్ధకవిశేఖరుడు.

1130 లో కదంబరాజైన, తైలపదేవుడు చనిపోగా అతనిఅనుచరుడు బోసన్నకూడా సహగమనంచేశాడు.

1132 వెలనాటి రాజైన రెండవగొంకరాజు నాటిసామంతరాజులందరినీ ఐక్యంచేసి కన్నడపరిపాలకులకు వ్యతిరేకంగా 1135లో ఘోర యుద్ధంచేసి వారినిఓడించి తెలుగుదేశాన్ని స్వాధీనం చేసుకున్నారు. తెలుగుదేశాన్ని విముక్తం చేసెందుకు ప్రముఖపాత్ర వహించినకారణంగా వెలనాటిచోడులు తెలుగు చోడులుగా ప్రఖ్యాతి చెందారు.

1132 ప్రాంతం 3 సోమేశ్వరదేవుడు పశ్చిమచాళుక్యరాజు, యితను ॥అభిలషితార్థచింతామణి॥ అనుసంస్కృతగ్రంథాన్నికూడారచించాడు. 1150 మధ్యకాలం—విక్రమాదిత్యుని కుమారుడు భూలోకమల్లు త్రైలోక్యమల్లు బిరెదములితనికి కలవు.

1143 కల్హణుడు సంస్కృతకవి. యితను కాశ్మీరనివాసి, రాజా జయసింహుని కాలపువాడు. కాస్మీరురాజుల యితిహాసాలకు సంబందించిన ॥రాజతరంగిణి॥ అనుగ్రంథాన్ని రచించాడు.

1148 జైనరాజ్—జైన బౌద్ధ యితిహాస్జ్ఞ పండితుడు—1135 లో కల్హనుడు రాజతరంగిణి గ్రంథాన్ని అసంపూర్ణంగా విడిచిపెట్టిపోగా మిగత భాగాన్ని జైనరాజు సంపూర్ణంచేశాడు—కానీ యితడు సంపూర్ణంచేసిన రాజతరంగిణి—రెండవ భాగంగా పరిగణించ బడుతూవుంది—భార విక్రతి. అనుగ్రంథానికి టీక కూడా రచించాడు. యితెనిశిష్యుడు శ్రీవరపండితుడు.

యితను శ్రీవరుడు మూడవభాగంగా మరికొంత రాజతరంగిణిని తయారు చేసాడు.

1150–63 రెండవ తైలపుడు పశ్చిమచాళుక్యులలోనివాడు. కళ్యాణి యితనిరాజధాని. బిజ్జలుడు యితనివద్ద దండనాయకుడుగావుండి 1157 ప్రాంతంలో స్వతంత్రుడై కల్యాణిని ఆక్రమించాడు.

1150 దాదాపు ఉమాపతిదేవుడనే బెంగాల్ శైవభక్తుడు రెండవ రాజరాజుకాలంలో దక్షిణాదికివచ్చి స్థిరపడిపోయాడు.

1150 వరదరాజు యితను –కుసుమాంజలీ–వ్యాఖ్యానం –తార్కిక రక్ష–అనుస్వతంత్ర గ్రంథాలనురచించాడు.

1160 యీకాలం తర్వాతనే కోమటిఅనేపదం. నేటిఅర్థంలో అంటే వైశ్యానికి సంబంధించిన పదంగా–ఉత్పత్తిఅయింది కానీ అంతకు ముందు యీపదం యీఅర్థంలో లేదని చెప్పబడుతూవుంది.

1150 నన్నెచోడుని కాలమని కొందరిఅభిప్రాయం

1155 నడదూర్ అమ్మాళ్ యీ మెతమిళ రచయిత్రి ॥ప్రేమమాలా తత్వసారము॥ ప్రసన్నపారిజాతము॥ యింకా శంకరమత బోధవిషయిక గ్రంథాలు. వగైరాలను రచించింది.

1155 చెంఘిజ్ ఖాన్ (మంగోలియా) జననం.

1156–83 వరకు కలచురిబిజ్జలుడు. యితను కళ్యాణిచాళుక్యుడైన మూడవ తైలపుని కూలద్రోసి కళ్యాణి మరాఠ్వాడ రాజ్యాధికారాన్ని స్వీకరించాడు.

1158 కాకతీయ రెండవప్రోలనాయకుడు తెలంగాణా ఆక్రమణ పూర్తిఅయిన పిమ్మట కృష్ణానదికావలనున్న తెలుగుచోడులనుకూడా జయించాలనే తలంపుతో వెలనాటిరాజైన గోకరాజుతో యుద్ధంచేసి చనిపోయాడు. యితనికాలం 1110 నుంచీ 1158 వరకు అనికూడా అంటు న్నారు.

1158 నుంచి 95 వరకు. రుద్రదేవుడు కాకతీయ ప్రభువు.

1160–70 విజయచంద్రుడు. గహరవార వంశస్తుడైన గోవింద చందుని కొడుకు యితను అధికారానికివచ్చిన కొంతలాకానికే విగ్రహ రాజైన ॥విశాలదేవుడు॥ దాడిచేసి ఓడించి ఢిల్లీనిస్వాధీనం చేసుకున్నాడు విజయచందు్రని పుతు్రడు జయచందు కన్నౌజును పాలించిన ఆఖరిహిందూ సామా్రట్టు. యితను 1193 లో శిహాబుద్దిన్ గోరీ కన్నౌజుపై దాడిచేసి నపుడు యుద్ధంలో (జయచందు) చనిపోయాడు. కన్నౌజును ముసల్మానులు ఆక్రమించారు. కానీ జయచందు పుతు్రడు ॥హరిశ్చంద్రుడు॥ గోరీకి సామంతుడుగా కన్నౌజులోఉండి పోయాడు. 1225 లో ఇల్టుతమిశ్ దాడిచేసినపుడు. ఆకాస్తఅధికారం, తీసివేసి. జయచందుని పదచ్యుతుని చేశాడు.

1162 పా్రంతం వరంగల్‌ను 40 మైళ్లదూరములోనున్న ప్రసిద్ది చెందిన రామప్పగుడులు రెడ్డిసేనాని అను రెడ్డి సామంతుడు కట్టించాడు.

1162 రుద్రదేవుడు. యితనే చరిత్రలో మొదటిప్రతాప రుద్రుడు గా పరిగణింప బడ్డాడు. యితనుపోలరాజు పా్రరంభించిన దండయాత్ర లను ముందుకుతీసుకెళ్లాడు. మేడరాజు దొమ్మరాజు మైలగిదేవుడు చోడో దయుడు మొదలైన స్థానిక ప్రభువుల జయించినమీదట వెలనాటిపై దండయాత్రచేశాడు. శ్రీశైలం త్రిపురాంతకం వగైరాపా్రంతాలను స్వా ధీనం చేసుకున్నాడు. 1186 లో తిరిగిదండయాత్రచేసి గోదావరి కృష్ణ గుంటూరు ప్రాంతాలను స్వాధీనం చేసుకున్నాడు. 1176–82 మధ్యకాలం లో జరిగిన పల్నాటియుద్ధంలో నాయకురాలికి సహాయంగా వేగులగుగ్రప్ప సైన్యాన్నికూడా పంపాడు చివరకు దేవగిరి రాజైన ॥జైతుడి॥ చేతులలో యితను మరణించాడు, యితని సోదరుడు మహదేవరాజు దేవగిరి యాద వునిపైన పగసాధించవలెనని ప్రయత్నించి విఫలుడైనాడు.

1162 పా్రంతంలో హనుమకొండ (వరంగల్) లోని వేయిస్తం భాలగుడి నిర్మాణంజరిగింది. యిదిచాళుక్య శిల్పాన్ననుసరించి వుంటుంది,

1170–93 రాణీసంయుక్త యీమె పృథ్వీరాజుభార్య. 1170 లో జన్మించింది 1190లో పృథ్వీరాజును వివాహమాడింది. 1193లో

మహమ్మద్ గోరీతో యుద్ధంచేస్తూ పృథ్వీరాజు బందీగా చిక్కగా సంయుక్త ముస్లింలనుంచి ఆత్మసంరక్షణార్థం ప్రాణత్యాగం చేయాల్సి వచ్చింది. యీమె యుద్ధభూమికివెళ్లుచున్న పతిని యుద్ధాలంకారాలతో అలంకరించి పంపిన వీరవనిత

1172–82 మధ్యకాలంలో పల్నాటియుద్ధం. యీయుద్ధారంభంతో వీరపూజ అనే నూతనసాంప్రదాయం అమలులోకివచ్చింది. ఫలితంగా వీర గుడ్డములు– వీరగుడులుకూడా ఏర్పాటైనాయి యీయుద్ధం, పల్నాడు తాలూకా కారంచేడులో జరిగింది. గురజాల రాజధానిగా పాలించిన నలగామరాజుకు. అతని సవతితమ్ముళ్లైన మలిదేవరాజు సోదరులకుమధ్య రాజ్యాధికారల కొరకు కలహం ప్రారంభమైంది. నలగామరాజు మంత్రి అయిన బ్రహ్మనాయుడు. సవతితమ్ములపక్షం వహించాడు మాచెర్లప్రాంతాన్ని సవతితమ్ములకు యిప్పించి తానుకూడా మాచెర్లకుపోయాడు. మలి దేవరాజుకు. ముఖ్యమంత్రిగా :పరిపాలనా భారమంతా బ్రహ్మనాయుడే వహించాడు. నలగామరాజు, నాగమ్మ అనుకాపుస్త్రీని మంత్రిగా నియమించుకున్నాడు. పల్నాటియుద్ధంలో యీమెప్రముఖపాత్ర వహించింది. కాబట్టే నాయకురాలు అనేపేరుతో ప్రసిద్ధిచెందింది యీయుద్ధం 1180లో జరిగిందని కొందరఅభిప్రాయం. అజయపాలుడు–కుమారపాలుని అనంతరం రాజ్యానికి వచ్చాడు అసమర్థుడైన కారణంగా త్వరలోనే పదవీచ్యుతుడైనాడు.

1174 అనంగభీముడు ఒడిసాను పరిపాలించినరాజు. యితనికాలంలో చాలా యశస్సు సంపాదించాడు. జగన్నాధ మందిరాన్ని యితనే కట్టించాడనికూడా చెప్పబడుతూవుంది.

1180–94 చతుర్ధ సోమేశ్వరుడు కళ్యాణి చాళుక్యవంశపువాడు. అసమర్థుడైన పరిపాలకుడు.

1184–90 భిల్లిమ దేవగిరి యాదవరాజు అసమర్థుడైన చతుర్థ సోమేశ్వరుని ఓడించి కళ్యాణి చాళుక్యవంశాన్ని అంతంచేసి కళ్యాణిరాజ్యాన్ని విలీనంచేసుకున్నాడు.

1186 పృథ్వీశ్వరాజు వెలనాటిచోళుడు. పిఠాపురం ప్రాంతాన్నిపరిపాలించిగెల్లూరు చోళరాజులతో 1206 లో జరిగినయుద్ధంలో మరణించాడు.

1189 యించు మించు చాళుక్యుల అధికారం సమాప్తమయినకాలం వీరు శైవమతాభిమానులు శిల్ప, సంగీత, నాట్యకళలను ప్రోత్సహించారు. (వీరి తర్వాత హోయసలులు యాదవులు అధికారానికి వచ్చారు) వీరికి ప్రథమంలో కాకతీయులు సామంతులు గావుంటూ ఆర్సవిక్రమాదిత్యుని మరణానంతరం రెండవ ప్రోలరాజు చాళుక్యాధికారాన్ని ధిక్కరించి ఓరుగల్లు రాజధానిగా రాజ్యపాలన మారంభించాడు.

1190 శ్రీహర్షుని కాలమని కొందరిఅభిప్రాయం.

1191 పృథ్వీరాజు చౌహాన్—చౌహాణవంశస్థుడు. యీ వంశస్థులు అగ్నికులక్షత్రియులమని చెప్పుతున్నారు. జయచంద్రునిద్వారా పృథ్వీరాజు అవమానింపబడటం. పృథ్వీరాజుద్వారా జయచంద్రుని పుత్రిక సంయోగిత అపహరణ—వగైరా కారణాలవల్ల వీరిద్దరికీ మనస్పర్థలు పూర్తిగాబలిసిపోయాయి 1191 లో మహమ్మదుగోరీ పృథ్వీరాజుపై దాడిచేసినపుడు. తరాయిన్ మైదానంలో పృథ్వీరాజు యవనసేనలను ఓడించి పారద్రోలాడు కానీ 1192 లో తిరిగీ మహమ్మదుగోరీ దాడిచేసినపుడు. పృథ్వీరాజు ఓడిపోయి వీరమరణం పొందాడు. పృథ్వీరాజు కొడుకు తర్వాతకొంతకాలంపాటు ఢిల్లీనిపాలించాడు. కానీకుతుబుద్దీన్ ఢిల్లీని సంపూర్ణంగా స్వాధీనంచేసుకొనిచౌహాన్ వంశాన్ని నిర్మూలించాడు.

1194 లో కనౌజును పాలిస్తున్న గహరవారవంశస్థుడైన జయచంద్రుని మహమ్మదుగోరీ ఓడించి కనౌజును తనఅధికారం (కిందికి తెచ్చుకున్నాడు. యీజయచంద్రుడు పృథ్వీరాజుపైని మనస్పర్థల కారణంగా ప్రథమంలో గోరీకి సహాయంచేసినాడు. యీ దేశద్రోహ ఫలితం త్వరలోనే. జయచంద్రుడు కూడా అనుభవించాల్సి వచ్చింది.

1197 మహమ్మద్ ఖిల్జీ 200 మంది సవార్లతోనే బీహారుజయించాడు. యిది అపూర్వసంఘటనేమీకాదు. యింతకంటే ఆశ్చర్యకరమైన విషయం యితనే 1199 లో కేవలం 18 మంది సవార్లతోనే బెంగాలు రాజధానియగు నడియాపై దాడిచేయగా వంగరాజు కనీసంశత్రుమూకలెంతమందిఅని తొంగిచూడనైన దోచూడక డ్డితలుపులదారిన పారిపోయాడు (హిందూరాజులస్థితిని యీఘటనలు తెలియజేస్తాయి)

1198 పూరీ జగన్నాథ దేవాలయానికి సంబంధించిన సత్రాలలో (మదాళపంజ) గాంగవంశపురాజులలో ఏడవవాడైన అనంగభీమదేవుడు నిర్మించినట్లు వ్రాయబడింది. యిక్కడి ముఖమంటపము ముఖసాల భోగి మంటపము. నగారాలను 1465-1495 లో రాజా పురుషోత్తముడు నిర్మింప జేశాడు. యిదిప్రాచీనబౌద్ధగ్రామం అని కొందరిఅభిప్రాయం. యిక్కడ కులమతాలు పాటింపబడవు నైవేద్యం కుండల (మట్టి) లోనే తయారుచేయ బడుతుంది. యిందుకుగాను రోజుకొకరు చొప్పున మట్టిపాత్రలు యిచ్చేందుకు గాను 364 కుమ్మరి కుటుంబాలవారు స్వామిఖర్చుక్రిందనే జీవిస్తున్నారు. భోయివంశానికి చెందిన పూరీరాజులు యీ ఆలయానికి ధర్మకర్తలు.

1198 లో గణపతిదేవుడు రాజ్యానికివచ్చాడు. యితను కాకతీయ మహాదేవరాజు కుమారుడు యితను రాజ్యానికి రాకపూర్వం 12 ఏండ్లు దేవగిరి యాదవులవద్ద ఖైదిగాఉండినాడు. యీకాలంలో సామంతులు తిరుగుబాట్లు చేయగా రేచర్ల రుద్రుడు అనుసేనాని యీ తిరుగుబాట్లు అణచివేసి రాజ్యాన్ని గణపతిదేవునికి వప్పగించాడు. యితని కాలంలో కాకతీయ సామ్రాజ్య విస్తరణ కావలసినంత కొనసాగింది. 1195-1262 మధ్యకాలపువాడనీ చెప్పబడుతూవుంది

1199 శాలివాహన శకం 1121లో కాళయుక్తి సంవత్సర భాద్రపద మాసమున తిక్కనసోమయాజి మరణించాడు.

1199లో మధ్వాచార్యుడు దక్షిణకనరాజిల్లాకు చెందిన ఉడిపి గ్రామంలో జన్మించాడు. యితనికి పూర్వప్రజ్ఞుడు ఆనందతీర్థుడు అనే పేర్లుకూడా కలవు

1199లో కుతుబ్ మినార్ (ఢిల్లి) అను అయిదతంస్థులుగల గోపుర నిర్మాణం జరిగింది.

1200 ఇల్టుతమిష్ గులుమ్ వంశస్థాపనకాలం మధ్యాశియాలోని యిల్బారీ కబీల తుర్క్-జాతిలో పుట్టిన ఇల్టుతమిష్ తనసోదరులద్వారా జమాలుద్దీన్‌కు విక్రయించబడి (బానిసగా) తదనంతరం కుతుబుద్దీన్ యితనిని

కొన్నాడు. యిల్తుతమిశ్ ప్రతిభసమర్థుడై కుతుబుద్దీన్ తన పుత్రికనిచ్చి, వివాహంచేసి బులందశహరీ పరిపాలకునిగా నియమించాడు. కుతుబుద్దీన్ మరణానంతరం కుతుబుద్దీన్ పుత్రుడు ఆరామ్‌శాహీ అసమర్థుడైన కారణంగా యిల్తుతమిశ్ యితనిని తొలగించి ఢిల్లీ సింహాసనాన్నధిష్టించి సుల్తాన్ అయినాడు. యితను 1226 లో రణదంభోర్, 1227 మండార్ 1231 లో గ్వాలియర్ 1234–35 లో మాళవ వగైరా రాజపుత్రస్థానాలను జయించి ఢిల్లీ సామ్రాజ్యాన్ని విస్తృతంచేశాడు. కుతుబ్‌మినార్ యితను కట్టించినదే. 1235 లో యితను మరణించాడు.

1200 నుంచి మధ్యయుగం ఆరంభమై 1526 వరకు మధ్యయుగంఅనే పేరుతో పరిగణించటం జరుగుతూవుంది.

12 వ॥ శ॥ లో గోవర్థనాచారి (యితని తండ్రి నీలాంబరుడు.) ఉమాపతిధరుని సమకాలీనుడు. శృంగారకవిత్వంలో ప్రసిద్ధిచెందినవాడు.

12 వ॥ శతాబ్దాంతపువాడు, గోవిందఠాకుర్ యితను మిథిలావాసి సంస్కృత పండితుడు.

12 వ॥ శ॥ గంగేశుడు. మిథిలానగర నివాసి. తత్వచింతామణి రచించాడు.

12 వ॥ శ॥ దేవసూరి – ప్రమాణ – నయతత్వాలో కాలంకారం॥ అను గ్రంథాన్ని రచించాడు.

12 వ॥ శ॥ ప్రభాచంద్రుడు ॥ప్రమేయకమల మార్తాండం॥ రచించినవాడు.

12–13 శతాబ్దాల ప్రాంతంలో అనంతపురం జిల్లా కదిరి నరసింహస్వామి ఆళయగోపుర నిర్మాణం జరిగింది. ఆళయంలోనిశిల్పం శాలివాహన శకం 1274 లో నిర్మించినట్లు శిలాశాసనం ద్వారా తెలుస్తూవుంది. యీ ఆళయ ప్రాకార మండపములు వేయికాళ్లమండపం వగైరాలు పల్లవ, చాళుక్యుల కాలంలోనే కట్టించినట్లు తెలియవస్తూవుంది. ముఖద్వార గోపురం ఆళయరంగమండపం పాతరేపల్లె శ్రీరంగనాయకుడను పాళెగాడు కట్టించాడు. దక్షిణగోపురం సాసువులచిన్నమ్మ పశ్చిమగోపురం కొక్కంటి సంస్థానం శ్రీమమూగిమల్లప్పనాయుడు కట్టించినట్లు తెలుస్తూవుంది. యీఆళయ

రంగమండపం మేలుకట్టు పైన రామాయణమంతా శ్రీపల్లె శ్రీనివాసనాయరు ద్వారా (శాలి శ|| 1741 కి సరియగు నందననామ సం|| వైశాఖ బ|| పంచమీలు శుక్రవారంనాటికి) చిత్రీకరించబడినట్లు తెలుస్తూవుంది.

12 వ|| శతాబ్దార్ధభాగం – వత్సరాజు లేక ఉదయన (శతానీకుని పుత్రుడు) ప్రయాగవద్ద కోశాంబీ యితని రాజధాని. వాసవదత్త యితని పట్టపురాణి. ఉదయనుడు వత్సరాజు రెండు పేర్లతోనూ యితను ప్రసిద్ధి చెందాడు.

12 వ|| శతాబ్దార్ధభాగం ఉదయనాచార్యుడు. యితను మిధిలానగరంలో జన్మించాడు. బౌద్ధులను నాశనంచేసేందుకుగాను శ్రీమన్నారాయణుడే. ఉదయనాచార్యుని రూపంలో జన్మించాడని ప్రతీతివుంది. ||కుసుమాంజలి|| అను ద్న్యన (తత్వశాస్త్ర) గ్రంథం యితను రచించినదే యింకా అనేక యితర గ్రంధాలకు టీకా వ్రాశాడు. 'లీలావతి' అను ప్రఖ్యాత కవయిత్రి యితని పుత్రికగా చెప్పబడుతూవుంది.

12 వ|| శ|| ప్రథమభాగం ధోయీ ప్రసిద్ధ సంస్కృత కవి 'పవనదూత' అను సంస్కృత కావ్యాన్ని రచించాడు. యిది కాళిదాసమేఘదూతకు సమానంగా వుంటుంది. జయదేవుని సమకాలికుడు.

12 వ|| శ|| గంగరాయదేవ మహారాజు. యితను బొమ్మలాట నాయకుడైన ||కృష్ణప్పకు|| ఉప్పుకుంటపల్లె దానంచేసినట్లు శాసనం ద్వారా తెలుస్తూవుంది.

12 వ|| శ|| భీమనకవి. యితని స్వగ్రామం తెలంగాణాలోని రేచన కవిజనాశ్రయము అను ఛందోగ్రంధాన్నికూడా రచించాడు.

12 శ|| గోకర్ణుడు తెలంగాణా నివాసి. ||గోకర్ణచ్ఛందము|| అను ఛందోగ్రంధం రచించాడు.

12 వ|| శ|| అథర్వణాచార్యులు వేగిదేశస్థుడు. యితను ||వికృతీవివేకము||, ||అథర్వణఛంధము|| అను వ్యాకరణగ్రంథాలు రచించాడు.

12 వ|| శ|| ప్రకాశాత్ముడు పద్మపాదుని ||పంచపాదిక|| కు బంచపాదికా వివరణమను వ్యాఖ్యాగ్రంధం రచించాడు.

12 వ॥ శ॥ గంగాదాసు సంస్కృత కవి. ఛందోమంజరి అను శాస్త్రాన్ని రచించాడు. (గోపాలదాసు వైద్య పుత్రుడు తల్లి సంతోష) ఛందోమంజరీకాక కృష్ణశతకము, సూర్యశతకం వగైరాలనుకూడా రచించాడు. కానీ యితని కాలంనిర్ధారణగా చెప్పటం కష్టం.

1200 ప్రాంతం వరకు నలందవిశ్వా విద్యాళయం ఖ్యాతితగ్గలేదు. నలందాపోషణ భారాన్నివహించే మగధ సామ్రాజ్యం యింతకుమునుపే అంతరించిపోయినా 1197 లో భౌద్ధారామాలు నాశనంచేసేంతవరకు నలందా కార్యక్రమం సాగుతూనేవచ్చింది. 9 వ॥ శ॥ లో నలంద, జావా, సుమత్ర, నేపాళ్, బర్మాలకుమధ్య విరివిగా రాకపోకలుకల్గి ఎక్కువ సంబంధాలు వుండినాయి

1200 ప్రాంతంలో అరబ్బు పండితుడు పంపోర్డీక్ అబూఅబ్దుల్లా భారతదేశంలో సంచారంచేసి కొన్నివిశేషాలను తన పుస్తకంలో వ్రాసుకొన్నాడు.

1202 లో భక్తియారు (ఖల్జీ) అనుయాయులు నాలందాపైదాడిచేసి అక్కడి పవిత్ర ॥తార॥ దేవీ విగ్రహాన్నిముక్కలు చేసినేశారు. యీ తారా విగ్రహం అనేక మహాత్ములు కల్గి వుండినట్లు ప్రజలు భావిస్తూ ఆదరించారు.

1205 నుంచీ 1525 వరకు పఠాన్ వంశస్థుల పరిపాలనకొనసాగింది.

1208 లో (శా॥ శ॥ 1130) పిల్లలమర్రి బేతిరెడ్డి భార్య ఎరకసానమ్మ అనునామె పిల్లిలమర్రిలో తనపేరట ఎరకసానమ్మ అను దేవతను ప్రతిష్ఠించి విరివిగా భూములను ఆ దేవతకు దానంచేస్తూ ఒకశిలాశాసనం వేయించింది.

1212–13 కాకతీయ గణపతిదేవుడు. తూర్పుదేశంపై దండెత్తి కృష్ణా, గోదావరి, గుంటూరు జిల్లాలను స్వాధీనంచేసుకొన్నాడు. యితని కూతురే రుద్రమదేవి. యీమెను నిడదవోలునుపాలిస్తున్న వేంగీచాళుక్య వంశస్థుడైన వీరభద్రరాజుకిచ్చి వివాహంచేశాడు. రెండవకుమార్తె అయిన గణపాంబను ధరణికోటరాజయిన బేతరాజుకుయిచ్చి వివాహం చేశాడు. తెనాలి, రేపల్లె తాలూకాలు (కమ్మనాడు) ను పాలిస్తున్న జాయపసేనాని

చెల్లెండ్రను యిద్దరినీ గణపతిదేవుడు వివాహంచేసుకొని జాయపసేనానిని కూడా ఓరుగల్లుకుతీసుకెల్లాడు. యితనే నెల్లూరు ప్రాంతాన్ని జయించి పూర్వపాలకుడైన మనుమసిద్ధికే తిరిగీయిచ్చివేశాడు. రాయలసీమ ప్రాంతం పై గంగయసాహిణీ అను సామంతపాలకునికి అధికారం యిచ్చి వేశాడు. శాతవాహనరాజుల తర్వాత యావదాంధ్రదేశాన్ని పరిపాలించినవాడు. గణపతిదేవుడొక్కడేనని చెప్పవచ్చు. నెల్లూరుజన్మస్థలమైన తిక్కన సోమయాజి యీ గణపతిదేవుని ఆస్థానంలోనే మహాభారత రచనను తరిపూర్తి చేశాడని చెప్పబడుతూవుంది.

1214 చెంగిజ్ ఖాన్ పైదసుపురం పట్టుకొనుట

1220 ప్రాంతం పాల్కురికి సోమనాథుడు. యితను రచించిన ||పండితారాధ్యచరిత్ర|| నాటి సంస్కృతీ సభ్యతలను తెలియజేయుటంలో ప్రథమస్థానమాక్రమిస్తుంది.

1222 లో చెంఘిజ్ ఖాన్ ఆఫ్ఘనిస్థాన్‌పై దండియాత్రచేశాడు. అక్కడి బామియన్ సమీపంలోని కొండలలో నూటాపదమూడు అడుగుల నిడివిగల బౌద్ధవిగ్రహానికి కప్పబడిన బంగారు కవచము. కిరీటాభరణాదుల నంతా కొల్లగొట్టుకపోయాడు. 1227 లో యితను మరణించాడు.

1230 లో బలబన్ యితనిదియిలబర్గ జాతి. తుర్క్ దేశస్థుడు. యితనిని మంగోలులు బందీగా బగదాద్ తెచ్చి ఖ్వాజాజలాలుద్దీన్‌కు బానిసగా అమ్మివేశారు. జమాలుద్దీన్ యితనిని ఢిల్లీకితెచ్చి యిల్తుతమిశ్‌కు అమ్మివేశాడు. బలబన్ తనప్రతిభా విశేషాలవల్ల యిల్తుతమిశ్‌కు ప్రియమిత్రుడుగా తయారయి దాసులసమితిలో సభ్యుడుగాచేయబడ్డాడు. మంత్రి పదవినికూడా సంపాదించాడు. 1246 లో బలబన్ విజయాలకు ముగ్ధుడై సుల్తాన్ తన పుత్రికనిచ్చి వివాహం చేశాడు. కానీ ఒకతూరిమంత్రిపదవి నుంచి పదవీచ్యుతుడై తిరిగీ మంత్రిపదవిని సంపాదించాడు. 1266 లో నాసిరుద్దీన్ మరణించగా బలబన్ సుల్తానైపోయాడు. 1266 నుంచీ 1286 వరకు యితని పరిపాలన సాగింది. 1285 లో మంగోలులు పంజాబుపైదాడి చేశారు. యీ యుద్ధంలో బలబన్ పుత్రుడు మహమూద్ చనిపోయాడు. పుత్రశోకంతో కృషించి బలబన్ 1286 లో చనిపోయాడు.

1230 లో తిక్కన సోమయాజి జననకాలమని చెప్పబడుతూవుంది.

1235 రుచిదత్తుడు 'మకరంద' అను గ్రంథాన్ని వ్రాసినవాడు.

1243 త్రిభువనపాలుడు గుజరాతు చాళుక్యులలో ఆఖరువాడైన త్రిభువనపాలుడు. సమర్థవంతుడు కాని కారణంగా చాళుక్యశాఖలోని బఘేలు తెగ అవసరాన్ని పురస్కరించుకొని అధికారాన్ని చేజిక్కించుకొన్నది అప్పటినుంచీ ఢిల్లీ (యింద్రప్రస్థపురం) ముస్లింలపాలన క్రింద 613 ఏండ్లు మొత్తం 45 మంది రాజుల పరిపాలనకొనసాగింది.

1245 లో మంగూఖాన్ సింధుప్రాంతంపై ఆక్రమణ చేశాడు యీ దాడిని బలబన్ ఎదుర్కొని ఓడించివేశాడు.

1246 లో కాకతీయ గణపతిదేవుడు తెలుగు చోళులపైన దాడిచేసి నెల్లూరు, కడపజిల్లాలను స్వాధీనంచేసుకున్నాడు.

1250 అధర్వణుడు. యితను మహాభారతంలోని మూడు పర్వాలను తెలుగులో రచించాడు కానీ అదికానరావటంలేదు. జైనకవి.

1250 దాదాపు జినదత్తుడు వివేకవిలాసం, రచించినవాడు.

1250 నుంచీ 1300 వరకు పాల్కురికి సోమనాధుని కాలం.

1252 తిక్కభూపతి కాలం. యితను రాజేంద్రచోళుని కాంచీపురం సింహాసనంపై అధిష్ఠింపచేసి చోళస్థాపనాచార్య అన్న బిరుదును వహించాడు. యితని కుమారుడే మనుమసిద్ధి.

1260 ప్రాంతంలో కాకతీయ గణపతిదేవుని ఆస్థానంలో తిక్కన మహాభారతకావ్యాన్ని సంపూర్తిచేశాడు.

1262 రుద్రమదేవి (కాకతీయ) జననమని కొందరు కాదు పరిపాలనారంభకాలమని కొందరు 1262 నుంచి 1296 వరకు యీమె రాజ్యాన్ని పరిపాలించింది. అసమాన ధైర్యసాహసాలతోనూ అతినైపుణ్య యుద్ధతంత్ర వ్యూహాలతోనూ అలరారిన యీమె భారతదేశచరిత్రలోనే ప్రత్యేకస్థానాన్ని సంపాదించింది. గోన గన్నారెడ్డి వెలమ ప్రసాదిత్యా నాయకుడు. రుద్రమనాయకుడు. కాయస్థులైన జన్నగదేవుడు. త్రిపురాంతకుడు. బ్రాహ్మణులైన బెండపూడి అన్నయ వగైరా సేనానులు యీమెకు బాసటగా

నిల్చి పూర్తి సహాయాన్నిచ్చారు. స్త్రీ పరిపాలన అంటే గిట్టని సామంతుల ఆటలు కట్టించటంలోనూ ఆగర్భశత్రువులైన దేవగిరి యాదవులను జయించటంలోనూ యీమె కనబరచిన ప్రతిభ శ్లాఘనీయమైనది.

1275 పద్మిని రాణాభీమసింహుని మొదటిభార్య. 1275లో లక్ష్మణసింహుడు మేవాడసింహాసనం అధిష్ఠించినప్పటికి పిన్నవయస్కుడైన కారణంగా పినతండ్రి అయిన భీమసింహుడు మేవాడు రాజ్య వ్యవహారాలను చూస్తూ వుంటాడు. పద్మిని రూపసౌందర్య ఖ్యాతినివిని ఢిల్లీ పాదుషా అయిన అల్లావుద్దీన్ ఖిల్జీ మోసంచేసి భీమసింహుని ఖైదుచేస్తాడు. పద్మినీ యీ ఆపదలో అతిసాహసమైన యెత్తుగడనవలంబించి అలావుద్దీన్ వెంట సైన్యాలు లేకుండాచేసి రాజపుత్రవీరులకు మంచిసదవకాశాన్ని కల్గిస్తుంది కానీ ఆఖరుకు భీమసింహుడు చిత్తోరుకోటలో ప్రవేసించిన తర్వాత అలావుద్దీన్ తిరిగీ చిత్తోరుకోటను ముట్టడిస్తాడు. భీమసింహుడు వీరోచితంగా పోరాడిమరణిస్తాడు. పద్మినీ వగైరా రాజపుత్రస్త్రీలు అగ్నిప్రవేశంచేయగా ఆఖరుకు అలావుద్దీన్ ఖిల్జీకి పద్మినీ చితాభస్మంమాత్రం లభ్యమయింది.

1180 వంగదేశస్థుడైన విశ్వేశ్వర శంభుడనే వేదపండితుడు దక్షిణాపథానికివచ్చి చోళ కాకతీయ రాజుల ఆస్థానాలలో రాజపురోహితుడుగా పనిచేశాడు. యితనికి రుద్రమదేవి కృష్ణాతీరంలోని వెలగపూడి అనుగ్రాహమందు ఒకమఠము, సత్రముకట్టించి దానంచేసింది. విశ్వేశ్వరుడు అక్కడ ఒకదేవాళయాన్ని కళాశాలను అనాధశరణాళయాన్ని స్థాపించి ఆగ్రామాన్ని వేదపండితులకు నిళయంగా వుండునటులచేశాడు. యితని కుమారుడు శాంతశంభుడుకూడా తండ్రిమార్గాన్నే అనుకరించాడు.

1280 కి సరియగు విలంబి సం|| శ్రావణ శుద్ధ 8 లు మంగళవారం నాడు అనపోతారెడ్డి మోటుపల్లిశాసనం వ్రాయించాడు.

1280–1350 మధ్య కాలంలో ఎఱ్ఱాప్రగడ జీవించాడని చెప్పబడుతూవుంది.

1290 కాకతీయరాజగు అంబదేవుడు. యితను రేనాడును పరిపాలించాడు. రేనాడు నాటికి 7000 పల్లెలుగలదై ఆంధ్రచోళరాజులవశములో నుండేడిది రేనాటిరెడ్డి రాజులకందరికీ పులిపతాకాలు వుండేడివి. యీ ప్రాంతంలో నరహత్యలు మిక్కుటముగానుండేడివి.

1290 నుంచీ 1326 వరకు రెండవ ప్రతాపరుద్రుని పరిపాలనా కాలం. 1303 లో దక్షిణ ప్రాంతాన్నికూడా స్వాధీనం చేసుకొనేందుకు అలావుద్దీన్ సేనాని మాలిక్ కాఫర్ ద్వారా దండయాత్ర జరిగింది. యీ సందర్భంలో ప్రతాపరుద్రుడు దీర్ఘకాలంగా ముస్లింలతోపోరాడి ఆఖరుకు మహమ్మదీయులకు ధనమిచ్చి సంధిచేసుకున్నాడు. తిరిగీ 1322 లో అల్లావుద్దీన్ సైన్యాలు దాడిచేశాయి. ప్రతాపరుద్రుడు ఖైదీచేయబడి ఢిల్లీకి తీసుకెలుతూండగా త్రోవలో గోదావరీనదిలోపడి ప్రతాపరుద్రుడు ఆత్మహత్య చేసుకొన్నాడని చెప్పబడుతూవుంది.

1290 లో మార్కోపోలో ఆంధ్రదేశ పర్యటనం.

1290 మలిక్ కాఫీర్ యితను మొదట అస్పృశ్యుడైన హిందువు తర్వాత ముసల్మానై మహాసేనానిగా తయారయాగు. 1293 లో యితను ఓరుగంటిపై దాడిచెయుటకు నియోగింపబడ్డాడు. యితను హిందువులను ప్రత్యేకంగా హింసలపాలుచేస్తూ వేలకొద్దీ నిరపరాధులను సంహరిస్తూ హిందూమతంపైనున్న తన అక్కసును ప్రజలను బాధించటం ద్వారా తీర్చుకున్నాడు.

1296 కర్ణ బఘేలు (చాళుక్య) శాసకులలో ఆఖరివాడు. అల్లావుద్దీన్ సేనలు ఉలుగుఖాన్ నసరత్ ఖాన్ల నాయకత్వాన అన్హిలవాడను స్వాధీనంచేసుకొని గుజరాతును ఆక్రమించగా కర్ణ భార్య కమలాదేవి బందీగా పట్టుబడింది. కర్ణ కూతురైన దేవలదేవితో దేవగిరి రామచంద్రుని వద్ద శరణార్థిగా చేరాడు తిరిగీ అలావుద్దీన్ సేనాని మలిక్ కాఫుర్ దేవగిరి సైన్యాలను ఓడించి దేవలదేవిని ఢిల్లీపంపించాడు. 1306 లో దేవలదేవిని ఖిరిఖ్రాన్ కిచ్చి వివాహంచేశారు.

1296–1323 కృష్ణమాచార్యుడు. యితను రెండవ ప్రతాపరుద్రుని సమకాలీనుడు. ఓరుగల్లు ప్రాంతంలో వైష్ణవసంకీర్తనలు పాడుతూ వైష్ణవ భక్తి ప్రచారాన్నిచేస్తూ సంచరించేవాడు.

13 వ॥ శ॥ కవిభల్లటుడు. యితను ॥కవిభల్లటశతక॥ అను వ్యాకరణగ్రంథాన్ని రచించాడు.

13 వ॥శ॥ లీలాశుకుడు. యితను శ్రీ కృష్ణకర్ణామృతమను గ్రంథాన్ని రచించాడు. రాగయుక్తమైనభక్తి ఛందస్సులతోకూడుకున్న శ్లోకాలు.

యీ గంగ్రం అంతేకాకుండా యీ గ్రంథం శృంగార-భక్తిమయం యిందులోని రాసలీలలు చాలామందికి ప్రియమైనవికూడా.

13 వ॥ శ॥ కేతనకవి నెల్లూరునివాసి ॥ఆంధ్రభాషాభూషణం॥ అను వ్యాకరణ గ్రంథాన్ని రచించాడు.

13 వ॥ శ॥ కేశవమిశ్రుడు ॥తర్క-భాష॥ గ్రంథరచయిత.

13 వ॥ శ॥ జయదేవుడు ॥ఆలోక॥ మను పేరుతో ॥తత్వచింతామణికి॥ వ్యాఖ్యవ్రాసినాడు.

1300 ప్రాంతం పార్థసారథి మిశ్రుడు న్యాయరత్నాకరమను శ్లోకవార్తిక భాష్యమును, స్వతంత్ర మీమాంసాగ్రంధమగు ॥శాస్త్రదీపికను॥ రచించాడు.

13 వ॥ శ॥ అమలానందుడు ॥భామతికి॥ భాష్యరూపంలో ॥కల్పతరువు॥ అను గ్రంథాన్ని రచించాడు.

13 వ॥ వ॥ వేదాంతదేశికుడు. యితను రామానుజుని అనుయాయులలో నగ్రగణ్యుడు. వేంకటనాధుడు అనికూడా యితనిని పిలుస్తారు. యితను వడగలి శాఖా స్థాపకుడు. కాంచీపురమున జన్మించి శ్రీ రంగంలో యితని జీవితం గడిచింది,

13 వ॥ శ॥ మేకందరుడు. 'శివజ్ఞానబోధము' అను శైవసిద్ధాంత ప్రమాణ గ్రంథాన్ని రచించాడు.

1300 మంచన కేయూరబాహు చరిత్ర వ్రాసినవాడు.

13 వ॥ శ॥ సోమనాధుడు. పండితారాధ్య చరిత్ర రచించాడు.

13 వ॥ శ॥ జాయపసేనాని యితను ॥నృత్తరత్నావళి॥ అను గ్రంధం రచించాడు. యిందులో తెలుగుదేశనాట్య విశేషాలను గురించి వివరించటం జరిగింది.

1320 కులోత్తుంగచోళుని అనంతరం చోళశాసకులు క్రమంగా నిర్బలులవుతూవచ్చారు. ఆఖరుకు 1320 లో అలావుద్దీన్ ఖిల్జిసేనాని మలిక్ కాఫీర్ దాడిచేసి చోళరాజ్యాన్ని జయించటమే గాక చోళశాశనాన్ని కూడా అంతంచేసి చోళరాజ్యాన్ని అలావుద్దిన్ రాజ్యంలోకలిపేశాడు.

1322–23 మధ్య ముద్రించబడిన గియాసుద్దీన్ తుగ్లక్ నాణేలు యీ మధ్యనే పశ్చిమగోదావరిలోని ఏలూరివద్ద దొరికినవి.

1323 లో కాకతీయ సామ్రాజ్యం అంతరించిందనే చెప్పవచ్చు. ఢిల్లి పాదుషా అయిన గియాసుద్దిన్‌తుగ్లక్ సైన్యాలు తెలంగాణా ప్రాంతాన్నంతా స్వాధీనంచేసుకొని నెల్లూరుమీదుగా మధుర వరకు గియాసుద్దిన్ కొడుకు ఉల్లూఖాను దండయాత్రచేసి మధురలో మొట్టమొదటసారిగా ఒక నవాబును స్థాపించాడు.

1323–30 జోర్డానస్ అను పాశ్చాత్యుడు తెలుగుదేశములో పర్యటించి తెలుగుదేశపు నాటి విశేషాలనుగురించి వ్రాశాడు.

1324 నుండి యించుమించు 1434 వరకు రెడ్డిరాజులు అద్దంకి కొండవీడు, రాజమహేంద్రవరం కందకూరు ప్రాంతాలలో రాజ్యపాలనము చేశారు.

1324 నుండి 1330 వరకు యీ ఆరేండ్లుగా ముస్లింలు తెనుగుదేశంలోని ప్రజలపై జరిపిన క్రూరకార్యములు అమానుషమైనవి. యింతలో ప్రోలయనాయకుడు కాపయనాయకుడు ముస్లింలను తెనుగు దేశంనుండి పూర్తిగా తొలగించివేశారు.

1324 ప్రప్రథమంగా రాజమహేంద్రవరంలోని ఒక హిందూదేవాలయాన్ని మసీదుగా మార్చివేయటం జరిగింది.

1324 లో ప్రోలయ, వేమారెడ్డి గుంటూరుజిల్లా అద్దంకిలోస్వతంత్ర ప్రభుత్వాన్నిస్థాపించాడు. గుంటూరు, నెల్లూరుజిల్లాలను జయించి పడమట శ్రీశైలం వరకు తన రాజ్యాన్ని విస్తరింపజేశాడు. యితని హయాములో 74 కోటలను కట్టించాడు. యితని కుమారుడు అనపోతారెడ్డి యితను తన రాజధానిని అద్దంకినుండి గుంటూరుజిల్లా నర్సారావుపేట తాలూకాలోని కొండవీటికి మార్చాడు. అప్పటినుండి రెడ్డిరాజులకంతా కొండవీడే కేంద్రంగావుండేంది. వీరి పరిపాలన 1424 వరకు కొనసాగింది.

1325–26 ముసునూరి ప్రోలయనాయకుని నాయకత్వాన (ముసునూరు కృష్ణాజిల్లా నూజవీడు తాలూకాలో వుంది.) పిఠాపురానికి చెందిన కొప్పుల ప్రోలయనాయకుడు అద్దంకి ప్రోలయ వేమారెడ్డి తెలంగాణాలోని

రాజుగూడ పరిపాలకుడైన రేచర్ల సింగమ నాయకుడు వగైరాలంతా కలిసి మహమ్మదీయుల పాలననుండి కోస్తాజిల్లాలను విముక్తిచేశాడు. వీరు 1325 లో భద్రాచలంవద్దనున్న రేకపల్లిలో తిరుగుబాటు ప్రారంభించారు. యిదే సంవత్సరంలో ఢిల్లీలో గియాసుద్దీన్‌తుగ్లక్ చనిపోయాడు.

1325-26 కొండవీడులో రెడ్డిరాజ్యస్థాపనజరిగిందని కొందరిఅంచనా

1326 నుంచి 51 మహమ్మద్ బిన్‌తుగ్లక్ కాలం. యితను అరబ్ యాత్రికుడైన ఇబిన్‌బటూటాను చైనా చక్రవర్తివద్ద తన రాయబారిగా వుంచాడు.

1330 సర్వజ్ఞ సింగమభూపాలుడు. యితను అన్నపోతనరెడ్డికొడుకు యితనికి "ఏకశిలానగర సమీపశాత్రవ రాజన్యగహనదహన" అనుబిరుదు కూడావుంది. బమ్మెరపోతన శ్రీనాథుడు యితని సమకాలికులు.

1333 మాధవ విద్యాగణ్యాస్వామి. వీరు తుంగభద్రానది తీరంలోని పంపానగరంలో జన్మించాడు. తండ్రి మాయణుడు. తల్లి శ్రీమతి యితను విజయనగర సామ్రాజ్య స్థాపనాసందర్భంలో ప్రముఖపాత్ర వహించాడు. విజయనగర సామ్రాట్టయిన బుక్కరాయలకు కులగురువుగానూ, మంత్రిగానూ కూడా చెలామణీఅయాడు. యితను భాగతీతీర్థవద్ద సన్యాసం గ్రహించి, 1333 లో శృంగేరీమఠానికి అధ్యక్షుడుగా చేయబడ్డాడు. యితను రాజకీయ సన్యాసరంగాలలోనేకాక సాహిత్యరంగంలో కూడా తక్కువవాడేమీకాదు పరాశరసంహితకు యితను వ్రాసిన భాష్యంలో యితని పరిచయంచేసుకున్నాడు వివరణ ప్రమేయసంగ్రహానికి (ప్రకాశాత్మనిది) వివరణ ||జీవన్ముక్తి వివేకం|| అను గ్రంథాన్ని రచించాడు. బహుముఖప్రజ్ఞానిధి విజయనగర సామ్రాజ్యానికీ తెలుగుదేశానికీ నాడు మాధవ విద్యారణ్యులు చేసినసేవ అమోఘమైనది.

1336 ప్రాంతంలో హరిహరరాయలు ప్రభుత్వానికి పన్నుచెల్లించేవారు. రూ. 1-0-0 1కి 34 శేర్లు ధాన్యమాయిచ్చునట్లు నిర్ణయంచేశాడు.

1336 నుంచీ 1367 వరకు కాపయనాయకుడు మహమ్మదీయుల ఓడించి ఓరుగల్లును ఆక్రమించుకొని ||ఆంధ్రదేశాధీశ|| అను బిరుదును సంపాదించాడు. మహమ్మదీయ రాజప్రతినిధిఅయిన మాలిక్‌మక్బూల్‌ను

తరిమి వేసి కాకతీయరాజ్యానికి తిరిగి ప్రాణప్రతిష్ట చేశాడు. అంతేకాకుండా విజయనగర ప్రభువైన హరిహరరాయలను హోయసల రాజైన బల్లాలుని కూడగట్టుకొని మహమ్మదీయులను కర్నాటకాంధ్ర ద్రావిడదేశాల నుండి కూడా తరిమి వేశాడు. యిది దాదాపు 1334 లో జరిగింది. ఢిల్లీసుల్తానులకు వ్యతిరేకంగా ఉత్పన్నమయిన బహమనీ సుల్తానులకు యితను అశ్వికదళాన్ని పంపి సహాయం చేశాడు. (యితని పుత్రుడు వినాయకదేవుడు.) యితని పరిపాలన దాదాపు 30 సం॥రాలు కొనసాగింది.

1336 నుంచీ 1480 వరకు విజయనగర సామ్రాజ్యకాలంలో ప్రథమ దశ అని చెప్పవచ్చు. యీ దశలో కన్నడ తమిళ ప్రాంతాలను రాయల సీమను ఆక్రమించుకొనటం జరిగింది.

1336 లో హరిహరరాయలు అనునతనిద్వారా విజయనగర సామ్రాజ్యం స్థాపించబడింది. యితనిరాజ్యం మైసూరు కర్ణాటక ప్రాంతాలకు విస్తరించియుండెడిది. (మైసూరునే హొయిసలరాజ్యం అని పిలిచేవారు) మైసూరును పాలిస్తున్న నాల్గవ బల్లాలరాజును హరిహరరాయలు ఓడించాడు.

1336 గంగాధరుడు సంస్కృత మహాకవి. గోవిందపురి శిలాశాసనంలో యితని గురించిన ప్రస్తావనవుంది యితని తండ్రి మనోరథుడు. తాత చక్రపాణి. ముత్తాత దామోదరుడు. దశరథుడు, మహారథుడు, పురుషోత్తముడు యితని సోదరులు. బిల్హణుని సమకాలీనుడైన గంగాధరుడు యితనో లేక మరొకరో సరిగా తెలియరావటంలేదు.

1337 లో ఓరుగల్లునుండి మహమ్మదీయులను పూర్తిగా తరిమి వేసిన అనంతరం వంద ఏండ్లవరకు తెలంగాణా ప్రాంతాన్ని రాచకొండ పద్మవెలమనాయకులు కోస్తా ప్రాంతాన్ని రెడ్డిరాజులు రాయలసీమను విజయనగర రాజులు పరిపాలించారు.

1340–66 అనవేమారెడ్డి రాజ్యపాలనాకాలం.

1340 ప్రోలయనాయకుని మరణం. యితని పరిపాలన పదిహేను సం॥రాలు జరిగింది.

1340 నుండి 1370 వరకు ముమ్మడి నాయకుడను రెడ్డిరాజు కోరుకొండలో రాజ్యముచేశాడు. యితని కాలంలో శ్రీరంగంనుండీ పరాశర భట్టను వైష్ణవబ్రాహ్మణుడువచ్చి ముమ్మడినాయకుని తన శిష్యునిగాచేసుకొని గోదావరి మండలమంతా వైష్ణవమతతత్వాన్ని వ్యాపింపజేశాడు.

1340 నాటికి భారతదేశపు ప్రముఖ భాగమంతా ముస్లింలపాలన క్రిందికివచ్చిందని చెప్పవచ్చు.

1343 హరిహరరాయల మరణం. యితని అనంతరం (విజయనగర రాజ్యానికి) బుక్కరాయలు రాజ్యానికివచ్చాడు.

1347 లో గుల్బర్గాను పాలిస్తున్న హసన్‌గంగూ ఢిల్లీ సుల్తాన్‌ను ధిక్కరించి బహమనీ రాజ్యాన్ని స్థాపించాడు. యీ ప్రయత్నంలో హసన్‌గంగూకు మునునూరి కాపయనాయకుడు సహాయాన్నందించాడు.

1347 ఆఖరులో హసన్‌గంగూ (బహమనీసుల్తాన్) ఓరుగల్లుపై దాడిచేసి కాపయనాయకుని ఓడించి తిరిగీసంధిచేసుకున్నాడు.

1350–80 సాయణాచార్యుడు. యితను మాధవ విద్యారణ్యుల సోదరుడు. మాధవునితోపాటు సాయణుడు కూడా విజయనగర సామ్రాజ్యానికి సేవచేసినవాడే. బుక్కరాయలకు రాజగురువుగా వుండినాడు. యితను ప్రసిద్ధవేదభాష్యకారుడు. తత్వశాస్త్రవేత్త కూడా అయివున్నాడు.

1350 లోనూ 56 లోనూ బహమనీసుల్తాన్ అయిన హసన్‌గంగూ ఓరుగల్లుపై దాడులుచేశాడు. ఒంటరిగాడైన కాపయనాయకుడు మహమ్మదీయులతో రాజీచేసుకోనాల్సివచ్చింది.

1350 నుంచి 77 వరకు హరిహరరాయల తమ్ముడైనబుక్కరాయల పరిపాలనా కాలం. యితని కాలంలో మధురరాజ్యంకూడా విజయనగర సామ్రాజ్యంలో కలిసిపోయింది. యీ విజయాన్ని సాధించినవాడు బుక్కరాయల కుమారుడు కుమారకంపనుడు. యీ మధురపై దండయాత్ర దాదాపు 20 సం॥రాలు జరిగినట్లు చెప్పబడుతూవుంది.

1350 ప్రాంతంలో మహారాష్ట్రదేశంలో వరుసగా 12 ఏండ్లుక్షామం రాగా అక్కడి ప్రజలు తెలుగు కన్నడ తమిళ దేశాలకు వలసలు వెళ్లారు.

1357 లో అల్లావుద్దీన్ హసన్ గంగూ (బహమనీ సుల్తాన్) ధరణి కోటవద్ద కాటయ వేమారెడ్డితో ఓడించబడి పరాజితుడై పారిపోయాడు.

1360 ప్రాంతంలో తెలంగాణా ప్రాంతం రాచకొండ వెలమవారి పరిపాలనక్రిందకువచ్చింది. వీరి పరిపాలన దాదాపు వంద సంవత్సరాలు సాగింది.

1361 లో కాపయనాయకుడు బుక్కరాయలు కలిసి బహమనీ రాజుల నుంచీ, కౌలాస్ దుర్గాన్ని స్వాధీనంచేసుకొనేందుకు విఫలప్రయత్నం చేశారు.

1362 లో మహమ్మద్ షా కాపయనాయకుని కుమారుడైన వినాయక దేవుని నగరమైన వేలంపుట్టపై దాడిచేసి వినాయకదేవుని ఓడించటమే గాక చిత్రవధ చేశాడు.

1363 లో కాపయనాయకుడు, బుక్కరాయలు కలిసి (బహమనీ సుల్తానులకు వ్యతిరేకంగా) ఢిల్లీ సుల్తానువద్దకు రాయబారమంపారు. కానీ రాయబారం ఫలించలేదు.

1367 లో వరంగల్ జిల్లాలోని భీమవరంవద్ద కాపయనాయకునికీ సింగమనాయకునికీ (రేచర్ల) యుద్ధంజరిగింది. యీ యుద్ధంలో కాపయ నాయకుడు మరణించాడు. దీనితో ఓరుగల్లులోని ఆఖరు ఆంధ్ర రాజ్యం అంతరించింది. మహమ్మదీయులకు వ్యతిరేకంగా ఏర్పడిన ఐక్యకూటమికి ప్రోలయనాయకుని తర్వాత (తమ్ముడు) కాపయనాయకుడే నాయకత్వం వహించాడు కానీ కొలదికాలంలోనే ఐక్యకూటమిలో అంతకలహాలుచెల రేగినవి.

1367 తర్వాత వినాయకదేవునికాలం. (యితను కాపయనాయకుని కొడుకు) సాహసవంతుడైన పాలకుడితను. తనతండ్రి అల్లావుద్దీన్ బహమన్ షాకుయిచ్చిన కౌలాస్ దుర్గాన్ని తిరిగీ స్వాధీనంచేసుకొనేందుకువెళ్లి ఓడిపోయి ఓరుగల్లుకు పారిపోయివచ్చాడు. యితనిని పుల్లంపేటవద్ద మహమద్ షా కుట్ర ద్వారా చంపించాడని చెప్పబడుతూవుంది.

1371 లో కంపరాయలు (బుక్కరాయలకొడుకు) మధురనుండి తురకలనోడించి వెళ్లగొట్టాడు. యీతనిభార్య గంగాదేవి, వీర కంపరాయ

చరిత్ర లేక మధురా విజయం అను సంస్కృతకావ్యాన్ని రచించింది. యీ కావ్యంద్వారా నాటితురకల అమానుషపరిపాలనా పద్ధతులను తెలుసుకొన వచ్చు.

1376 నుంచీ 1700 వరకు ఉత్తరదేశంలోని సాహిత్యరంగంలో (హిందీలో) భక్తి సాహిత్యకాలంగా చెప్పబడుతూవుంది.

1377 క్రీ శైలమందు మల్లిఖార్జునస్వామి దేవాళయంలోని నందిమం డపమునకు సమీపమున వీరశిరోమండపం అన్న వేమునిచే యీ కాలమందు నిర్మించబడింది.

1380 నుంచీ 1680 వరకు (దాదాపు) ఆంధ్ర సాహిత్యరంగంలో ప్రబంధయుగం అని చెప్పవచ్చు.

1385–1475 మధ్యకాలంలో శ్రీనాధమహాకవి జీవించాడు. యితను కొండవీడు రాజమహేంద్రవరము రెడ్డిరాజుల ఆస్థానపండితుడు. కాశీ ఖండం, భీమఖండం నైషధం హరవిలాసం వగైరా శృంగారచనలు వ్రాశా డు. యితను రెడ్డిరాజులవద్దనేకాక విజయనగర రాజులవద్దకూడా కనకాభి షేకాలుపొందిన మహాపండితుడు. కానీ యితని అంత్యకాలం చాలాజుగు ప్సాకరంగా గడచింది.

1385 దినకరుడు సంస్కృతపండితుడు. కాళిదాసు రఘువంశానికి టీకా వ్రాశాడు. యితను బౌద్ధమతావళింబి అని కొందరివాదన యితని పూర్తి పేరు దినకరమిశ్ర.

1386–1402 కుమారగిరిరెడ్డి కాలం. యితను వసంతరాజీయమను నాట్య శాస్త్రాన్ని కూడా రచించాడు.

1397 తైమూరు భారత దేశంపై దాడిచేయుట యితని దాడిలో వెనుకప్రదేశంలో మృతకళేబరాలు దగ్ధంగావింపబడి మండుతున్నగ్రామాలు పట్టణాలు తప్ప మరేమీమిగులలేదు. యితను ఢిల్లీపట్టణంచేరుకుని ఒకలక్ష మంది ఖైదీలను చంపేందుకు అనుజ్ఞయిచ్చాడు ఎందుకంటే వీరిని అదుపులో వుంచేందుకు గొప్పసైన్యం అవశ్యకమౌతుంది. కాబట్టి ఢిల్లీ పట్టణాన్ని జయించాక యితను తన సైన్యానికి అయిదురోజులు చుట్టుపట్లప్రాంతాలను దోపిల్లుచేసుకునేందుకు ఉత్తర్వుయిచ్చాడు.

1397 నుంచీ 1422 వరకు బహమనీసుల్తాన్ అయిన ఫిరోజ్ షా విజయనగరంమీద నిరంతరం దాడులు చేస్తూనేవుండినాడు.

14–15 శతాబ్దాల వాడు శ్రీధరుడు శ్రీధరచ్ఛందము అను ఛందో గ్రంధాన్ని రచించాడు.

1400 శివాదిత్యుడు వైశేషికసూత్రాలకు 'సప్తపదార్థి' అను గ్రంధాన్ని రచించాడు.

14 వ॥ శ॥ దాదాపు ఓబయమంత్రి యితను గరుడాచలమను (చెంచునాటకం) యక్షగానం అను నాటకాన్ని రచించాడు.

14 వ॥ శ॥ బసవరాజు 'శివతత్వరత్నాకరం' అను గ్రంధాన్ని రచించాడు.

14 వ॥ శ॥ విద్యానాధుడు యితను ప్రతాపరుద్ర యశోభూషణం అను అలంకార గ్రంధాన్ని రచించాడు. కాకతీయుల ఆస్థానకవి.

14 వ॥ శ॥ రావిపాటిత్రిపురాంతకుడు వరంగల్లునివాసి. యితను 'ప్రేమాభిరామం' అను వీధినాటకాన్ని రచించాడు. దీనిఆధారంగా చేసుకొనే 15 వ॥ శ॥ లో శ్రీనాధుడు. క్రీడాభిరామం రచించాడని చెప్పబడుతూవుంది.

14 వ॥ శ॥ కవిరాక్షసుడు 'కవిరాక్షసీయము' అను గ్రంధాన్ని రచించాడు.

14 వ॥ శతాబ్దపు ఆఖరులో మార్కోపోలో అను విదేశియాత్రీకుని ఆంధ్రదేశ పర్యటన.

1400–70 రామానందుడు యితను అలహాబాద్ లోని కన్యాకుబ్జ వంశంలో జన్మించాడు. యితను రామభక్తుడు. యితని శిష్యులు మంగల. మాదిగ, తొగట వగైరా నిమ్నజాతికి చెందినవారు. నిమ్నజాతి ప్రజల్లో యితను తిన ఉపదేశాలను ప్రచారంచేసి విశేషాదరణను పొందాడు. యితను రామానుజుని శిష్యుడు. కాశీని ముఖ్యకేంద్రముగా చేసుకొని దూరప్రదేశాలలో భక్తితత్వాన్ని ప్రబోధించాడు.

14 వ|| శ|| జగద్ధరుడు గొప్పపండితుడు. యితని రెండవ పేరు రత్న ధరుడు. న్యాయవైశేషికము వ్యాకరణములలో గొప్పపండితుడు. వేణీ మాధవం, వాసవదత్త, మాలతీ మాధవం వగైరా గ్రంథాలకు టీకా వ్రాశాడు. యితని తండ్రి "శ్రీమత్ మహోపాధ్యాయ పండితరాజ, మహా కవిరాజ, ధర్మాధికారి" జగద్ధరుడు 14 వ||శ|| తర్వాతివాడే కానీ ముందు వాడుకాడని రామకృష్ణభండార్కర్ అభిప్రాయం.

14 వ|| శ|| వల్లభరాయుల కాలం.

1400–60 మధ్య బమ్మెరపోతన యితని జన్మస్థానం ఏకశిలాపురి (వరంగల్) వద్ద అయిదుమైళ్లలోనున్న బమ్మెరగ్రామం (అనిచాలామటుకు అంగీకరిస్తున్నారు) శ్రీనాథునికి బంధువు సమకాలికుడు. శ్రీనాథుడు శృంగార కావ్యాలరచించి రాజమన్ననలందుకుంటూవుండగా పోతన భగ వద్భక్తిపరుడై రాజమన్ననల పరిత్యాజించి భాగవతమను గ్రంథాన్ని 'సంస్కృతమాతృకనుంచి' తెలుగులో సకలప్రజారంజకంగా స్వతంత్ర అను కరణగా రచించాడు.

14 వ|| శ|| లో వేమారెడ్డి శ్రీశైలపర్వతమునకు సోపానముల కట్టించాడు. యితని కుమారుడు. అనవేమారెడ్డి దేవుని వద్ద వీరమండపం కట్టించాడు.

1400 ప్రాంతం రాజాముకులుండు మేవాడు పరిపాలకుడు. 1415లో మాయోపాయం ద్వారా చంపబడుతాడు.

1400 రట్టడి (కట్టడి) అంటే గ్రామాన్ని అజమాయిషీ చేసే ఉద్యో కులను అన్వాయించే పదం యిది రెడ్డిగా (బహుశా 14 వ|| శతాబ్దారంభ కాలంలో) మార్పుచెందింది.

13 వ|| శ|| జయదేవుడు, విద్యాపతి, ఉమాపతి, చండీదాసు, వగైరా ప్రసిద్ధ వైష్ణవసాంప్రదాయికులు యీ శతాబ్దంలో జీవించారు.

14 వ|| శ|| నీలకంఠుడను శైవభక్తునికాలం.

14 వ|| శ|| ఉమాపతి, శివప్రకాశము తిరుఅరుల్పయన్ వగైరా శైవమత గ్రంథాలు రచించాడు.

1400 శ్రీనాథుని కాశీఖండం పల్నాటి చరిత్రల రచనాకాలం.

14 వ॥ శ॥ గుణరత్నుని జీజితకాలం.

14 వ॥ శ॥ సవనా సింధుప్రాంతనివాసి. వైష్ణవమత భక్తి ప్రబోధకుడు.

14 వ॥ శ॥ వేదాంతదేశిక వెంకటనాయుడు విశిష్టాద్వైతమును బలపరచుచు అరవములోను సంస్కృతంలోను గొప్ప వేదాంత గ్రంధాలు రచించాడు, "సంకల్ప సూర్యోదయం" అను అహింసాభక్తిబోధకమగు నాటకాన్ని రచించాడు.

1410 కాటయవేముడు. యితను రాజమహేంద్రవరాన్ని పరిపాలిస్తూవుండి అంతర్యుద్ధాల మూలంగా 1414 లో చనిపోయాడు.

1414 లో బెంగాల్ పాలకుడగు సైపుద్దీన్ రాయబారవర్గాన్ని చైనాకు పంపాడు.

1416 రాణాకుంభ (మేవాడు రాజామోకులుని కుమారుడు) 1416 లో కుంభమహారాణా అవుతాడు. యితను గొప్ప శూరుడేగాక పండితుడు కూడా. జయదేవుని గీతగోవిందకు టీకావ్రాశాడు. మాళవరాజ్యాన్ని పాలిస్తున్న మహమూదు రాణాకుంభపైకి దండెత్తిరాగా ఓడించివేసి మహమూదును 6 నెలలు చిత్తూరులో ఖైదుచేశాడు. ఢిల్లీ పాదుషా చిత్తూరుపైన దాడిచేసినపుడు మహమూదుకూడా పాదుషాతో యుద్ధంచేశాడు.

1416 నుంచీ 1447 వరకు రాజమహేంద్రివర్మ రాజ్యాన్ని అల్లాడ వేమారెడ్డి, వీరభద్రారెడ్డి అనువారు పరిపాలించారు.

1417 లో ఫిరోజ్ షా తిరుగ తెలుగుదేశాన్ని జయించప్రయత్నించి కొండవీటి పెదకోమటి వేమారెడ్డిని లోబరచుకొని రాజమహేంద్రివరంపై దాడిచేశాడు. కానీ రాజమహేంద్రవరం పాలకుడు అల్లాడనొడ్డారెడ్డివీరిద్దరినీ ఎదుర్కొని రాజమహేంద్రివరపు స్వాతంత్ర్యాన్ని కాపాడాడు. బహమనీసేనలు రాజమహేంద్రివరం విడిచిపోయి ఒరిస్సాలోని గాంగరాజును ఓడించాయి.

1418 నుండి 20 వరకు బహమనీసుల్తాన్ ఫిరోజ్ షా తిరుగా ఆంధ్రదేశాన్ని ముట్టడించాడు. యీదాడి పానగల్లుమీద జరిగింది. (పానగల్లును

విజయనగర ప్రభువైన మొదటి దేవరాయలు స్వాధీనం చేసుకున్న తర్వాత యిది జరిగింది.) కానీ దేవరాయులు వెలమల సహాయంతో ఫిరోజ్ షాను ఓడించి వేశాడు.

1423 లో అన్నమాచార్యుని జననం. 1503 వరకు జీవించాడు. కడపజిల్లా, రాజంపేట తాలూకాలోని తాళ్లపాక జన్మస్థలం ప్రసిద్ధ సంగీత శాస్త్రజ్ఞుడు. "కీర్తనలక్షణ" మను సంగీతశాస్త్రాన్ని రచించాడు.

1423 లో బహమనీసుల్తాను అహమద్ షా విజయనగర రాజ్యంమీద దాడి చేశాడు.

1423–46 రెండవ దేవరాయలు విజయనగర రాజ్యాన్ని పాలించిన సంగమవంశస్థుల్లోనివాడు. యితని కాలంలో రాయలసీమ ప్రాంతమంతా విజయనగర సామ్రాజ్యంలో లీనం చేసుకోనబడింది. యితను తెలుగు భాషను ప్రోత్సహించాడు. యితని ఆస్థానంలోనే శ్రీనాథుడు స్వర్ణాభిషేకాన్ని పొంది కవిసార్వభౌమ అన్న బిరుదును సంపాదించాడు. తెలంగాణాలోని రాచకొండ పద్మనాయకులు, రాజమహేంద్రవరం రెడ్డిరాజులు కూడా యితని కాలంలో విజయనగర ఆధిపత్యాన్ని అంగీకరించారు.

1420 ప్రాంతం రెండవ దేవరాయల కాలంలో యిటలీ నుంచి "నికోలోకోంటీ" వచ్చి విజయనగర సామ్రాజ్యంలో పర్యటన చేసి తన అనుభవాలను వ్రాసినాడు.

1425 లో బహమనీసుల్తాన్, అహమద్ షా అనపోతనాయుని చంపి ఓరుగల్లును ఆక్రమించుకొన్నాడు. తెలంగాణానంతట్నీ కూడా జయించి రాజప్రతినిధికి అప్పజెప్పాడు. కానీ కొద్దికాలంలోనే తెలంగాణా తిరుగుబాటు చేసింది. 1433 లో తిరిగీ దండెత్తివచ్చి సింగమనాయని వోడించి ఓరుగల్లును లోబరచుకొని సింగమనాయని తన ప్రతినిధిగా చేసుకున్నాడు.

1434 ప్రాంతం రెడ్డిరాజుల రాజ్యపతనకాలం.

1434 లో కపిలేశ్వరగజపతి గాంగవంశాన్ని నాశనం చేసి రాజ్యాధికారానికి వచ్చాడు. యితను త్వరలోనే కోస్తాజిల్లాలను కొన్నింటిని జయించి రాజమహేంద్రవరం కొండవీడులలో తనసైన్యాన్ని వుంచాడు. యితను విజయనగర సామ్రాజ్యానికి వ్యతిరేకంగా బహమనీసుల్తానులకు సహాయం చేశాడు.

1435–36 లో ఆంధ్రనాయకులు ముసల్మానులపై తిరుగుబాటు చేసి ఓరుగల్లును స్వాధీనం చేసుకున్నారు.

1438 ప్రాంతం పోతన భాగవత రచనజరిగింది,

1443 లో అబ్దుల్ రజాక్ (ఈరాక్) ఆంధ్రట్లో పర్యటించినట్లు (యిలియట్స్ యిండియా నాల్గన సంపుటంలో లభ్యమవుతుంది.

1446 హరియక్క మల్ల యుద్ధప్రవీణురాలు. యీమె తన తండ్రిని కుస్తీలో చంపిన జెట్టీలతో కుస్తీచేసి వారిని తిరిగి చంపినట్లు నాటి ఒకశాసనములో తెలియజేయబడింది.

1449–1569 మధ్య కాలం శంకరదేవుడు. యితను ప్రసిద్ధ వైష్ణవ భక్తుడు. నేటి నౌగాంగ్ పట్టణసమీపంలోని అలిపుఖూరి అనే గ్రామంలో భూయాన్ కులములో జన్మించాడు. 1541 లో యితను పదిహేడు మంది శిష్యులతోనూ తన గురువయిన మహేంద్ర కందళితోనూ దేశసంచారం గావించి మతబోధసాగించాడు. కాళీదమణ కాళీగోపాల లేక రాసక్రీడ పత్నిప్రసాద్ పారిజాత్ హరణ్ రామవిజయ రుక్మిణీహరణి వగైరా నాటకాలను రచించాడు.

1450 మాధవదేవుడు శంకరదేవుని శిష్యుడు. అర్జునభంజన భూమిలో తోరా, భోజనవిహార, భూషణహరోవా, చోరధార కోలోరా ఖేలా వగైరా నాటకాలను రచించాడు. యీ నాటకాలన్నీ వైష్ణవమత ప్రచారానికిదో హదమిచ్చి మతప్రచారం బాగాసాగింది.

1450 లింగమనాయుడు రేచెర్ల పద్మనాయకుల దాయాదులు దేవరకొండను పాలించేవారు వారిలో లింగమనాయుడు గొప్పవీరుడు. 1461 లో యితను మరణించగా పద్మనాయకుల స్వతంత్ర ప్రభుత్వం సమాప్తమై తెలంగాణాఅంతా బహమనీసుల్తానుల వశమైంది.

1450–1550 మధ్యకాలంలో ఆకాశభైరవకల్పము అను సంస్కృత గ్రంథము రచించబడింది.

1459 జాడ్చురపుకోట నిర్మాణం. యీకోట శంకుస్థాపన సందర్భంలో నిండుప్రాణాలతో మనుష్యునిస్థాపితంచేసి అతని సంతతివారికి మాన్యాలు యివ్వటంజరిగింది.

1460 ప్రాంతం తిమ్మరుసు మంత్రి జననం. యితను సాళ్వనరసింహ రాజు (చంద్రగిరి పరిపాలకుడు) సైన్యాధక్షుడు. సామంతుడు అయిన తుళువనరసరాయునివద్ద మంత్రిగా ప్రవేశించాడు. సాళ్వనరసింహరాజు విజయనగర సామ్రాజ్యాన్ని హస్తగతంచేసుకొనటంలో తిమ్మరుసు తుళువ నరసరాయుడు ప్రధానపాత్రలుగా వుండినారు. సాళ్వనరసింహరాజు మరణానంతరం. అతని పుత్రుడైన ఇమ్మడి నరసింహరాజు అసమర్ధుడైన కారణంగా అతని తొలగించి తుళువనరసరాయుడే విజయనగర సామ్రాజ్యాన్ని హస్తగతంచేసుకుంటాడు. 1503 లో నరసరాయుడు చనిపోగా సింహాసనంకొరకు వచ్చినతగవులలో కృష్ణదేవరాయలను కాపాడి నరసరాయని జ్యేష్ఠపుత్రుడైన వీరనరసింహరాయలు మరణించగా కృష్ణదేవరాయలకు సామ్రాజ్యాన్ని అప్పగించి సామ్రాజ్యవిస్తరణకు అమోఘమైన కృషిచేసి ఎక్కువకీర్తిప్రతిష్ఠలు సంపాదించాడు. 1460 లో హంవీరుడు కపిలేశ్వర గజపతి సహాయంతో హరివీరుడు ఓరుగల్లును స్వాధీనంచేసుకున్నాడు.

1462 లో గుంటూరు మండలములోని వంకాయలపాడు అను గ్రామానికి చిన్నాంబ అను నామె ఒకచెరువునుకట్టించి ఒక (యీమె రామయ భాస్కరమంత్రి సోదరి.) శాసనం వేయించింది.

1465 సంగమవంశపురాజైన మల్లిఖార్జునరాయలు మరణించగా యితని కొడుకు రాజశేఖరుడు పసివాడైనందున యితని దాయాది అయిన విరూపాక్షరాయులు విజయనగర సింహాసనాన్ని ఆక్రమించాడు.

1465–95 రాజా పురుషోత్తముని కాలం యితను పూరీ జగన్నాధ దేవాళయావరణలో అనేకమంటపాలు కట్టించాడు. కాంచీ రాజుకుమార్తె పద్మావతిని వివాహంచేసుకుంటానని కబురంపగా కాంచీరాజు 'ఛండాలునకు నాకుమార్తెనివ్వనని జవాబిస్తాడు. ఫలితంగా యుద్ధంజరిగి పురుషోత్తముడు కాంచీవిజయాన్నీ పద్మావతీవిజయాన్ని సాధిస్తాడు.

1368 రాచకొండ పూర్తిగా బహమనీసుల్తానుల వశమైపోయింది.

1469–1538 వరకు గురునానక్ కాలం. యితను సిఖ్ఖుధర్మప్రచారకుడు. సుల్తాన్‌పూర్ జయసింహునివద్ద నౌకరుగాచేరి అక్కడనుంచే తన ధర్మప్రచారం ప్రారంభించాడు. మక్కామదీనాలు వెళ్లివచ్చాడు. యితను వ్రాసినగ్రంథంపేరు "గ్రంధసాహబ" లో యితని ధర్మసిద్ధాంతాలను

తెలియజేశాడు. యితని శిష్యులలో హిందూ ముస్లింలు సమానంగానే వున్నారు. పంజాబులోని యీరావతీనదిఒడ్డున తలబందీ గ్రామంలో జన్మించాడు. నావక్ కబీర్‌కు ముఖ్యశిష్యుడు.

1469–72 మధ్య అఫాన్సీనికితిన్ భారతదేశానికి ప్రప్రథమంగా వచ్చిన యూరఫియన్ యాత్రికుడు. రష్యాలోని "ప్వెర్" అనేపట్టణ నివాసి. యితను భారతదేశానికి వచ్చేనాటికి భారతదేశానికీ యూరప్‌కూ ఏలాంటిసంబంధాలుకూడా లేవు. నికిటిన్ 1472 లో స్వదేశంవెల్లుతూవుండగా మార్గమధ్యంలో మరణించాడు. 1470 లో యితను దక్షిణ భారతదేశం లో పర్యటించాడు.

1470 లో బహమనీ విజయనగర సేనలుకలిసి కపిళేశ్వర గజపతిని ఓడించాయి. గజపతి మరణానంతరం 'హం' వీరుడు కపిళేంద్ర గజపతి పేరుతో ప్రభువయ్యాడు.

1470–1553 తాళ్లపాక పెదతిరుమలయ్య యితను వెంకటేశ్వరభక్తుడు. విన్నపములరూపంలో వచనములు వెంకటేశ్వరుని పైన రచించాడు. వీటికిరాగములను నిర్దేశించాడు. 'రేఫ' రకార నిర్ణయ గ్రంధకర్త.

1471 మాలిక్ టూఖార్ మహమ్మద్ గావాన్ యితను బహమనీ సుల్తానుల సామంతప్రభువు. యితను రెండులక్షల స్వంతసైన్యాన్ని కలిగి వుండినాడు.

1475 నుండి 77 వరకు ఆంధ్ర దేశంలో భయంకర క్షామం గడచి పోయింది.

1480 లో కొండవీటిప్రజలు సాళువనరసింహనాయకుని ఆహ్వానించి సుల్తాన్‌పైన తిరుగుబాటుచేశారు. కానీ ఓడిపోయారు. తిరిగీ సుల్తాన్ పరిపాలనకు లోబడిపోవాల్సి వచ్చింది.

1480–1550 విజయనగర సామ్రాజ్యపాలనా కాలంలో రెండవదశ యీదశలో తెలంగాణామినహా ఆంధ్రదేశమంతాకృష్ణరాయల పరిపాలన క్రింద ఉండినది.

1480 నుంచీ 1620 వరకు కందనవోలు (నేటికర్నూలు) 140 సంవత్సరాలకాలం చంద్రవంశపు రాజులకు రాజధానిగా వుండినది.

1480–1505 రామరాజుకాలం (అర్వీటి బుక్కరాయల కుమారుడని చెప్పబడుతూవుంది.) యితను ప్రప్రథమంగా కందనవోలును రాజధానిగా చేసుకొని రాజ్యమేలిన హైందవరాజు యితనికి తిమ్మరాజు కొండలరాజు శ్రీరంగరాజులు కొడుకులు యితని అనంతరం మూడవ కుమారుడు శ్రీరంగ రాజురాజ్యాన్ని చేపట్టాడు. శ్రీరంగరాజుకు కోనరాజు, తిమ్మరాజు, అళియ రామరాజు కొడుకులు. యీఅళియరామరాజే కృష్ణదేవరాయల కూతురును వివాహమాడి ఆ తర్వాత విజయనగర సామ్రాజ్యానికిరాజై తల్లికోట యుద్ధంలో చనిపోయాడు. యితని పుత్రులు తిరుమలరాజు వెంకటాద్రి రాజు.

1480 వేమనయోగి కాలం. నిర్యాణకాలమని కొందరిఅభిప్రాయం.

1482 లో మహమ్మదుబాహ్మనీ అనునతను బాహ్మనీసింహాసనాన్ని అధిష్టించి తన అనుచరుడైన మలిక్ కూలీకుతుబ్ ఉల్ ముల్కును తెలంగాణా ప్రాంతానికి అధిపతినిగానియోగించాడు. తర్వాత బాహ్మనీ రాజ్యం విచ్ఛిన్నమయి బిజాపురం, అహ్మదు నగరం, బీరారు, బీదరు, గోల్కొండ అయిదు భాగాలుగా చీలిపోయింది.

1485 లో నెల్లూరువరకు దాడిచేసిన మూడవ అహమ్మద్ షాను విజయనగర సింహాసన మాక్రమించిన సాళువ నరసింహ నాయకుడు తన సేనానులైన తుళువ నరసనాయకుడు ఈశ్వరనాయకుల పంపి కందుకూరు సమీపాన బహమనీ సేనల సంపూర్ణంగా ఓడించివేశారు.

1486 ఫిబ్రవరి 18 వ తేది చైతన్య ప్రభు జననం. వీరినే గౌరాంగ స్వామి అనికూడాఅంటారు (వీరు పూరీలో ఎక్కువకాలం నివసించారు) నవద్వీపములోని మాయాపురం గ్రామంలో జననం. తన 24 వ యేట కాట్వాకు కెళ్లి శ్రీకేశవ భారతివద్ద సన్యాసం స్వీకరించాడు. 1553 లో మరణించాడు. యితనితండ్రి జగన్నాథమిశ్ర. తల్లి శచదేవి. అన్న విశ్వరూపుడు ఎక్కువమంది శిష్యుల సంపాదించి అనేక అద్భుత కార్యాలుకూడా చేస్తూ వుండినాడని ప్రతీతి. కృష్ణ భక్తుడు

1486 నుండి 1515 వరకు రాజామానసింహుడు గ్వాలియార్ను పరిపాలించాడు

1486 విజయనగర పాలకుడైన విరూపాక్షరాయలు సమర్ధనీయుడు కాని కారణంగా సామంతుడైన చంద్రగిరి నరసింహుడు విరూపాక్షుని పద విచ్యుతుని చేసి సింహాసనాన్ని ఆక్రమిస్తాడు యితనిది సాలువవంశం యితను బహమనీ సుల్తానులు ఉడీసా పాలకులు ఆక్రమించు విజయనగర రాజ్య ప్రాంతాలను తిరిగి సంపాదించాడు.

1486 దాదాపు శేర్ శాహ్ జననం. యితని మొదటి పేరు ఫరద్. యితనితండ్రి బీహారులోని సహసరామ్ పుర జమిందారుయితనుతనతండ్రితో మొదట్లో చాలాతూర్లు ఘర్షణపడి వెల్లిపోవలసి వచ్చిందికూడా బీహార్ రాష్ట్రపాలకుడైన బహారఖాంవద్ద నౌకరీచేస్తూ వేటకు వెల్లిన సందర్భములో స్వయంగా ఖడ్గముతోనే సింహాన్ని సంహరించాడు. అప్పటినుంచీ ఫరద్కు మారుగా శేర్ ఖాం బిరుదును బహారఖాం ప్రసాదించాడు. ఢిల్లీపాలకుడైన హుమయూన్ను ఓడించి ముస్లిం సామ్రాజ్యాన్ని హస్తగతం చేసుకొని సూరవంశానికి పునాదులు వేశాడు. యితని శాసనకాలం 1540 నుంచీ ప్రారంభమౌతుంది 1545 లో కాలింజర యుద్ధములో మందుగనిలోపడి కాలి చనిపోయాడు.

1488 బహలోలలోదీ మరణాంతరం నిజామఖా సికిందర్ శాహ అనే బిరుదుతో సింహాసనాన్ని ఆక్రమించాడు. యితనితల్లి కంసల స్త్రీ, సుల్తాన్ జ్యేష్ఠపుత్రుడైన బార బకశాహకు యితనికి సింహాసనంకొరకు సంఘర్షణజరిగింది. ఆఖరుకు సికిందర్ శాహీకే విజయంలభించింది. సికిందర్ శాహీ 1504 లో ఆగ్రాలో సైనిక స్థావరాన్ని నిర్మించి అనంతరం ఆగ్రా నేతనరాజధానిగా చేసుకొన్నాడు. యితను ప్రతిభాయుతంగా తన రాజ్యాన్ని విస్తృతపరచుకొని 1517 నవంబర్ 21 వ తేది మరణించాడు.

1492 కొలంబసు అట్లాంటిక సముద్రందాటి అమెరికా చేరుకున్నాడు. అమెరికా భూఖండం అనేది ఒకటుందని అక్కడకూడా మానవజాతి నివ సిస్తూవుంటుందని లేక వుందని ప్రపంచానికే తెలియనిదశలో ప్రప్రథమంగా ఆకస్మిక ఘటనగా కొలంబస్ అమెరికాకు చేరుకొన్నాడు. (నావలో).

1493 సాలువ నరసింహరాజు చంద్రగిరి రాజధానిగా రాజ్యాన్ని పాలించి 1493 లో చనిపోగా యితని యిద్దరుపుత్రులు అసమర్థులైనందువల్ల వీరికాలం పదిసంవత్సరాలుకే తీరిపోయింది.

1495–1532 రాజా ప్రతాపరుద్ర దేవునికాలం. యితను పూరీ జగన్నాధ దేవాళయంలో ముఖశాల కట్టించాడు.

1497 వల్లభాచార్యుల జననం. ఆంధ్రదేశపువాడు. తండ్రిలక్ష్మణ భట్టు యితను కృష్ణదేవరాయల ఆస్థానములో శైవమతస్థులతో వాదించి జయించటంతో యితనిప్రసిద్ధి వెలుగులోనికివచ్చింది. యితను శ్రీగోపాల కృష్ణుడు తనకు ప్రత్యక్షమయాడని చెప్పకొనేవాడు. యితని తలిదండ్రులు ఉత్తర దేశయాత్రలకెళ్లి అక్కడే స్థిరపడిపోగా కాశీవద్ద జన్మించాడు.

1498 వాస్కోడాగామా దక్షిణాఫ్రికాను చుట్టివచ్చి యిండియా మలబారు సముద్రతీరంలో (1948 మే 28 తేదీన) దిగాడు.

15 వ॥ శ॥ సంబెటగురవరాజు. కడపజిల్లా సిద్ధవటం పరిపాలకుడు. యితని పరిపాలన అమానుషంగా కొనసాగింది. పన్నులు అడిగినపుడే యివ్వ లేనివారియిండ్లలోనుంచి స్త్రీలను యీడ్చితెచ్చి వారిస్థనాలకు చిరతలు (పట్టకరలాంటి యినుపకొరముట్టు) వేసిబాధించి నురీవసూలు చేసేవాడు. కూచిపూడి భాగవతులు విజయనగరరాజైన వీరనరసింహరాయలకు తమ నాటకాల ద్వారా గురవరాజు చర్యల్ని తెలియజేసి గురవరాజును తుద ముట్టించమని విన్నవించుకున్నారు. నరసింహరాయలు తన సైన్యాన్నిపంపి గురవరాజును కడతేర్చాడు అనే విషయం 1502 లో తయారయిన మాచు పల్లికైఫియతు (లోకల్ రికార్డు 56 వ సంపుటం 66 వ పేజీ) లో తెలియ జేయబడింది.

1500 ప్రాంతం బుద్ధన్ బ్రాహ్మణుడు. హిందూ మతం కూడా ముస్లింమతంతో సమానమైనదే అని ప్రచారంచేసినందుకు సికిందర్‌షాహి బుద్ధన్‌కు ఉరిశిక్షవిధించాడు.

15 వ॥ శ॥ గౌరన శ్రీశైలనివాసి. ॥లక్షణదీపిక॥ అను ఛందోగ్రంధ రచయిత.

15 వ॥శ॥ అనంగుడు కృష్ణాజిల్లానివాసి. ఛందోదర్పణము రచయిత.

15 శతాబ్దాంతం (దాదాపు) కబీరు జననం. యితను ఒకవిధవ బ్రాహ్మణ స్త్రీకి జన్మించగా ఆమె ఆశిశువును చెరువుగట్టుపై పరుండబెట్టిపోగా ఆశిశువును ఒక ముస్లిమ్ నేత పనివాడు పెంచాడు. యితను రామానందునికి శిష్యుడైనాడు. హిందూభక్తి భావాన్నీ ముస్లింసూఫీ మతభావాలనూ సమన్వయంచేసి ప్రచారం చేశాడు (1440–1568 మధ్యవాడు)

15 వ॥ శ॥ గోరక్షానాథుడు పశ్చిమోత్తర ప్రదేశపువాడు. కబీర్ సమకాలికుడు యితనికి అనేకమంది శిష్యులువుండినారు, గోరఖనాథుడు అనికూడా పిచేవారు "గోరక్షాసంవాత" అను యోగ విద్యాగ్రంథాన్ని రచించాడు.

15 వ॥ శ॥ జయదేవుడు తండ్రి మహాదేవుడు తల్లి సుమిత్రి యితనికి పక్షధరమిశ్ర, పీయూషవర్ష, అనేపేర్లుకూడాకలవు "ప్రసన్న రాఘవీయం నాటకాన్ని" చంద్రాలోక అను అలంకార గ్రంథాన్ని రచ్నిచినాడు.

15 వ॥ శ॥ కాటయవేమనృపతి యితను మాలవికాగ్నికి వాఖ్య రచించాడు.

15 వ॥ శ॥ వెల్లం తాతంభట్టు కృష్ణాజిల్లానివాసి "కవిచింతామణి" అనుఛందోగ్రంథాన్ని రచించాడు.

15–16 వ॥ శ॥ కాచిరాజు బసవన శ్రీశైలనివాసి కవిసర్పగారుడము రచించాడు.

15 వ॥ శ॥ చిత్రకవి పెద్దన, కడపజిల్లా నివాసి లక్షణసార సంగ్రహము రచించాడు.

15 వ॥ శ॥ సదానందుడు జీవించి వేదాంతసారము అను గ్రంథాన్ని రచించాడు.

15 ఆజ్ఞాత్మానందుడు జీవించి, బ్రహ్మవిద్యాభరణము అను గ్రంథాన్ని రచించాడు,

15 వ॥ అనిరుద్ధుడు "సాంఖ్యసూత్రవృత్తి" అను గ్రంధకర్త.

1503 లో నరస నాయకుడు తుళువవంశస్థుడు సాలువ నరసింహ రాజు పుత్రులకు సేనానాయకుడుగా వుండి వారి అసమర్థత కారణంగా నరసనాయకుడు రాజ్యాన్ని ఆక్రమించాడు.

1503 నుంచీ 1509 వరకు వీర నరసింహరాయని పరిపాలన యితను తుళువ నరసరాయుని జ్యేష్ఠపుత్రుడు యితని ఎనిమిదేండ్ల కుమారుడైన తిరుమల దేవరాయునికి పట్టాభిషేకం చేయమని తిమ్మరుసు మంత్రికి చెప్పి చనిపోగా తిమ్మరుసు వీర నరసింహరాయుని సవతితల్లి కొడుకైన కృష్ణ దేవరాయలకు విజయనగర సామ్రాజ్యాన్ని అప్పగిస్తాడు.

1504 ప్రాంతం సీతాపతిరాజు యితను ఇస్లాం మతమును స్వీకరించి షితాబుఖానుగా మారాడు. ఓరుగల్లు నేలుచుండు ముస్లిములను తరిమివేసి స్వతంత్ర రాజ్యాన్ని స్థాపించాడు. (చరికొండ ధర్మయ్య అను కవిశేఖరుడు రచించిన "చిత్ర భారతములో" షితాబుఖానుకు సంబంధించిన విషయాలనేకం కలవు.

1509 నుంచి 50 వరకు (దాదాపు) విఠలనాథుడు వల్లభాచార్యుల జ్యేష్ఠకుమారుడు. వల్లభ మతాన్ని ముందుకు తీసుకెళ్లినవాడు మధుమాంస భోజనాదులు. పుష్టికరమార్గమని యితనివాదన, యితని నాల్గవ పుత్రుడైన గోకులనాథజీ యీమతాన్ని మరింత వ్యాపింపజేశాడు. యీమతాను యాయులంతా వల్లభుని కృష్ణాంశంగా భావిస్తారు. అలాగే యీవంశస్థుల నందరినీ కూడా సహజంగానే కృష్ణాంశమని భావించారు.

యీగురువులను ఉయ్యాలలో పరుండబెట్టి ఊచినందుకు తాంబూలం ముద్దస్వీకరించినందుకు పాదతీర్థం సేవించెందుకు పాదధూళి ధరించినందుకు వగైరా కార్యాక్రమాలకంతా ప్రత్యేకమైన దక్షిణలు యిచ్చుకోనేవారు.

1509 వీర నరసింహారాయల మరణం. యితను తుళువ నరసనాయని కుమారుడు యితని మరణానంతరం సవతి తమ్ముడైన కృష్ణదేవరాయులు రాజ్యాధికారానికి వచ్చాడు.

1509–30 కృష్ణదేవరాయల పరిపాలనా కాలం తిమ్మరుసు యితని మంత్రి ప్రజా శ్రేయస్సుదృష్టితో చాలా సంస్కరణలను అమలు జరిపించాడు. తెలుగు కన్నడ భాషల రెండింటిని సమానంగా ప్రోత్సహించాడు. అయినప్పటికీ తెలుగు భాషయందు ప్రత్యేకాభిమానాన్ని చూపించాడు. 1513–14 లో ఉడిస్సా పాలకుడైన గజపతి ప్రతాపుని 1520 లో బిజాపూరు సుల్తానులపై దండయాత్రచేసి ఓడించాడు. 1514 లో ఆంధ్ర దేశమంతా జైత్రయాత్రచేశాడు. (కొంగదేశ రాజకాల్ అను పురాతన గ్రంధాన్ననుసరించి శాలివాహనశక 1431 మాఘ శు॥ 14 లు సరియగు 1509. ఫిబ్రవరి 4 వ తే. కృష్ణదేవరాయల పట్టాభిషేకం జరుగునట్లు తెలుస్తూ వుంది)

1510–50 ధూర్జటి మహాకవి యితను రాయలఆస్థాన పండితుడు "కాలహస్తీశ్వర మహాత్మ్యము" అను భక్తికావ్యాన్ని రచించాడు. యితని అంతిమకాలంలో బహుశా రాజప్రాపు తొలగిపోయిన సందర్భంలో. కాళహస్తిలోనే నివసించి రాజరికాలను నిరసిస్తూ కాళహస్తీశ్వర శతకాన్ని రచించాడు.

1510 లో క్రిష్ణదేవరాయలు సింహాసనం అధిష్టించాడని కొందరి అభిప్రాయం.



1512 లో గోల్కొండ రాజ్యస్థాపన గోల్కొండ నవాబులలో మొదటివాడైన కులీకుతుబ్‌షా, (యితను 1512 నుంచి 1543 వరకు రాజ్యం చేశాడు.) యితను కృష్ణదేవరాయల కాలంలో కృష్ణదేవరాయలతో యుద్ధం చేసి ఓడిపోయాడు. కానీ కృష్ణదేవరాయల అనంతరం యితను తిరిగి విజృంభించి తెలంగాణా ప్రాంతాన్నంతా స్వాధీనం చేసుకొన్నాడు. కులీకుతుబ్‌షా తెలంగాణా విస్తరణ సందర్భంలో షితాబ్‌ఖాన్ (సితాపతిరాజు) తో మూడుతూర్లు యుద్ధం చేయాల్సివచ్చింది. కూలీకుతుబ్ ఉల్‌ముల్కా గోలకొండ బహమనీసుల్తానుల వశములో ఒక సూబాలేక మండలంగా వుండినది.

1514 లో బార్బోసా ఆంధ్రదేశసంచారం.

1515 లో కృష్ణదేవరాయలు సింహాచలం, పోట్నూరు, కటకం, వరకు దండయాత్ర చేశాడు. యీసందర్భములోనే ప్రతాపరుద్ర గజపతితో సంధిజరిగి గజపతి కూతురును కృష్ణదేవరాయలు వివాహం చేసుకొన్నాడు.

1520 ప్రాంతం నందితిమ్మన్న యితను పారిజాతాపహరణమను నిబంధాన్ని కృష్ణదేవరాయల అంకితం యివ్వటాన్నిబట్టి కృష్ణదేవగాయల సమకాలికుడ నిన్నీ ఆస్థాన పండితుడని చెప్పబడుతూవుంది. యితని తల్లి తిమ్మాంబ తండ్రి సింకన్న మరియమారుతకవి. మేనమామ అఘోరశివ గురువు శిష్యుడు. యితనినే ముక్కు తిమ్మన్న అని పిలుస్తారు.

1520 నుంచి 1590 వరకు అప్పయకవికాలం యితనికి అప్పైఅనియు అప్పాదీక్షిత అనియు నామాంతరాలుకలవు. తమిళుడు కానీ తెలుగు చక్రవర్తుల ఆశ్రయించి జీవించాడు. యితని జన్మస్థలము అడైయపాళెం.

1520 అల్లసాని పెద్దన కవిని పల్లకీలో ఊరేగించుట.

1520 లో కృష్ణదేవరాయలు రాయచూరును స్వాధీనం చేసుకొనుట రాయచూరు ముస్లిముల పాలనక్రింద వుండినది.

1526 లో బాబరు ఢిల్లీని ఆక్రమించాడు. భారతదేశంలో మొగలు

సామ్రాజ్య మూలకర్త తైమూరు వంశస్తుడు మధ్యాశియాకు చెందిన (మంగోలు) ముస్లిం.

1526 హృగ్వద్మర్కర్పొ బౌద్ధ చరిత్రను రచించినవాడు. యితని రచనల్లో బుద్ధునికి జ్ఞానోదయం అయిన తర్వాత పదునారేండ్లకు ధాన్య కటకమున వజ్రయానమను తృతీయ ధర్మ చక్రమును బుద్ధుడే ప్రచారము చేసినట్లు చెప్పబడింది.

1526 ప్రాంతం దాదాపు బహమనీసుల్తానుల రాజరికము అస్త మించింది. వీరి పాలనలో తెలంగాణా యుద్ధరంగంగావుండి అక్కడి ప్రజలు నానాయాతనలు అనుభవించాల్సి వచ్చింది.

1527 లో ఖాండ్వాయుద్ధంలో మేవాడు రాణాసంగ్రామసింహుని సైన్యాలను బాబరు సైన్యాలు ఓడించివేశాయి.

1528–1606 దాదాపు దివాకరుడు గోదావరీ తీరంలో గోల్ గ్రామ నివాసి జాతకపద్ధతి అను గ్రంథాన్ని రచించాడు. యింకా చాలా గ్రంథాలుకూడా రచించాడు.

1529 త్రిలింగ లేక త్రైలింగస్వామి దాక్షిణాత్య బ్రాహ్మణుడు 1529 పుష్యమాసంలో విజనాజిల్లా హోలియా గ్రామంలో జన్మించాడు. యీతని పెద్దభార్యయందు త్రైలింగధరుడు జన్మించాడు. యితను తన 180 వ ఏట కాశీలో స్వర్గస్థుడైనట్లు చెప్పబడుతూవుంది.

1530 లో క్రిష్ణదేవరాయుల మరణమని చాలామంది అభిప్రాయం

1530 దుర్గావతి యీమె చిత్తూరు మహారాజా సాంగాపుత్రిక, చేసిల్ రాజా సిలోడీని వివాహమాడింది. కానీ గుజరాత్ నవాబు సిలోడీని పట్టుకొనిపోయి ముస్లింగా మార్చివేశాడు. సిలోడీ చిన్నతమ్ముడు వీరత్వంతో కోటను రక్షించ ప్రయత్నించాడు. కానీ అశేషముస్లిం సైన్యాలముందర కోటను తురకలకు అప్పగించాల్సి వచ్చింది. రాణీదుర్గావతి తతిమ్మా కోటలోని రాజపుత్రస్త్రీలు ముస్లీంల చేతులలో పడకూడదనే నిర్ణయానికి వచ్చి 7 వేలమంది రాజపుత్రస్త్రీలతో దుర్గావతి అగ్ని ప్రవేశం చేసింది.

1531–38 గోళ్ల చినరామప్ప ఆర్కాటు జిల్లాలోని చెంజిని పరి పాలించిన గోళ్లవంశస్థుడు. వీరు విజయనగర సామంతులు యితనికాలంలో

పచ్చుకప్పురపు తిరువేంగళకవి చొక్కనాథ చరిత్ర అను ద్విపద కావ్యాన్ని రచించాడు.

1560 ప్రాంతంలో గోసాయి తులశీదాసు జన్మించి 1680 శ్రావణ శుక్ల సప్తమినాలు నిర్వాణ పొందాడని కొందరి అభిప్రాయం.

1532–1623 మధ్యకాలంఅని కొందరు యితను 'అక్బరుకు సమ కాలీనుడున్నూ జహంగీర్ కాలంలో అధిక భాగపువాడుగా వుంటాడు. యితని రచనలలో కెల్ల రామచరితమానస లేక తులసీరామాయణం అత్యంత శ్రేష్టమైనది.

1532 లో బాబరు చక్రవర్తి యితను హోజ్జాహుస్సేను అను నాతని రాయబారిగా రష్యాకు (మాస్కోకు) విలువైనవస్తువులను బహుమానాలు గా యిచ్చి పంపాడు. యితను మొగలు సామ్రాజ్య స్థాపకులలో ప్రథమ పురుషుడు తల్లి మంగోలుజాతి తండ్రి తుర్కిజాతివాడు యితని సైన్యములో తుపాకులు మందుగుండు ఉపయోగించేవారు ఢిల్లీని పాలిస్తున్న "ఇబ్రహీంలోడి" చాలా క్రూరుడైనందున అతనిచే బాధితులైన సామంతులు బాబరుకు సహాయంచేసి ఢిల్లీ సింహాసనాన్ని కట్టబెట్టారు. 1526 లో పానిపట్టు యుద్ధంలో లోడీ సేనలను బాబరు సైన్యాలు ఓడించివేశాయి.

1534 పులివెందులకోటను ఎల్లప్పనాయుడను ఏకిల పాలివాడు పరిపాలించాడు. యితనే ఆంజనేయస్వామిని ప్రతిష్ఠించినట్లుకూడా తెలియు వస్తూవుంది.

1535 అచ్యుతరాయులు కృష్ణదేవరాయల అనంతర పరిపాలకుడు.

1539 లో షేర్ శాహ్, అధికారానికి వచ్చాడు యితను రివెన్యూ ఉద్యోగస్థులే ఒక్కొక్క గ్రామంనుంచీ భూమిపన్నును నిర్ణయించాలని వారే వసూల్లు చేసి కేంద్రానికి పంపాలని వుత్తర్వు చేశాడు.

1540 హుమాయూను, యితను మొగలు సామ్రాజ్య స్థాపకుడైన బాబరు కొడుకు యితను రాజ్యపాలనయందు అసమర్థుడు. 1540 లో కనోజ్ వద్ద బీహారు పాలకుడైన ఆఫ్ఘనువీరుడు షేర్షా చేతిలో ఓడిపోయి రాజ్య భ్రష్టుడయ్యాడు. కానీ షేర్షా మరణించిన తర్వాత తిరిగీహుమాయూను పర్షియా రాజు సహాయంతో సేనల సంపాదించి. గాంధారం

పంజాబులను జయించి ఢిల్లీ సుల్తానును "సర్హింద్" యుద్ధమందు ఓడించి తిరిగీ మొగలు రాజ్యాన్ని ప్రతిష్ఠించాడు. యితను 1557 లో చనిపోయాడు.

1543–44–51–53 సం॥ లలో ఆర్వీటి రామరాయులు అహమ్మదు నగరు బీజాపూరు సుల్తానులపై దండయాత్రలు చేసినాడు.

1550–80 ఇబ్రహీం, యితను గోల్కొండ నవాబులలో మూడవ వాడు. యితను తన అన్న అయిన జంషేద్ కు భయపడి అలియ రామరాజు వద్ద కొన్ని సంవత్సరాలు ప్రవాసజీవితం గడిపాడు. యీసందర్భములో యితనికి తెలుగు భాషతోనూ తెనుగు కవులలోనూ పరిచయం ఏర్పడింది. కానీ అనంతరకాలంలో యితను బహమనీ సుల్తానులతో కలసి అలియ రామరాజుకు వ్యతిరేకంగా తల్లికోట యుద్ధంలో పాల్గొని విజయనగర సామ్రాజ్య పతనానికి కారకుడైనాడు తెనుగు కవులను ప్రోత్సహించి ఆదరించటమేకాక కొన్ని గ్రామాలనుకూడా తెనుగు కవులకు దానం చేశాడు.

1550–1650 విజయనగర సామ్రాజ్యానికి తృతీయదశ అంతిమదశ కూడా 1565 లో తల్లికోట యుద్ధంలో పరాజితమైన తర్వాత క్రమంగా క్షీణిస్తూవచ్చి 1650 కి పూర్తిగా విజయనగర సామ్రాజం అంతరించింది.

1550 ప్రాంతం, వెంకటనాథకవి "పంచతంత్రము" రచించినాడు.

1552–1624 మధ్యకాలం అప్పయ్య దీక్షితుడు "విధి రసాయన" మను గ్రంథాన్ని రచించాడు.

1552 అచ్యుత రాయల మరణం. యితను కృష్ణదేవరాయల అనంతరం విజయనగర పరిపాలకుడైనాడు. యితని అనంతరం యితని బావ మరిది సదాశివ సింహాసనాన్ని అధిష్టించాడు. కానీ అసమర్థుడైన కారణంగా యితని మంత్రి రామరాయలు రాజ్యానికి వచ్చాడు.

1555 నుంచీ 1605 వరకు అక్బరు పరిపాలనాకాలం హుమాయున్ కుమారుడు. సహగమన పద్ధతిని మాన్పించేందుకు కృషి చేశాడు. దీన్ యిలాహి అను నూతనమతాన్ని స్థాపించేందుకు విఫల ప్రయత్నంచేశాడు. ప్రజా రంజకుడయిన మొగలు సామ్రాట్టు 1542 జననం.

1556 నుంచి 1605 వరకు అక్బరు కాలం 1560 నుంచికూడానని లెక్కించటం జరుగుతూవుంది.

1558 లో తుకారాం జననం. (పూనా సమీపంలో దేహుల్ గ్రామం) యితనిది శూద్రజాతి 11 ఏండ్ల ప్రాయంలోనే యితనికి వివాహం జరిగింది. 20 ఏండ్ల వయస్సులో యితని తల్లిదండ్రులు మరణించారు. యిదే కాలంలో దేశంలో నలుమూలలా ఘోరక్షామం దాపురించింది. యితను శివాజీకి గురువు "అభం" అను గ్రంథాన్ని రచించాడు. 1658 లో మరణించాడు.

1560 వెంకటరామరాజు పాలనారంభం అలియ రామరాజు జ్యేష్ట పుత్రుడైన కోనరాజు కుమారుడు వెంకటరామరాజు యితని అనంతరం యితని పుత్రుడు గోపాలరాజు రాజయ్యాడు తర్వాత కర్నూలు. బిజాపూరు సుల్తానుల వశమయింది.

1560 తర్వాత తాన్‌సేన్ అక్బరు చక్రవర్తి నవరత్నాలలోనివాడు ప్రసిద్ధ గాయకుడు సూరదాసు సమకాలీనుడు "ద్రుపద" దర్బార్ వనారా మియా మల్హార్ "మియాసారంగి", వగైరా అపురూప రాగాలను సృష్టించాడు.

1565 కృష్ణా తీరములో కొల్లూరు అనే తావున రత్నాలగని కనిపెట్ట బడింది. అక్కడే ప్రపంచ ప్రఖ్యాతి చెంది కోహినూర్ వజ్రము దొరికింది.

1565 లో తల్లికోట యుద్ధంలో రామరాజు చనిపోయాడు. దక్కను సుల్తానులచే విజయనగరం విధ్వంసం చేయబడింది. తల్లికోట లేక రక్షస తంగడి యుద్ధం జరిగిన తర్వాత ఆంధ్రదేశములో కొంతవరకు దౌర్బల్యం ఏర్పడింది.

1565 మహా మండలేశ్వర బసవరాజు అలంపురాన్ని పరిపాలించిన రాయల సామంతుడు.

1568 ప్రాంతం రుద్రకవి "సుగ్రీవ విజయం", అను యక్షగానానికి సంబంధించిన గ్రంథం రచించాడు.

1568 కళాపహారుడు యితనుమతం మార్చుకొన్న హిందువు, పూరీ జగన్నాథాలయం పై దాడిచేసి. దేవాలయాన్ని విధ్వంసం చేశాడు.

1568 తిరుమలరాయుడు యితను రామరాయల తమ్ముడు. అనంతపురంజిల్లా పెనుగొండ రాజధానిగా చేసుకొని 4 సం|| రాలు పరిపాలన చేశాడు.

1568 జయమల్లుడు రాజపుత్ర వీరుడు రాణాసాంగా పుత్రుడు ఉదయసింహ్మడు అక్బర్‌కు భయపడి చిత్తూరును విడిచి పారిపోగా బదనోర్ పాలకుడైన జయమల్లు ఫత్తా అనువీరులు అక్బర్ సైన్యాలను ఎదిరించి పోరాడారు. అసంఖ్యాకమైన అక్బర్ సైన్యాల నెదిరించి వీరు వీర మరణం పొందారు, వీరి వీరత్వానికి ముగ్ధుడైన అక్బర్ వీరి శిలాప్రతిమలు చేయించి ఢిల్లీలో స్థాపించాడు.

1569 నుంచీ ఆంధ్ర సామ్రాజ్యానికి తంజావూరు రాజధానిగా పరిపాలనసాగింది. తల్లికోట యుద్ధానంతరం రాయల సంతతివారు అచ్యుతరాయలు రఘునాధరాయలు వీర రాఘవరాయలు వరుసగా పరిపాలించారు యీ వీర రాఘవులే విజయనగర సామ్రాజ్యానికి అంతిమ పరిపాలకుడు 1674 లో మధుర నాయకుడైన చుక్క నాయుడితో జరిగిన యుద్ధంలో వీర రాఘవులు చనిపోయారు.

1570 లో అక్బరు జైసలమేర్ జోధపూర్ హిందూ రాజపుత్రికలను వివాహం చేసుకొని ఒకనూతన సాంప్రదాయాన్ని నెలకొల్పాడు

1572 లో గోల్కొండ సేనాని అయిన రఫ్వాల్‌ఖాన్‌లారీ అనునతడు రాజ మహేంద్రనరాన్ని స్వాధీన పరచుకొన్నాడు. యితనే 1579 లో వినుకొండవీడు కంచర్లకోట. ఖమ్మం. వగైరా ప్రదేశాలను స్వాధీనం చేసుకొన్నాడు. 1590 తర్వాత కర్నూలు. నంద్యాల ద్రోణాచలం గండికోట నెల్లూరు. ప్రాంతాలనుకూడా లోబరచుకొన్నాడు.

1574 నుంచి 86 వరకు శ్రీరంగరాయలు విజయనగర రాజ్యాన్ని పరిపాలించాడు.

1577 లో జెసూయిట్ క్రైస్తవులు మలబారులో బైబిల్‌ను. మళయాళీ. లిపిలో తయారు చేయించారు,

1580–1611 గోల్కొండ నవాబులలో మహమ్మద్ కుతుబ్‌షా. యితను ఇబ్రహీం తర్వాతివాడు యితని భార్య భాగ్యవతి అను హిందూస్త్రీ యీమె పేరుతో హైదరాబాదు (నేటి) నగరాన్ని నిర్మించి భాగ్యనగరం, అని పేరుపెట్టాడు. భాగ్యవతి చనిపోయిన అనంతరం కుమారుని స్మారకార్థం హైదరాబాదు అని పేరు పెట్టాడు. యితని కుమారుడు

అబ్దుల్లాహుసేన్ యితని కాలంలో తిమ్మయ కవి గోలకొండ కరణంగా వుండినాడు. "వైజయంతి విలాసము గ్రంథం" తిమ్మయకవి రచించినదే.

1582 లో అద్దె పాళెంలోని నీల కంఠేశ్వరాలయాన్ని అప్పయ కవి కట్టించాడు.

1584 లో అక్బరు. పుత్రుడైన సలీమ్‌కు భారమల్లుని మనుమరాలిని వివాహంచేసి రాజపుత్రుల అండదండలను ధృఢతరం చేసుకున్నాడు.

1585 ప్రాంతం మార్కండేయ ప్రభువు. పెందోట పురాన్ని పరి పాలించాడు. యిది నాగార్జున కొండకు 6 మైల్ల దూరంలో వుంది. అక్కడ ప్రఖ్యాతి చెందిన శిల్పకళా నైపుణ్యులు వుండేవారు నాగార్జును జన్మస్థలంకూడా యీ పెందోట పురమేనని చెప్ప బడుతూవుంది. తెలుగు నాగర ఖండములో మార్కండేయుడు యీనగరాన్ని పాలించునట్లు నిజాం పాలకుడైన మహమ్మద్ కులీకుతుబ్‌షా సమకాలీనుడని కూడా చెప్పబడింది.

1585 నుంచీ 1614 వరకు వెంకటపతిరాయులు చంద్రగిరి రాజ ధానిగా పరిపాలన సాగించాడు. యితని కాలంలో మైసూరు విజయనగర సామ్రాజ్యంనుంచి చీలి రాజ ఒడయరు అను స్థానిక ప్రభువు చేతుల్లోకి పోయింది. యితని అనంతరం చంద్రగిరి సింహాసనంకొరకు యితని బావమరది గొబ్బూరు జగ్గరాజు అను నతను రాయుల అన్న కుమారుడైన రెండవ శ్రీ రంగరాజు కుటుంబాన్ని హత్య చేయించగా యాచమ నాయకుడను సేనాని రెండవ శ్రీరంగరాయల కుమారుడు. మూడవ శ్రీ రంగరాయలు అను బాలుని కాపాడి రాజ్యాధికారాన్ని అప్పగిస్తాడు.

1585 మల్లనకవి కాలం యీ ప్రాంతపువాడే, తరిగొప్పుల మల్లన కూడా బహుశా యిద్దరూ ఒకరేనేమో!

1589 లో గోలుకొండలో మహామారి అను అంటువ్యాధి వ్యాపించి ప్రజలు విశేషంగా మరణించారు.

1591 మహమ్మద్ కులీకుతుబ్‌షాచే హైదరాబాదులోని చారు మినారు నిర్మించటం జరిగింది.

16–17 వ॥ శతాబ్దుల నాడు "పట్టాభిరామ కవి" కవి సర్ప గారుడము" వగైరా గ్రంథాలు రచించాడు.

16 వ॥ శ॥ కామినేని మల్లారెడ్డి యితను మల్కిభరాము కాలపువాడు. "షట్చక్రవర్తి చరిత్రము" పద్మ పురాణము శివధర్మోత్తర ఖండము" అను గ్రంథాలను రచించాడు.

16 వ॥ శ॥ యాదవామాత్యుడు భద్రాచల నివాసి "యాదవామాత్యాచ్ఛందము" అను ఛందో గ్రంథాన్ని రచించాడు,

16 వ॥ శ॥ లింగముగుంట తిమ్మన నెల్లూరు నివాసి "సులక్షణ సారము" అను ఛందో గ్రంధం రచించాడు.

16 వ॥ శ॥ వార్తా కవి రఘు నాదయ్య "లక్షణ దీపిక" అను ఛందో గ్రంధం రచించాడు.

16 వ॥ శ॥ ఎలకూచి బాల సరస్వతి జటప్రోలు సంస్థాన కవి "బాల సరస్వతీ యమను" వ్యాకరణ గ్రంధం రచించాడు.

16 వ॥ శ॥ దుర్గావతి చందేల్ లోని మహోబా రాజా కూతురు యీమె రూప సౌందర్యాదులు విని దలపతి సాహీ యీమెను వివాహమాడ గోరుతాడు. కానీ యీమె తండ్రి నిరాకరించగా దలపతి సాహు సైన్యముతోవచ్చి మహోబా రాజును ఓడించి దుర్గావతిని వివాహము చేసుకొని 4 సం॥ రాలు మాత్రమే ఉండి చనిపోతాడు వీరికి 3 సం॥ రాల కుమారుడు ఉంటాడు రాజ్య పాలనను దుర్గావతి అతి సమర్ధవంతంగా పాలించి ప్రజలను సుఖ సౌభాగ్యవంతులనుగా చేస్తుంది యీ సమాచారం, ఢిల్లీ పాలకుడైన అక్బర్ విని 18 వేల సైన్యముతో అసఫ్ఖానును యుద్ధానికి పంపుతాడు తొలినాటి యుద్ధంలో దుర్గావతిదే పై చేయి అవుతుంది. రెండవదినం, ఏనుగు పై నుంచీ యుద్ధం చేస్తున్న రాణీకి బాణాలు తగిలి నీరసావస్థలో వుండగా సైన్యం రాణీ అవస్థనుచూచి పారిపోవటం ప్రారంభస్తాయి రాణీ చేసేదిలేక అంకుశంతీసుకొని ప్రాణత్యాగం చేస్తుంది.

16 వ॥ శ॥ మల్కిభరాము 1580 లో యితను మరణించాడు. ప్రథమంలో యితని అన్నఅయిన జంషీడ్ కుతుబ్ షాకు భయపడి విజయ నగర అళియ రామరాజును ఆశ్రయించాడు. యితని మొదటిపేరు "ఇబ్రిహీంకుతుబ్ షా" యిభరాము మల్కిభరాము అను పేరులు తదనంతరం వచ్చినవే యితని ఆస్థానంలో అద్దంకి గంగాధరకవి "తపతీసం వరణో

పాఖ్యానము" రచించి ఇబ్రహీంకు అంకితమిచ్చాడు" కందుకూరి రుద్రకవి యితని ఆస్థానంలో వుండి "నిరంకుశోపాఖ్యానము "సుగ్రీవ విజయము" అను గ్రంథాలను రచించాడు.

1600–60 క్షేత్రయ్య కాలం కృష్ణాజిల్లా మువ్వగ్రామం యితని జన్మస్థలం, సంస్కృతాంధ్ర భాషా పండితుడు. కవి సంగీత నాట్యకళావిశారదుడు.

1600 శంకర మిశ్రుడు వైశేషిక సూత్రాలకు "ఉపస్కార వైశేషికం" అను గ్రంథాన్ని రచించాడు.

16 వ|| శ|| పొన్నగంటి తెలగనార్యుడు యితను ప్రప్రథమంగా అచ్చ తెనుగులో "యయాతి చరిత్ర"ను రచించాడు. ఇబ్రహీం సరదారుడైన అమీర్‌ఖాను పోషణలో వుండినట్లు చెప్పుకున్నాడు. గోలకొండ నివాసస్థుడు మదన గోపాలమూర్తి స్వామి భక్తుడు.

16 వ|| శ|| లో అచ్చు పద్ధతిని ఇంగ్లండులో కాక్‌స్టన్ అనునతను కనిపెట్టాడు. చైనా వారు పూర్వమే కనిపెట్టినారు అని చెప్పబడుతూ వున్నప్పటికీ కాక్‌స్టన్, కనిపెట్టినదే ప్రసిద్ధం.

1600–50 ప్రాంతం, రాజవాహనవిజయ కర్త కాలమని చెప్పబడుతూ వుంది.

16 వ|| శ|| పింగళి సూరన్న ప్రభావతీ ప్రద్యుమ్నను వగైరా గ్రంథాలు రచించాడు.

1600 నుంచీ 1750 వరకు ముస్లిముల దాడులు ఎక్కువయి కర్నూలు కడప గుంటూరు నవాబులేర్పడి ఉత్తర సర్కారులుకూడా వారి వశమై దుష్టరిపాలనకు గురి అయ్యారు.

1650–50 యీ ప్రాంతంలో పొగాకు పోర్చుగీసువారి ద్వారా ప్రవేశ పెట్టబడినది.

1600–1700 మధ్య, గువ్వలచెన్నని కాలం గొల్ల కులస్తుడు నేటికీ ప్రసిద్ధిలో నున్న "గువ్వల చెన్నా" శతకాన్ని రచించినవాడు.

1600 వరకు ఆంధ్ర దేశంలో ఒక గోలకొండ సుల్తానులు తప్ప ముసల్మానులింకెవ్వరూ రాజ్యము చేయలేదు.

1600 పూర్వము భారత దేశంలో మిరియాలు ఎక్కువ వాడకములో నుండెడివి. యివి మళయాలమంతా సమృద్ధిగా పండెడివి ఆ తర్వాతనే దక్షిణ అమెరికానుంచీ మెరపకాయలు రవాణా అయినవి మిరియం శబ్దంనుంచీ, మెరపకాయ శబ్దోత్పత్తి జరిగిందని విజ్ఞుల అభిప్రాయం.

1600 పాలనే కరికదిరీపతి 'శుకసప్తతి' గ్రంధాన్ని రచించినవాడు 1630 అని కొందరి అభిప్రాయం.

1600 పిడుపర్తి సోమనాథుని కాలం.

1600 ప్రాంతం వేణుగోపాల శతక కారుని కాలం.

1600 విజ్ఞానభిక్షువు, విజ్ఞానామృతము "సాంఖ్య ప్రవచన సూత్రానికి" సాంఖ్య ప్రవచన భాష్యము" రచించాడు.

16 వ॥ శ॥ మహాదేవుడు "సాంఖ్య సూత్రవృత్తి" గ్రంథకర్త కాలం

16 వ॥ శ॥ లో జగధీశుడు జీవించాడు.

16 వ॥ శ॥ జీవగోస్వామి జీవించాడు.

16 వ॥ శ॥ యూరప్‌లో క్రీ॥ శ॥ మొదటి మూడు శతాబ్దులు గడచిపోయిన అనంతరం, విజ్ఞానం శిల్పకళ వగైరాలంతా నశించి పోయాయి తరువాత 16 వ॥ శతాబ్దములోనే తిరిగీ పునర్వికాసం కల్గింది దీనినే యూరప్ చరిత్రలో "రినైసెన్సు" అంటారు.

1601–1645 వరకు నూర్జహాన్ యీమె తండ్రి మిర్జాగియాస్ బేగ్ తెహరాన్ నుంచి భారత దేశానికి వలస వస్తున్న సందర్భములో గయాస్ బేగ్ భార్య ఒక ఆడ శిశువునుకని చనిపోగా ఆశిశువును "మెహరున్నిసా" పేరుపెట్టి గయాస్ బేగ్ పెంచి శేర్ అఫిగన్ అను నతనికిచ్చి పెండ్లి చేశాడు. జహంగీర్ 1605 లో సింహాసనాన్ని అధిష్ఠించిన వెంటనే శేర్ అఫ్గన్‌ను చంపించి మెహరున్నిసాను తెచ్చి వివాహం చేసుకొని నూర్జహాన్ అని నామకరణం చేశాడు. యీమె భర్తను పరిపాలన యందు చేదోడు వాదోడుగా ఉండినది. జహంగీర్‌ను శాహజహాం ఖైదు చేసినపుడు

యీామె చాకచక్యంవల్ల భర్తను ఖైదునుంచి విడిపిస్తుంది యీామె విలాస జీవిత ఫలితంగా, అనేకములైన నూతన వస్త్రాభరణాదులు అమలులోకి వచ్చాయి కొన్ని నూతన సుగంధ తైలాలను అవిష్కరించింది. యీామె ప్రజలయెడ సహృదయతతో ప్రవర్తించి ప్రజల ఆదరాభిమానాలను చూరగొనింది.

1605 అక్టోబర్ 12 వ తేదీన ఆగ్రాకోటలో జహంగీర్‌కు పట్టాభిషేకం జరిగింది. యింతకుముందు యితను సలీమ్ అని పిలువబడేవాడు అక్బర్ కుమారుడు యితని తల్లి జయపురపు రాజపుత్రస్త్రీ సురియను యితను తన తండ్రి మిత్రుడైన అబుల్ ఫజల్‌కు విషమిచ్చి చంపాడు. జోధబాయిని వివాహమాడాడు. యితనుకూడా దురాచారి, విలాస పురుషుడుగానే చెలామణి అయ్యాడు. యితనికి 38 వ ఏట పట్టాభిషేకం జరిగింది. యితను కొన్ని పన్నులు తొలగించాడు. బావులు, సత్రాలు. వసైగాలను కట్టించాడు. యితని పరిపాలన 1627 వరకు జరిగింది.

1606 మధురనాయక రాజులకాలంలో క్రైస్తవమత ప్రచారకుడైయిన రాబర్ట్. డి. నోబిలి అనే ఫాదరి తెనుగు నేర్చి తెనుగు భాషకు వ్యాకరణంకూడా రచించాడని చెప్పబడుతూ వుంది. కానీ యిది కానరాదు.

1608 మధుసూదన సరస్వతి "యద్వైత సిద్ధి" గ్రంథాన్ని రచించాడు

1610–20 ప్రాంతం ప్రతాపసింహుడు యితను చిత్తూరు రాణా ఉదయసింహుని పుత్రుడు. అంబరదేశాధీశుడు. జహాంగీర్ బావమరది అయిన మానసింహుడు ఢిల్లీకి పోతూన్న సందర్భంలో ప్రతాపుడు మానసింహుని ఆహ్వానించి గౌరవిస్తాడు. కానీ భోజనసమయంలో ప్రతాపుడు మానసింహుని సహపంక్తికి వెల్లడు. కారణం అడుగగా "రాజపుత్రులుగా వుండి తమ చెల్లెండ్ర కూతుండ్రి ముస్లింలకిచ్చి వివాహం చేసేవారితో కలిసి సూర్యావంశరాజులము సహపంక్తినభోజనం చేయము" అని ప్రతాపుడు జవాబిస్తాడు. మానసింహుడు ఢిల్లీ వెల్లి అక్బరుతో ప్రతాపుని గురించి చాడీలుచెప్పి ప్రతాపునిపైకి దాడి చేస్తాడు. జీవిత పర్యంతం యుద్ధం చేస్తూనే ఆఖరి క్షణంవరకు తనస్వాతంత్ర్యాన్ని రక్షించుకుంటూ మరణిస్తాడు.

1611 లో ఇంగ్లీషువారు మచిలీ బందరులో ఒక ఫాక్టరీని స్థాపించారు 1616 లో పశ్చిమ తీరంలోని సూరతును ఆక్రమించారు.

1611–58 అబ్దుల్లా హుసేన్, యితను మహమ్మద్ కుతుబ్‌షా కుమారుడు. యితని కాలానికల్లా దాదాపు ఆంధ్ర ప్రాంతమంతా గోల్కొండ నవాబుల స్వాధీనంలోకి వచ్చింది చంద్రగిరిలో నామావ శిష్టంగావున్న విజయనగర రాజులనుకూడా నవాబులు జయించారు.

1614 నుండి 46 వరకు చంద్రగిరి రాజధానిగా మూడవ శ్రీరంగ రాయలు పరిపాలించాడు. యితను మహమ్మదీయ దండయాత్రలకు భయ పడి మైసూరు రాజు శరణు జొచ్చాడు. యితనితో విజయనగర సామ్రాజ్యావశేషం పూర్తిగా అస్తమించిందని చెప్పవచ్చు

1614 రామభద్రాంబ యీమె రఘునాథరాయల భార్యఅని కొందరు కాముగణిక (వేశ్య) మాత్రమేనని కొందరు అంటారు. "రఘు నాథాభ్యుదయం" అనేపేరుతో రఘునాథరాయలకీర్తిని విజయాలను కొనియాడింది. యీమె అష్టభాషా ప్రవీణురాలు అని చెప్పబడుతూ వుంది. కానీ యీమె తెలుగు రచనలు యింతవరకు బయల్పడలేదు. రఘు నాథాభ్యుదయం చారిత్రకంగా విలువైన గ్రంథం.

1614–33 రఘునాథరాయల కాలం యితను తంజావూరులో నుండి ఆంధ్రుల గొప్పదనాన్ని మరి కొంతకాలం కాపాడాడు. మహమ్మదీయుల అక్రమాలను కొంతవరకు అరికట్టగల్గాడు. విజయనగర సామ్రాజ్యాన్ని పాలిస్తున్న వెంకటపతి నాయకునికి గోలకొండ నవాబుతో యుద్ధం తట స్థించగా రఘునాథరాయులు సహాయం చేసి గోలకొండ సైన్యాలను ఓడించారు తుందిర మండలాధిపతియైన కృష్ణప్పను చెరనుంచి విడిపించి అతని సోదరిని వివాహమాడాడు. చోర నాయకుడైన చోళగుని శిక్షించాడు. చంద్రగిరి రాజ్యాన్ని ఆక్రమించిన జగ్గరాజును ఓడించి రామరాయలను సింహాసనం ఎక్కించాడు. పోర్చుగీసు వారిబారినుండి నేపాళరాజును రక్షించాడు. వగైరా విషయాలన్నీ రఘునాథ విజయంద్వారా తెలియ వస్తున్నవి. యితను అచ్యుతనాయని కుమారుడు.

1615 ఇంగ్లండు రాజైన జేమ్సు రాయబారి సర్ థామస్‌రో, జహం గీరు ఆస్థానంలో ప్రవేశించి ఫాక్టరీలు నిర్మించుకొనేందుకు అనుమతిని పొందాడు. ఫలితంగా సూరత్‌లో ఒక ఫాక్టరీ నిర్మింపబడింది.

1620 నుంచి 1838 కందనవోలు (కర్నూలు) మొత్తం 218 ఏండ్లు మూడు తెగలుగా మహమ్మదీయులక్రిందా వారి సర్దారుల క్రింద స్వతంత్రులైన నవాబులులచేతా పాలించబడింది.

1620 ప్రాంతంలో విజయనగర సామ్రాజ్యము రూపు మాసెను.

1623–59 తిరుమల నాయకుడు మధుర రాజు లింగన మఖి కామేశ్వరకవి యితని ఆస్థాన పండితుడు. "సత్యభామా సాంత్వనము" రుక్మిణీ పరిణయము" వగైరాలను రచించాడు.

1627 లో జహంగీర్ మరణం. యితను కాశ్మీరు నుంచి ఢిల్లీ వస్తూ దారిలోనే చనిపోయాడు. కానీ యీవార్తను నూర్జహాను లాహోరు వచ్చేంత వరకు బయటికి పొక్కకుండాఉంచి లాహోర్ వస్తూనే, శహర్ యార్‌ను సామ్రాట్‌గా ప్రకటించింది. కానీ ఆసఫీలాహోర్ పైన దాడి చేసి రెండు కండ్లు పెరికించాడు 1632 ఫిబ్రవరి ఆరవ తేదీన ఖుర్రమ్‌లాహోర్ పై దాడిచేసి ఆసఫీను ఓడించి సింహాసనాన్ని ఆక్రమించాడు.

1627 లో ఛత్రపతి శివాజీ జననం.

1629 ప్రాంతంలో హైదరాబాదు రాష్ట్రంలో ఘోరక్షామం ఏర్పడింది. యీక్షామంలో ఒక రొట్టెకు ఒక మనిషి చొప్పున అమ్ముడు పోయారని లోకోక్తి.

1630 శ్రీ వీరరాఘవ కవి యితనికి "చిత్ర విచిత్ర పవిత్రాభినీతీనానావిధాన కథా లాఘవ" అను బిరుదుకూడా వుంది. జటిలమైన మధురవాణీ విజయాన్ని రచించాడు. యితని వంశంలో 8 తరముల వెనుకటివాడైన, ఎల్లయ కవి వింధ్య వాసినీ దేవతతోతన వంశంలో 10 తరముల వరకు కవిత్వ సాంప్రదాయమందు నటుల వరాన్ని పొందాడని చెప్పబడింది.

1632–60 ప్రాంతం శాహజహాన్ కాలం. ప్రతిభావంతుడైన శాహజహాన్ (యితని మొదటి పేరు ఖుర్రమ్) 1632 ఫిబ్రవరి 6 వ తేదీన అసమర్థుడైన సహర్‌యార్‌ను తొలగించి సింహాసనాన్ని అధిష్టించాడు. యితని పరిపాలనలో ప్రజల సౌకర్యం విస్మరించబడింది. ముస్లిం మతాభి మానిగా ప్రవర్తించాడు, కానీ యితను నిర్మింపించిన కళా ఖండాలు ప్రపంచములో ఏసామ్రాట్ కూడా నిర్మించలేదు మోతీ

మసీదు ముసమ్మన్ బుర్జు జామా మసీదు (ఢిల్లీ) ఎర్రకోట దివాన్ ఆమ్ వగైరాలే కాకుండ యితని భార్య స్మృతి చిహ్నంగా నిర్మించిన తాజ్ మహల్ (ఆగ్రా) లోక ప్రసిద్ధము యితని మయూర సింహాసనం మరొక అపూర్వ సృష్టి. యీ విధంగా కళా సృష్టికి ధనం వెచ్చించి నప్పటికీ యితని అంతిమ కాలానికి ప్రపంచ చరిత్రలో ఏ సామ్రాట్ కూడా నిల్వ చేయని ధన సంపత్తి నిల్వ చేశాడు.

1631 ప్రాంతంలో చంద్రగిరిలో (విజయనగర) సంస్థానాధిపతి అయిన శ్రీ రంగరాయుడు పాలిస్తూవుండగా "డే" అను ఇంగ్లీషు దొర సముద్రతీరమందు ఒక రేవును కట్టించవలెనని శ్రీ రంగరాయలకను అడిగి యీ ప్రాంతపు జమిందారయిన దామెర్ల వెంకటాద్రినాయుని పేరుతో సన్నదు (అనుజ్ఞా) పుచ్చుకొన్నాడు. శ్రీ రంగరాయుడు యీ రేవుకు తన పేరు వుంచమని చెప్పినప్పటికీ వెంకటాద్రినాయుడు "డే" తో తన కున్న పూర్వ పరిచయాన్ని పురస్కరించుకొని తన తండ్రియైన చెన్నపనాయుని పేరుతో చెన్నపట్టణము అని పేరు పెట్టాడు. కాబట్టి చెన్నపట్టణము అనే పేరు స్థిరపడిపోయింది.

1632 లో ఇంగ్లీషు వారికి బందరులో వర్తక అనుమతి యివ్వబడింది

1632–1704 మధ్య కాలంలో "లాక్" తత్వశాస్త్రవేత్త జీవించాడు.

1633–73 రంగీలా రాజగు విజయరాఘవ నాయకుని కాలం యితను జపించిన తులసి తీర్థాన్ని తురక సైన్యంపై చల్లితే వారు భస్మమై పోతారు అని సైన్యానికి బదులుగా తులసి తీర్థాన్ని యుద్ధ భూమికి పంపించాడు కానీ తులసి తీర్థము యితనిని కాపాడేందుకు బదులు ఎదురుతిరిగీ యితనినే సర్వ నాశనం చేసి వేసింది. పరిపాలనయందు అసమర్థుడైనప్పటికీ సంగీత సాహిత్య ప్రియుడు.

1638 బవాజ్ దాసనైన. యితను కొండ కుందాచార్యుల "భాషా సారాన్ని" నాటక రూపంలో తయారు చేశాడు.

1635 జగదీశుడు వైశేషిక సిద్ధాంతాలను తెలియజేసే "తర్కామృతము" వగైరా గ్రంథాలను రచించాడు. శాహజహాన్ ప్రధాన సేనాపతి యితని పరాక్రమం ఔరంగజేబుకు కంటకంగా తయారగవుతుంది. అదను

చూచి జసవంతుని కుమారుడైన పృథ్వీసింహుని మోసంతో ఔరంగజేబు చంపిస్తాడు. మిగతా యిద్దరు పుత్రులు కాబూలు యుద్ధంలో చనిపోతారు. పుత్రిశోకంతో కుములుతున్న జసవంతుని ఔరంగజేబు విష ప్రియోగం చేసి చంపిస్తాడు.

1642 జసవంతసింహుడు జోధపురవు రాజా యితను కృష్ణమిశ్రిని ప్రిబోధ చంద్రోదయం అను నాటకాన్ని సంస్కృతంలోనుంచీ హిందీ లోకి అనువాదం చేశాడు ఇతను

1642–1727 ఐ జేక్ న్యూటన్ కాలము యితను గురుత్వాకర్షణ ప్రియోగముల కర్త,

1644 పెమ్మసాని తిమ్మనాయుడు శా॥ శ॥ 15 66లో బుక్క పట్నం తాతాచార్యుల వారికి గండికోటను దానశాసనం వ్రాసియిచ్చాడు.

1650 సేవాజ పండితుడు. ఛత్రసాల రాజా ఆస్థాన పండితుడు శకుంతల సంస్కృత నాటక కావ్యాన్ని హిందీలోకి అనువదించాడు.

1650–70 మధ్యవాడు వెంకటాధ్వరి కవి విశ్వగుణాదర్శము అను గ్రంథాన్ని రచించాడు.

1651 నుంచీ 1875 వరకు ఆంధ్ర సాహిత్యరంగలో శతక (గేయు) యుగమని చెప్పవచ్చు.

1652 లో గోల్కొండ మంత్రియగు మీర్ జుమ్లా గండికోటను పోర్చుగీసువారి సహాయంతో ఆక్రిమించి కోటలోనివారిని నిర్బంధించి కోట లోని రాగి కంచు విగ్రహాలను కొనిపోయి 20 ఫిరంగులు చేయించాడు.

1656 మాదన్న ముజఫర్ వద్ద కార్యదర్శిగా వుండి గోల్కొండ రాజ్యకాలంలో మాదన్నే మొదటిసారిగా మంత్రిపదవికి నియుక్తుడైన హిందువు యితను 1674–76–78 లలో కర్నాటక ప్రాంతము మద్రాసు వగైరాలు పర్యటించాడు. 1677 లో 20 వేల సైన్యముతో మాదన్న బీజాపూర్ ఆదిల్ షా తరపున బహదూర్ షాతో పోరాడుటకు వెళ్లి వాపసు వచ్చాడు.

1656 అప్ప కవి "చింతామణి" అను సంస్కృత వ్యాకరణాన్ని రెండు పరిచ్ఛేదములు (మాత్రిము) తెనిగించాడు.

1659 జూన్ 5 వ తేది ఔరంగజేబు సింహాసనాన్ని అధిష్టించాడు యితను పూర్తిగా ముస్లిం మతాభిమాని అయి హిందూ మతాన్ని ద్వేషించిన ఫలితంగా యితని పరిపాలన చాలా ఒడుదుడుకులకు లోనుగావాల్సి వచ్చింది సాజహానుకు దారా ఔరంగజేబు మురాదు సూజా నలుగురు పుత్రులలో పెద్దవాడైన దారా సింహాసనాన్నధిష్టించాల్సి వుంది యితను హిందూ మతాభిమాని కానీ ఔరంగజేబు రాజ్యకాంక్షతో మాయోపాయులద్వారా మురాదు సూజాలను సంహరించి సాజహాన్‌ను ఖైదుచేసి సింహాసనాన్నధిష్టించాడు.

1661 బొంబాయి ఇంగ్లీషువారి క్రిందికి వచ్చింది. (పోర్చుగీసువారు కట్నంగా రెండవ ఛార్లెస్ రాజుకు యిచ్చారు.)

1666 లో ఔరంగజేబు శివాజీని ఖైదుచేశాడు.

1667 లో ఔరంగజేబు సైన్యాధికారి సర్దార్ సయ్యద్ అబ్దుల్ నఫీ అనునతను మధురలో భవనాలు పడకొట్టించటము మందిరాలను ధ్వంసం చేసి వాటి స్థానంలో మశీదులు నిర్మాణం చేయటం వగైరా అమానుష కార్యాలకు జాటులు తిరుగుబాటుచేసి తిలపల్ జమీందారు గోకుల జాట్ నాయకత్వాన పోరాడారు కానీ త్వరలోనే యీతిరుగుబాటు అణచివేయబడింది. అయినప్పటికీ జాటుల అసంతృప్తి జ్వాలలు ఔరంగజేబు ఆఖరి గడియవరకు ఉంటూనే వచ్చాయి.

1670 బిజాపూరు సుల్తానులు కర్నూలును పాలించుచున్న సమయంలో రెండవ సుల్తాన్ అయిన మల్లిక్ సాహెబ్ కాలంలో, బిజ్జల కొండా రెడ్డి, అను స్వతంత్రవీరపురుషుని ఖైదీగా పట్టుకొని కోటకు పడమటనున్న బురుజులో బంధించారు, ఉద్దండుడైన కొండారెడ్డి సొరంగ మార్గమున తప్పించుకొని పారిపోయాడు. యీబురుజునే కొండారెడ్డి బురుజు అని (నేడు) వ్యవహరిస్తారు.

1671 లో ఔరంగజేబు పరిపాలనపైన అసంతృప్తులైన ఉత్తర సరిహద్దుల్లోనున్న, అఫిరీదీలు తిరుగుబాటు చేశారు. ఔరంగజేబు సేనానిమీర్ జుమలా. యీవిద్రోహాన్ని అణచేందుకు పోయి వారి చేతుల్లో ఓడిపోయాడు. ముస్లిమ్ సైనికుల్ని అఫీరదలు బందీలనుగా తీసుకెళ్లి మధ్యాశియాలో బానిసలనుగా అమ్మివేశారు.

1672 లో నారనౌల్ ప్రాంతంలోని సతనామీ అనే బ్రాహ్మణ సాంప్రదాయకులు ఔరంగజేబుపై తిరుగుబాటు లేవదీశారు ముస్లిం సైనికుడు ఒక సతనామీ రైతును అవమానించిన కారణంగా యీ తిరుగుబాటు చేయబడింది. ఔరంగజేబు యీ తిరుగుబాటును అణచెందుకు సైన్యాలను పంపాడు. ప్రారంభంలో సతినామీలకే విజయం లభించినట్లు అగుపించినా ఆఖరుకు మొగల్ సైన్యం యీ తిరుగుబాటును అణచివేసింది.

1672 లో గోల్కొండ నవాబు అబ్దుల్లాకుతుబ్ షా మరణం తర్వాత మూడవ అల్లుడగ తానీషా రాజ్యానికి వచ్చాడు.

1672 ఏప్రిల్ 29 వ తేది అబ్దుల్ హసన్, తానాషా సింహాసనాన్ని అధిష్టించాడు. యితను సిద్దిపేట తాలూకా అనంతగిరిలో దూదేకులవాని కొడుకనియు యితని చిన్నతనమున అచటి బ్రాహ్మణోత్తములగు అక్కన్న మాదన్నలు ఇతనిని పెంచిరనియు దైవికముగా అబ్దుల్లా కుతుబ్ షా బాదుసా బీబీని కూతురును వివాహమాడి సింహాసనాధిష్టుడైన అనంతరం తనను పెంచి పోషించిన అక్కన్న మాదన్నలను తనకు మంత్రులుగా చేసికొనెనని చెప్పబడుచున్నది.

1672–87 బిజ్జల తిమ్మభూపాలుడు అలంపూర్ ను పాలించాడు. తానీషా సమకాలికుడు యితను గొప్ప విద్వాంసుడుకూడా వీరు శైవులు కానీ కాలాంతరంలో వైష్ణవులయ్యారు.

1672–1704 చిక్కదేవరాయలు మైసూరును పరిపాలించిన కాలం

1673 లో తంజావూరు రాజ్యం అంతరించి మహారాష్ట్రుల పరిపాలన ప్రారంభమయింది.

1674 విజయరాఘవరాయలు తంజావూరును పాలించిన ఆంధ్ర రాజులలో కడపటివాడు మధుర చొక్కనాథునితో జరిగిన యుద్ధంలో యితను మరణించాడు.

1675 తేగ్ బహద్దూర్ సిఖ్ఖుల తొమ్మిదవ గురువు యితని తండ్రి హరగోవింద 7 వ గురువు తేగ్ బహద్దూర్ ను ఔరంగజేబు ఢిల్లీ పట్టుకపోయి ముస్లిం మతములో చేరేందుకు నిర్బంధించాడు కానీ తేగ్ అంగీకరించలేదు తేగ్ ఒకచీటి మెడలోకట్టుకొని ఔరంగజేబుతో నాతల నరికినప్పటికీ యీ

చీటీలో వ్రాసిన మంత్రప్రభావంవల్ల తిరిగీ తల శరీరానికి అంటుకుంటుంది అని చెప్పాడు. ఔరంగజీబు తేజ్ శిరస్సు నరకమని అజ్ఞాపించాడు. కానీ శిరస్సు మొండెముతో పునర్మిలనం కాలేదు మెడలోని చీటీ విప్పి చూడగా, అందులో శిరస్సును యిచ్చానేగానీ మనస్సును యివ్వలేదు అని వ్రాసివుంది.

1676 ఎక్కోజీ యితను మహారాష్ట్రనాయకుడైన శివాజీ సోదరుడు 1674 లో తంజావూరును పాలిస్తున్న విజయరాఘవరాయలు చనిపోగా, రెండేండ్ల అనంతరం యీ ఎక్కోజీ తంజావూరును స్వాధీనం చేసుకొని తెలుగు దేశాన్ని పరిపాలించాడు. వీరి పాలన ఒక శతాబ్దం (దాదాపు) వరకు కొనసాగింది.

1679–1726 మధ్యకాలం అనాధ దాస పండితుడు యితను ప్రబోధ చంద్రోదయం అను సంస్కృత నాటకాన్ని వ్రజ భాషలో గద్యపద్యాత్మకంగా రచించాడు.

1680 సర్వాయి పాపన్న ఔరంగజీబు కాలంలో కల్లు గీసి జీవించాడు. అయినా ముస్లిం సర్దారుల అకృత్యాలను ఎదిరించి ప్రజలకొరకు పాటుపడి మహావీరుడుగా చరిత్రలో ప్రసిద్ధి కెక్కాడు.

1580 అక్టోబరు 3 వ తే॥ హైదరాలీపై యుద్ధానికి విశాకపట్నం నుండి నాలుగు సైనిక పటాలాలు కదలాలని అజ్ఞఇవ్వగా సైనికులు హైదరాలీపై యుద్ధం చెయ్యమని తిరుగుబాటుచేసి బ్రిటీష్ ఆఫీసర్లందరినీ చంపి సైనిక గవర్నర్ల యిల్లు దోచుకొని పారిపోయారు. మరునాడు బ్రిటీష్ ఆఫీసర్లు అదనపు సైన్యముతో యీ సైనికుల వెంటాడి కొందరిని కాల్చివేసి మిగతావారిని ఖైదీలనుగా పట్టుకొన్నారు.

1680 శివాజీ నిర్యాణం.

1684–1712 శహాజీ యితను తంజావూరును పాలించిన మహారాష్ట్ర రాజు బహు భాషా పండితుడు యితను తంజావూరులో సరస్వతీ మహల్ ను నిర్మించి అమూల్యములైన ప్రాచీన తాళ పత్ర గ్రంథాలను పదిలపరచాడు.

1685 సోమభూపాలుడను నతను గద్వాలును పరిపాలించాడు. యీ కాలం కర్నూలులోని బిజాపూర్ సుల్తానుల పతన కాలం.

1686 లో ఔరంగజీబు గోలుకొండను స్వాధీనపరచుకొన్నాడు.

ప్రిధమంలో తానీషా సంధికి ప్రయత్నంచేశాడు కానీ ఔరంగజీబు సంధికి ఒప్పుకొనకపోగా యుద్ధం జరిగింది. యీ ముట్టడి 7 నెలలు జరిగి చివరకు కోటలోని దేశద్రోహులవలన ఔరంగజీబుకు గోలుకొండ స్వాదీనమయింది తానీషా ఖైదుచేయబడి దేవగిరిదుర్గంలో మరణించాడు.

1687 గోల్కొండ పతనంతో ఔరంగజీబు దక్కను జయించినట్లే అయింది.

1688 లో మద్రాసులో యీస్టిండియా కంపెనివారు కోట నిర్మాణం పూర్తిచేశారు.

1690 లో కలకత్తా నగర నిర్మాణం జరిగింది.

1690 ఔరంగజీబు కర్నాట విజయం యీ విజయంలో ఔరంగజీబుకు సాయంచేసిన దావూదుఖాను అను పఠాను సర్దారుకు కర్నూలు ప్రాంతాన్ని జాగీరుగా యివ్వటం జరిగింది.

1690 ఔరంగజీబు, సర్దారు మహమ్మదు జాఫరుషా బీ. పులివెందుల కోటను స్వాధీనంచేసుకొన్నాడు. యింతకుమునుపు వేముల పాళెగాండ్రి స్వాదీనంలో యీ కోటవున్నట్లు పులివెందులలో ఒక శాసనంద్వారా తెలుయుచున్నది.

1694–1778 వోల్టేర్, అను జర్మను తత్వశాస్త్రవేత్త కాలం.

1695 సీమియన్ మేక్రి అను పేరుగల రష్యా వ్యాపారస్థుడు. ఔరంగజీబు దర్బారులో హాజరయ్యాడు,

1698–1730 వీరరాజు, (యితను దళవాయి దొడ్డరాజు కుమారుడు) మైసూరును పాలించిన చిక్కదేవరాయలకు దళవాయిగా పనిచేశాడు. అనంతరం హోసూరు తాలూకా దక్షిణప్రాంతాన్నికూడా కొంతకాలం పాలించాడు యితని తండ్రి జ్ఞాపక చిహ్నంగా "తొర్రపల్లె" గ్రామానికి దొడ్డరాయ సముద్రమని నామకరణంచేసి బ్రాహ్మణులకు దానంచేశాడు.

17 వ|| శ|| గుణప వరపు వెంకటకవి తంజావూరు నివాసి "సర్వ లక్షణ శిరోమణి" అను ఛందో గ్రంథాన్ని రచించాడు.

1700 ప్రాంతంలో వేమన పుట్టాడని 1750 ప్రాంతంలో చనిపోయాడని కొందరి అభిప్రాయం.

17 వ॥ శ॥ శ్రీనారాయణ తీర్థులు కృష్ణ భక్తుడు శ్రీకృష్ణావతార ఘట్టము మొదలుకొని రుక్మిణీ కల్యాణం వరకు గద్యశ్లోక గేయాత్మకముగా "శ్రీకృష్ణలీలా తరంగిణి"యను గేయ కావ్యాన్ని రచించాడు. యితను గోదావరీ తీర కూచిమంచి గ్రామస్థుడు శివరామా నందులకు శిష్యుడై సన్యసించి తీర్థనారాయణయతిగా తీర్థయాత్రలను సేవిస్తూ తుదకు తంజావూరు జిల్లా వరహూరు చేరి అక్కడే సమాధి అయ్యాడు.

17 వ॥ శతాబ్దారంభం జగదీశుడు నవద్వీప నివాసి న్యాయశాస్త్ర పండితుడు యితను పదునెనిమిదిదేండ్ల వరకు విద్యావిహీనుడుగా వుండి తదనంతరం ఒక సన్యాసి కృపవల్ల విద్యావంతుడై న్యాయశాస్త్ర సంబంధమైన 15 ఉపగ్రంథాలను రచించాడు.

1700 తారాబాయి శివాజీ పుత్రుడైన రాజారామ్ భార్య. యీమె (1700లో) భర్త మరణించగా సింహగఢ్‌పైన ఔరంగజీబు దాడిచేశాడు. తారాబాయి వీరసైనికుని వేషం ధరించి మూడు సం॥ రాలు ఔరంగజీబు సైన్యాలతో యుద్ధం చేసింది. తదనంతరం సింహగఢ్ ఔరంగజీబు వశమయింది. కానీ అక్కడనుండి ఔరంగజీబు వెల్లగానే తారాబాయి తిరిగీ సింహగఢ్‌ను స్వాదీనం చేసుకుంది.

17 వ॥ శ॥ నాగోజిభట్టు కాశీనివాసి యితనితండ్రి శివభట్టు శృంగబేరపురపు రాజారామసింహుని ఆశ్రితుడు చాలాగ్రంథాలు రచించాడు. "పరిభాషేందుశేఖర" లఘుశబ్దేందుశేఖర" వృహత్ మంజూష" లఘు మంజూష" వగైరా వ్యాకరణ గ్రంథాలు 12 వ్రాశాడు. యింకా చాలా గ్రంథాలకు టీకా వ్రాశాడు.

17 వ॥ శ॥ అప్పకవి తెలంగాణా నివాసి అప్పకవీయము వగైరాల రచయిత.

17 వ॥ శ॥ పొత్తపి వెంకటరమణకవి పొత్తపి నివాసి "లక్షణశిరోమణి" అను ఛందో గ్రంథాన్ని రచించాడు.

1700 యీ ప్రాంతపువాడు భాస్కర శతక కారుడు భాస్కర శతకము జంట కవులు రచించారని కొందరు విమర్శకుల అభిప్రాయం.

17 వ॥ శ॥ ఖండదేవుడు భాట్టదీపిక గ్రంథాన్ని రచించాడు.

17 వ॥ శ॥ అపదేవుడు "న్యాయప్రకాశము" లేక "అపదేవీయము" అను గ్రంథాన్ని రచించాడు.

17 వ॥ శ॥ జయనారాయణుడు వైశేషిక సిద్ధాంతాలను విపులీకరిస్తూ గ్రంథాలు వ్రాశాడు.

17 వ॥ శ॥ విశ్వనాథుడు, భాషాపరిచ్ఛేదము సిద్ధాంత ముక్తావలి వగైరా కణాదుని వైశేషికవాదాన్ని తెలియజేసే గ్రంథాలు రచించాడు.

17 వ॥ శ॥ అన్నంభట్టు, ఆంధ్రబ్రాహ్మణుడు వైశేషిక సిద్ధాంతాలను విపులీకరించాడు.

17 వ॥ శ॥ లో గదాధరుడు, నివసించాడు.

17 వ॥ శ॥ పైడిపాటి లక్ష్మణ కవి యితను ఆంధ్రనామసంగ్రహ కర్త, కానీ యితనికాలం సరిగా తెలియరావటంలేదు. 1780 తర్వాతివాడయిన అడిదము సూరకవి తన ఆంధ్రనామ శేషములో ఆంధ్రనామసంగ్రహాన్ని పేర్కొనడాన్నిబట్టి సూరకవికంటే లక్ష్మణకవి ముందువాడుగా చెప్పవచ్చు.

1701 నుంచీ 1900 వరకు ఉత్తర హిందూదేశపు (హిందీ) సాహిత్యరంగంలో "రీతి" కాలం అని చెప్పబడుతూవుంది.

1704 జాఫర్‌ఖాన్ యితని రెండవపేరు మూర్షిద్ కులీఖాన్. ఢిల్లీ పాదుషా. ఆలమ్‌గీర్ యితనిని బెంగాలు నవాబుగా చేశాడు. యితను తన పేరుతో మూర్షిదాబాద్ నగరాన్ని నిర్మించాడు.

1706—32 విజయరంగ చొక్కనాథుడు మధుర పరిపాలకుడు. యితని ఆస్థానపండితులైన సముఖము వేంకటకృష్ణప్ప "అహల్యాసంక్రందనము" "రాధికాసాంత్వనము" రచించాడు. శేషంవెంకటపతి "తారాశశాంక విజయాన్ని" రచించాడు, ముద్దుపళని అను కవయిత్రికూడా యీతని సమకాలికురాలు.

1706 లో మచిలీపట్నం సిపాయీలు తమ తలపాగాలను తీసివేయాలన్న ఆజ్ఞలకు నిరసనగా తిరుగుబాటుచేశారు. యీ సైనికులను అధికారులు కాల్చివేశారు.

1707 ఔరంగజేబు మరణం. మొగలు సామ్రాజ్య విచ్ఛిత్తికి ప్రారంభం.

1708 గురుగోవిందుని హత్య.

1708 సర్వాయపాపడు. కొద్దిరోజులవరకు ఓరుగల్లును జయించి, పరిపాలన సాగించాడు.

1719 నుండి 1740 వరకు మహమ్మద్ సా పరిపాలించాడు. యితని కాలంలోనే ప్రఖ్యాత సంగీత విద్వాంసుడు నియామార్ ఖాన్ లేక సదా రంగ్ అను నతను వుండినాడు.

1722 జగత్ సేఠ్ యితను ముర్షిదాబాద్ లోని ధనకు బేరుడు. యితని అసలు పేరు ఫతేహచందు. యితనికి ఢిల్లీపాదుషా. జగత్ సేఠ్ అను బిరుదు ప్రసాదించాడు. యితను జైనమతస్థుడు. తండ్రి ఉదయచందు. తల్లి ధనవాయి.

1724 అసఫ్‌జానిజాముల్ ముల్కు. నైజాము మూల పురుషుడు. యితను మొగలాయీసామ్రాజ్యాన్ని తృణీకరించి దక్కను సామ్రాజ్యంపై స్వతంత్రతను ప్రకటించాడు. 1724 లో చెక్కురికేళి యుద్ధములో కర్నూలు యిబ్రహీంఖాను నైజాముతో ఎదిరించిచనిపోయాడు. యితను ఔరంగ జేబుకు సామంతుడుగావుండి ఔరంగజేబు మరణానంతరం స్వతంత్రుడయ్యాడు. యితని అసలు పేరు చిక్ కులిచ్ ఖాన్ ఉరఫ్ అసఫ్‌జా.

1724—33 కర్నూలును పాలించిన పఠానుసర్దారు. యీతను ఇబ్రహీనుఖాను కొమారుడు. వీరు వరుసగా ఇబ్రహీంఖాను (అలూఫ్‌ఖాను 1724—33) హిమాయత్ ఖాను 1734—52) మున్వర్ ఖాను 1753—92) (రెండవ అలూఫ్‌ఖాను 1792-1815) (రెండవ మున్వర్ ఖాను 1815—1823) (గులామ్ రసూల్ ఖాను 1823—39) వీరు 122 సం॥రాల కాలం పరిపాలించారు. వీరిలో మొదటవాడైన ఇబ్రహీం కాలము 1717—24.

1724 గోగులపాటి కూర్మకవి. యితను విశాఖజిల్లాలోని విజయనగరాన్ని పాలించిన మొదటి ఆనందగజపతి ఆస్థానంలో వుండినవాడు. యితను సింహాద్రిశతకము ద్వారా నాటిప్రజల కడగండ్లను చక్కగా చిత్రించాడు.

1725 రాజా జై సింగ్ (నేటి) న్యూఢిల్లీలో ఖగోళ పరిశోధనాలయాన్ని నిర్మించాడు, యివి ఆరు విభాగాలుగా కట్టడం జరిగింది. వీటి ద్వారా సూర్య చంద్ర నక్షత్రాదుల కదలికను గుర్తించవచ్చు.

1728 జయసింహ మహారాజు (యీప్రాంతంలో) తన పేరుమీదుగా జయపురమును కట్టించి రాజధానిగా చేసుకున్నాడు.

1731 లో మహారాష్ట్ర పాలకుడైన బాజీరావు పేశవాకున్నూ, నిజాముకున్నూ సంధిజరిగింది. యీసంధి ప్రకారం పేశవ ఉత్తర భారతదేశ ఆక్రమణల్లో (వ్యవహారాల్లో) నిజాం జోక్యం కల్గించుకోనకుండానూ, నిజాం దక్షిణదేశ వ్యవహారాల్లో పేశవా జోక్యం కల్గించుకోనకుండానూ యితని కాలంలో మహారాష్ట్రశక్తి భారతదేశంలో అద్వితీయంగా వెలుగొందింది. 1740 లో యితను నర్మదానదిఒడ్డున సునాయాసంగా చనిపోయాడు.

1734–51 లో కర్నూలును హిమాయత్ ఖాన్ పరిపాలిస్తూవుండగా 1750 సం|| సరియగు ప్రమోదూత సం|| కార్తీక శు ౧౧ లు మంగళవారము నాడు. హంద్రీ, తుంగభద్ర నదులుపొంగి ప్రవాహముగాగా పట్టణము చాలా వరకు వరదకు గురిఅయి శిధిలమైపోయింది.

1734 లో చిక్కకృష్ణరాజును (మైసూరు) ఓడించివేసి హైదరాలీ మైసూరు రాజ్యాన్ని ఆక్రమించాడు.

1737 ఆంధ్రరాజ్యం (మధుర) పతనమయింది.

1737 కలకత్తా ప్రాంతంలో బ్రహ్మాండమైన భూకంపం కలిగి, 3 లక్షల మంది ప్రజలు మరణించారు.

1740 లో మహారాష్ట్ర సేనలు కర్నూలు మీదుగా కడప జిల్లాను దోచుకొని గుర్రంకొండ, గువ్వలచెరువు యుద్ధాలలో కడప నవాబును ఓడించి తిరుచినాపల్లి వెళ్లి చందాసాహెబ్‌ను ఓడించివేశారు. యీ విధమైన మహారాష్ట్రుల మెరుపుదాడులు 1744 లోను 1746 లోను కూడా జరిగాయి.

1741 లో ఫ్రాంసు ద్వారా భారతదేశంలో డూప్లేను గవర్నర్‌గా నియమించటం జరిగింది. యితను సమస్త భారతదేశంపైన ఫ్రాంసు సామ్రా

జ్యాన్ని స్థాపించాలని కలలుకన్నాడు. భాగతదేశపు సామంతరాజుల అంతరంగికమనస్థలను ఉపయోగించుకోవాలని చూశాడు. కానీ కొన్ని అసంతృప్తి కారణాలవల్ల ఫ్రాంసు ప్రభుత్వం యితనిని పదచ్యుతునిజేసి వెనుకకు పిలిపించుకొంది.

1746 మురారిరావు అను మహరాష్ట్ర సేనాని అనంతపురంజిల్లా గుత్తి, తాడిపత్రి, పెనుగొండ తాలూకాలను పరిపాలించాడు.

1748 లో అసఫ్‌జా మరణం. యితని మరణానంతరం రాజ్యాధికారంకొరకు యితని కుమారుడైన నాజర్ జంగ్ కు యితని కూతురు కొడుకు ముజఫర్ జంగ్ కూ మధ్య వివాదంచెలరేగింది. ఫ్రెంచివారు ముజఫర్ జంగ్ నూ యింగ్లీషువారు నాజర్ జంగ్ నూ బలపరిచారు.

1748 లో మూడవ పానిపట్టు యుద్ధం జరిగింది.

1750–80 అడిదము సూరకవి. యితను కవిజనరంజనము "రామలింగేశ్వర శతకము" కవిసంశయవిచ్ఛేదము "ఆంధ్ర చంద్రాలోకము" ఆంధ్రనామ శేషము వగైరా గంధాలను రచించాడు.

1750 భల్లా పేరకవి భద్రాచల ప్రాంతపువాడు. యితను రచించిన భద్రగిరి శతకములో మహమ్మదీయులవలన చాలా బాధలు అనుభవించినట్లు ఆబాధావిముక్తి చేయుటకుగాను భద్రాద్రి రామునిపై నిరసన వాక్యాలను ప్రయోగిస్తూ శతకాన్ని తయారు చేశాడు.

1750 ప్రాంతం పోతులూరి వీరబ్రహ్మాను కర్నూలు జిల్లా పోతులూరు నివాసి. యితను విగ్రహారాధనలు జాతిమత భేదము వగైరాలనంతా తీవ్రంగా ఖండించాడు. యితని శిష్యకోటిలో గణనకెక్కినవాడు దూదేకుల సిద్దయ్య (వడమాలపేట) వీరబ్రహ్మం గారి వ్యాప్తజీవితాన్ని గడపినవాడు. భార్య గోవిందమ్మ. కూతురు ఈశ్వరమ్మ. యీ మెకూడా గొప్ప తత్వజ్ఞురాలు. వీరు అఖరుదశలో కడప జిల్లాలో కందిమల్లయపల్లె గ్రామంలో నివసించి, అక్కడే నిర్యాణంపొందారు.

1750 తర్వాతవాడు కూచిమంచి తిమ్మకవి. యితను "నీలాసుందరీ పరిణయము" అను అచ్చతెనుగు కావ్యాన్ని కుక్కుటేశ్వర శతకాన్ని రచించాడు.

1752 లో అధికారయుతంగా మొట్ట మొదట భారతదేశ పటం (మ్యాపు) తయారుచేయబడింది

1752 సోమనాథ మాథురి "మాలతీ మాధవం" అను గ్రంథాన్ని సంస్కృతంలో నుంచీ హిందీలోకి అనువాదం చేశాడు.

1753 జాఫర్ అలీ చికాకోల్ ఫౌజ్ దారు నైజాం సర్కారు జిల్లాలను ఫ్రెంచి వారికి యివ్వగా ఫ్రెంచివారిని ఎదిరించేందుకు విజయనగర రాజుల సహాయాన్ని కోరి నిష్ఫలుడై మహారాష్ట్రుల సహాయాన్ని కోరాడు. మహారాష్ట్రులు వచ్చి, ఫ్రెంచివారిని విజయరామరాజును గగ్గోలుపరచి చేజిక్కిన దానిని దోచికొనివెళ్లారు. అనంతరం జాఫర్ అలీ నిస్సహాయుడై మరణించగా చికాకోల్ సుభా ఫ్రెంచివారి స్వాధీనమయింది.

1755 లో మైసూరు ప్రధానమంత్రి నుంజేరావుద్వారా హైదరాలీని దిండిగల్ కు ఫౌజుదారుగా నియమింపబడ్డాడు. కొద్ది కాలం తర్వాత బెంగుళూరును జాగీరుగా హైదరాలీకి యివ్వబడింది. హైదరాలీ ప్రతిభా విశేషాలను గమనించి నుంజేరావు హైదరాలీని మైసూరు సర్వసైన్యాధ్యక్షునిగా నియమించాడు.

1755 గోవాలో పోర్చుగీసు పరిపాలనకు వ్యతిరేకంగా స్వాతంత్ర్యోద్యమం విజృంభించింది. తదనంతరం 1782 లోనూ, 1824 లోనూ, 1852 లోనూ, 1869 లోనూ, 1895 లోనూ, 1912 లోనూ గోవాలో స్వాతంత్ర్యోద్యమాలు జరిగాయి కానీ వీటన్నిటినీ ఆఫ్రికా నుంచి తెప్పించబడిన నీగ్రో సైనికదళాల ద్వారా నిర్మూలించినట్లు పోర్చుగీస్ అధికార పత్రిక అయిన "స్టేట్ అన్యువల్" అనే పత్రిక ప్రకటించింది.

1757 మహారాష్ట్రరాజులు కోణార్కలోని అరుణ స్తంభాన్ని తెచ్చి పూరీజగన్నాథస్వామి ఆలయంముందు ప్రతిష్టించి ఏటా 27000 వేల రూపాయలు జగన్నాథస్వామి కైంకర్యం (పూజ) నిమిత్తం మంజూరుచేసినట్లు దాఖలా వుంది.

1756 కర్నూలు జిల్లాలోని పత్తి కొండను బసాలత్ జంగు అను నవాబు చిన్నతిమ్మన్న అనునతనికి జాగీరుగా యిచ్చాడు. కానీ తిమ్మన్న పన్ను చెల్లించలేకపోగా అతని భార్యా పిల్లలను జామీనుగా బసాలత్

వద్ద వదిలాడు. తిమ్మన్న కొడుకులలో వాసప్ప అను పిల్లవానిని జసాలత్ భార్య పెంచుకొని ముస్లిముగామార్చి రణ్యాతలీఖాను అను పేరుపెట్టి తన కొడుకుకు దివానుగా చేసింది.

1757 నాజర్‌జంగ్ దక్షిణ దండయాత్ర చేసి ఉత్తరాగ్కాటు జిల్లా లోని జింజికోటను ముట్టడించాడు. ఫ్రెంచివారు కుట్రచేసి కడప కర్నూలు నవాబులను బరచుకొని (వీరుమునుపు నాజర్‌జంగ్ ముఖ్యస్నేహితులు) మాయోపాయంతో చంపించివేశారు.

1757 లో మొట్టమొదటిసారిగా రూపాయి నాణెం తయారు చేయబడింది.

1757 ప్లాసీ యుద్ధం జరిగింది,

1757 సిరాజుద్దౌలా మరణం. 1707లో ఔరంగజేబు మరణానంతరం యీ 50 ఏడ్లలో మొగల్ సామ్రాజ్యం క్రమక్రమంగా క్షీణిస్తూ వచ్చింది. ఈ కాలంలో మహారాష్ట్రులదే. భారతదేశంలో పైచేయిగా వుంటూవచ్చింది

1757 జనవరి 26 తేది తెల్లవారు జామున బొబ్బిలి యుద్ధం విజయనగరరాజైన విజయరామరాజు ఫ్రెంచిసేనాని అయిన బుస్సీ అనునతని పురి కొల్పి బొబ్బిలిపైకి దండయాత్ర చేశాడు. యీ దండయాత్రలో నైజాం సేనాని అయిన హైదర్‌జంగ్ కూడా పాల్గొన్నాడు బొబ్బిలి దొరలు వీరోచితంగా పోరాడారు కానీ మందుగుండు సగైరా ఆధునిక యుద్ధ పరికరాల ముందు వీరిబాహు బలం పనికి రాకపోయింది, ఫలితంగా బొబ్బిలి వీరులైన ధర్మారాయుడు తాండ్ర పాపారాయుడు వెంగళ రాయుడు వగైరాలంతా వీరమరణం పొందాల్సి వచ్చింది. వీరువెలమదొరలు.

1757 మీర్జాఫర్ కుట్రపన్ని ఆంగ్లేయులతో చేరిపై సిరాజుద్దౌలాకు ద్రోహంచేశాడు. ఫలితంగా మీర్జాఫర్ నవాబు కాగల్గాడు. బెంగాలును పరిపాలించినవాడు.

1757 ముజఫర్‌జంగ్ మరణం. యితను హైద్రాబాద్ వెల్లుచున్న సందర్భములో కడపజిల్లాలోని లక్కిరెడ్డిపల్లె వద్ద కొండలోయలో కడప కర్నూలు నవాబులు మిత్రద్రోహంతో హత్యచేశారు. యీతని మరణానంతరం యితని తమ్ముడైన సలాబత్‌జంగ్‌ను ఫ్రెంచివారు సింహాసనంపై

కూర్చుండ బెట్టారు యీసహాయానికి బదులుగా సలాబత్ జంగ్ గుంటూరు మినహా సర్కారుజిల్లాలను బుస్సీ అను ఫ్రెంచి సేనానికి పన్ను వసూలు చేసుకొనే అధికారం క్రింద యిచ్చివేశాడు.

1758 డిశంబరు 9 తేదీన బెందుర్తి (పిఠాపురం) వద్ద యుద్ధము జరిగింది ఫలితంగా ఆంధ్రదేశపు ఉత్తర సర్కారులు ఫ్రెంచివారినుండి ఇంగ్లీషు వారికి వశమయ్యాయి.

1759 నుండి 1847 వరకు త్యాగరాజు జీవితం యితను తంజావూరు మహారాష్ట్ర రెండవ రాజైన శరభోజకి సమకాలికుడు సుప్రసిద్ధ సంగీత విద్వాంసుడు. త్యాగయ్య కృతులు లోక ప్రసిద్ధములు.

1759 ఆనంద గజపతి యితను విజయనగరాన్ని పాలిస్తూ ఉండి నాడు క్లైవు ఆంధ్రదేశంపైకి దండయాత్ర చేయగా యితను క్లైవుకు సహాయం చేశాడు. రాజమహేంద్రవరంవద్ద జరిగిన యుద్ధంలో ఫ్రెంచి వారు పూర్తిగా ఓడిపోయారు దానితో ఆంధ్రదేశంలో ఫ్రెంచివారి ప్రాబల్యం లేకుండా పోయింది.

1760 లో జాఫర్ అలీఖాన్‌ను ఆంగ్లేయులు పదవీచ్యుతుని చేసివేశారు యింతకుమునుపు విశ్వాసఘాతుకను ద్వారా యితను సిరాజుద్దౌలాను సంహరించి బెంగాల్ పరిపాలకుడైయ్యాడు యితని రెండవపేరు మీర్ జాఫర్

1761 లో నిజామలీఖాన్‌ను నైజాం సింహాసనంపై కూర్చుండబెట్టి బ్రిటిష్ వారు గుంటూరు జిల్లాను స్వాహాచేసుకున్నారు. (సలాబత్ జంగ్‌ను పదవీచ్యుతుని చేశారు.)

1761 పేశవా. బాలాజీరావు మరణానంతరం అతని పుత్రుడు మాధవరావు పేశవా అయ్యాడు. కానీ యితని వయస్సు 16 సం॥ రాలే అయినందున యితని పినతండ్రి రఘునాధరావు సంరక్షకుడుగా వుంటూ రాజ్యాన్ని కబలించాలని కలలు కంటూవుండేవాడు. కాబట్టి త్వరలోనే వీరిద్దరిమధ్యా గృహ కల్లోలం ప్రారంభమయింది 1768 వరకు జరిగిన యీ గృహ కల్లోలంలో మాధవరావుకు విజయం లభించి రఘునాధరావు బందీగా చేయబడ్డాడు.

1761 లో మైసూరులో హైదరాలీ శాసనకాలం ప్రారంభమయింది 1763 లో హైదరాలీ వేదనూరు దుర్గాన్ని జయించి అపారధనాన్ని సంపాదించాడు. 1766 లో మైసూరు పాలకుడు మరణించగా హైదరాలీకి సంపూర్ణ పాలనాధికారం ప్రాప్తించింది 1761 లో హైదరాలీ దీర్ఘకాలంగా యుద్ధంచేసిన అనంతరం గుత్తి కోటను స్వాధీనం చేసుకొని మురారిరావును ఖైదుచేశాడు. 1800 వరకు అనంతపురం జిల్లా మైసూరు సుల్తానులక్రింద నే వుండిపోయింది.

1761 లో ఆఫ్ఘనిస్తాన్ పాలకుడైన అహ్మదుషాదురానీతో పాని పట్టువద్ద జరిగిన యుద్ధంలో మహారాష్ట్రులు దారుణంగా ఓడిపోయారు.

1762 లో నిజాం పులీ పూనాపై దాడిచేశాడు మహారాష్ట్రులు యీ దాడిని త్రిప్పికొట్టారు.

1763 లో బక్సార్ యుద్ధం జరిగింది బెంగాల్ నవాబు మీర్ ఖాసిం ను ఆంగ్లేయులు సునాయాసంగా ఓడించివేశారు.

1763 సర్కారు జిల్లాలను నైజాంచే ఆంగ్లేయులు సంగ్రహించు కొన్నారు.

1765 లో బ్రిటీష్ డైరెక్టర్స్ బోర్డు క్లైవును రెండవతూరి గవర్నర్ గాచేసి భారతదేశం పంపించింది.

1765 లో ఆవిరి యంత్రాన్ని ఇంగ్లండులో ఆవిష్కరించారు. జేమ్స్ వాట్ కనిపెట్టినవాడు.

1765 నుంచీ 95 వరకు మధ్యభారత్ లోని యిందూర్ను అహల్యా బాయి పరిపాలించింది. 1770 ప్రాంతంలో యిందూరు నగరాన్ని యీమె కట్టించింది యీమె అతిసమర్ధనీయమైన పరిపాలకురాలుగా గుర్తింపబడింది.

1766 లో నిజాంఅలీఖాన్ ద్వారా గంజాం, విశాఖ గోదావరిజిల్లాలను తూర్పు యిండియా కంపెనీకి దానం చేయబడ్డాయి,

1766 ప్రాంతంలో గుర్రంకొండను మీర్ సాహెబు అను నవాబు పరిపాలించాడు.

1766 లో హైదరాలీ కడపజిల్లాపై దాడిచేసి కడప నవాబును ఖైదుచేశాడు. అనంతరం 1800 వరకు హైదరాలీ సామంతుడుగా మీర్ సాహెబనునతను పరిపాలించాడు.

1767 లో త్యాగయ్య తిరువానూరులో జన్మించి 1848 వరకు జీవించాడు. యితని పూర్వీలు కంభం తాలూకా కాకర్లగ్రామవాసులు సంస్కృతాంధ్ర పండితుడు. సంగీతవిద్వాంసుడు జ్ఞాని. విరాగి "నౌకావిజయం ప్రహ్లాదభక్తి విజయం అను గేయనాటికలుకూడా రచించాడు.

1767 లో సయాం పైన బర్మావారు దాడిచేసి బౌద్ధశిలాఖండాలను చాలావరకు నాశనం చేశారు.

1769-93 ప్రాంతాల్లో తెలంగాణాలో ఘోరక్షామం దాపురించింది. ఒక్క హైద్రాబాదు నగరంలోనే 90 వేలమంది చనిపోయారు యీ కరువులో ఎక్కడచూచినా మనుష్యుల పుర్రెలే అగుపించేటివట కాబట్టి యీ కరువును పుర్రెల కరువనికూడా ప్రసిద్ధిచెందింది.

1770 రాణాకుమారసింగ్ జననం. యితను 1857 విప్లవం నాటికి 80 ఏళ్ల వృద్ధుడైకూడా విప్లవసైన్యాలను నాయకత్వం వహించి బ్రిటిషు పాలకులను గజగజలాడించాడు. యితని ప్రతిభ అమోఘమైనది 1858 ఏప్రిల్ 26 వ తేదిన మరణించాడు.

1770-1831 హెగెల్ విజ్ఞానవాది కానీ యితని విజ్ఞాన వాదంలో మాయావాదంకూడా మిలితమై యుంటుంది.

1770 బీహారు, బెంగాలు రాష్ట్రాల్లో అత్యంత భీకరక్షామంఏర్పడింది దాదాపు మూడింట ఒకభాగంజనం చనిపోయారు అప్పటికి యీ రెండు రాష్ట్రాలు యింగ్లీషువారి వశమయ్యాయి.

1772 రాజారామమోహన్ రాయ్ జననం యితను బ్రహ్మసమాజాన్ని స్థాపించి అనేకముగా దేశహితైక కార్యములు చేశాడు.

1772 రుహేల్ ఖండవాసులు నవాబు వజీర్‌తో మహారాష్ట్రులు తమపై దాడిచేస్తే నవాబు వారికి సహాయం చేసేటట్లు అందుకుగాను వారు నవాబుకు 40 లక్షల రూపాయలు యిచ్చుకునేటట్లు ఒడంబడిక చేసుకొన్నారు 1773 లో రుహేల్‌పైన మహారాష్ట్ర సైన్యాలు దాడిచేశాయి నవాబు

వజీర్ సైన్యాలు కంపెనీ సైన్యాలు సమ్మిళితంగా రుహేల్ లకు సహాయంగా వెళ్లాయి మహారాష్ట్రులు పారిపోయారు కానీ ధనాభావంచేత రుహేల్ వాసులు నవాబుకు 40 లక్షల రూపాయలు చెల్లించలేకపోయారు నవాబు కంపెనీ సైన్యాలు సమ్మిళితంగా రుహేల్ పై దాడిచేసి అమానుషంగా అత్యాచారాలను జరిపటం ప్రారంబించగా రుహేల్ వాసులు దేశంవిడచి పార్లిపోవాల్సి వచ్చింది. రుహేల్ ఖండం నవాబు పాలన క్రిందికి వచ్చింది. యీ కాలంలో కంపెనీ గవర్నర్ గా సర్ హిస్టింగ్ వుండినాడు.

1772 లో మాధవరావు పేశవా (మహారాష్ట్ర) మరణించాడు యితని అనంతరం మహారాష్ట్రుల శక్తి స్తోమతలు క్రమంగా క్షీణించ సాగాయి.

1773 లో రెగ్యులేషన్ చట్టం తయారయింది.

1773 భారతదేశంలో బ్రిటిష్ గవర్నర్ జనరల్ పరిపాలన ఆరంభమయింది.

1773 మాధవరావు పేశవామరణానంతరం యితనికి పుత్రులు లేని కారణంగా తనతమ్ముడైన నారాయణరావును పేశవాచేశాడు. రఘునాథరావును సంరక్షకుడుగా నియమించబడ్డాడు. రఘునాధరావు నారాయణరావు హత్యచేసి స్వయంగా పేశవాఅయిపోయ్యాడు. కానీ నానా ఫడనవీస్ నారాయణరావు పుత్రుని పేశవాగాచేసి రఘునాథరావుకు వ్యతిరేకంగా మహారాష్ట్ర సర్దారులను సమైక్యం చేశాడు. రఘునాధరావు కంపెనీవారి శరణుజొచ్చాడు, నానాఫడనవీస్ 1800 లో మరణించాడు యితని మరణంతో మహారాష్ట్ర స్వతంత్రం అంతరించింది.

1774 జులై 10 న గంజాంలోని గుంసూరు జలంత్రా పర్లాకిమిడి టెక్కలి వగైరా జమిందారీలను బ్రిటిషువారు స్వాధీనం చేసుకొనేందుకు ప్రయత్నంచేశారు ఫలితంగా యీ జమీందారులంతా తిరుగుబాటు చేశారు గెరిల్లా పోరాటాలనుకూడా నడిపారు.

1780 నుంచి 1839 వరకు రణజిత్ సింహుని కాలం. లాహోర్, పంజాబులను కాబూలు జమనశాహీ పాలిస్తూవుండినాడు. కాబూల్ లో తిరుగుబాటు రాగా రణజిత్ సింహుని యుద్ధసామగ్రి కాబూల్ కు యిచ్చేటట్లు

జమనశాహీ లాహోర్‌ను రణజిత్ సింహునికిచ్చేటట్లు సంధిచేసుకొన్న ఫలితం గా లాహోర్ రణజిత్ సింహునికి సునాయాసంగాలభ్యనుయింది. అనంతరం తన శక్తికూడ గట్టుకొని 1802 లో అమృతసర్‌పై తన అధికారాన్ని సంపాదించాడు. తర్వాత అయిదు సంవత్సరాలు కఠిన పరిశ్రమ ద్వారా పంజాబులో అధికభాగాన్ని సంపాదించాడు. యిదే సమయంలో మహా రాష్ట్ర జసవంతరావు హోల్కర్ బ్రిటిష్ కంపెనీకి వ్యతిరేకంగా పోరాడేం దుకు రణజిత్ సింహుని వద్దకువెళ్లి దేశస్వాతంత్ర్యంకొరకు సహాయంచెయ్యా మని అడిగాడు. కానీ రణజిత్ సింహుడు సహాయంచేయకపోగా కంపెనీతో సంధిచేసుకొమ్మని సలహాయిస్తాడు. రణజిత్ సింహుడు ఒక సాధారణ సర్దా రుగావుండి బలమైన శిఖ్కు రాజ్యాన్ని స్థాపించటంలో విశేష ప్రతిభను చూపించాడు. కానీ యితని అనంతరం యితని రాజ్యంకూడా ఛిన్నాభిన్న మయిపోయింది.

1780 లో నిజాంసహాయంతో హైదరాలీ బ్రిటిష్‌వారిపై యుద్ధాన్ని ప్రకటించాడు. హైదరాలీ టీపూ సమ్మిశ్రితంగావెళ్లి కర్నాటకాన్ని జయించారు. కంపెనీద్వారా మద్రాసు కర్నల్ వేలీలను హైదరాలీని నిరో ధించేందుకు పంపబడ్డారు. హైదరాలీ మద్రాసునూ, టీపూ (హైదరాలీ కొడుకు టిప్పుసుల్తాను) కర్నల్ వేలీని ఓడించివేశారు. కర్నల్ వేలీ ఖైదుగా పట్టుబడ్డాడు. యీ సందర్భంలో కంపెనీవారు నిజాంకు గుంటూరును తిరిగి వాపసుయిస్తామని ఆశచూపించి నిజాంను హైదరాలీకి విరుద్ధంగా మార్చి వేశారు.

1780–82 మధ్య తెలుగు సిపాయీలను బ్రిటిష్‌వారు దక్షిణాదికి తరలించే ప్రయత్నంచేయగా అదివారిసంధికి అననుకూలమని విశాఖపట్నంలో తిరుగుబాటు చేశారు.

1780 లో భారతదేశంలో మొట్ట మొదటిసారిగా వార్తా పత్రిక ప్రారంభించబడింది.

1782 లో హైదరాలీ మరణం. యితని మరణకాలమందు యితని కుమారుడైన టిప్పుసుల్తాను మళయాళములోని నాయరువిప్లవాన్ని అణచేం దుకు వెళ్లియుండినాడు.

1782 టిప్పుసుల్తాను అగుట. 1749 లో యితను జన్మించాడు. హైదరాలీ మరణానంతరం. యితను మైసూరుకు సుల్తాను అయినాడు. ఆంగ్లేయుల దాడులను అతిసమర్థతతో ఎదిరించి మల్యాచ్ సేనానిని బద నౌరులో తన సైన్యాలతో చక్రిబంధంచేసి ఉంచాడు. ఆఖరులో టీపూసుల్తాను ఆంగ్లేయులతో యుద్ధంచేశాడు. యిదే యుద్ధంలో టీపూ మరణించాడు.

1782 లో మెకంజీదొర ఉద్యోగిగా భారతదేశానివచ్చి 38 సం॥లు ఉద్యోగిగాపనిచేసి దక్షిణదేశంలో విశేషంగా పర్యటించి అనేక తాళపత్ర లిఖిత గ్రంథాలు శాసనాలు సేకరించాడు. వీటన్నింటిని అనేక సంపుటాలుగా ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారంలో సురక్షితంచేశాడు.

1783 లో ఫ్రాన్సుశాస్త్రజ్ఞుడు మాంటొగోల్ ఫేయరు బెలూనును కనిపెట్టాడు.

1784 లో ప్రముఖ ఆంగ్లవిద్వాంసులు సర్ విలియమ్ జోన్స్ ఏషియాటిక్ సొసయటీ ఆఫ్ బెంగాల్ అనే సంస్థను నెలకొల్పడంతో మ్యూజియంల స్థాపనోద్యమానికి భారతదేశంలో అంకురార్పణ జరిగింది.

1785 గెరాసిమ్ లెబిడెవ్. యితను రష్యానుంచి భారతదేశానికివచ్చి 12 ఏళ్లపాటు భారతదేశంలో నాటక కళను పోషించినవాడు. యితను బహుభాషా పండితుడు.

1797 లో తిరిగి స్వదేశం వెళ్లిపోయాడు.

1785 లో కార్ట్ రైట్ అనునతని ద్వారా మరమగ్గము ఆవిష్కరించబడింది.

1788 లో గుంటూరును తిరిగి నిజాంచే ఆంగ్లేయులకిచ్చివేయబడింది.

1790 లో మైసూరు నవాబైన టిప్పుసుల్తానుపై బ్రిటీష్ వాళ్లు యుద్ధాన్ని ప్రకటించారు.

1791 లో కాశీలో సంస్కృత కళాశాల స్థాపించటం జరిగింది.

1793 నుంచీ 1823 వరకు ఎబ్బీడూబో అనే ఫ్రెంచి ఫాదరీ ఆంధ్ర దేశంలో పర్యటించి యాత్రా విశేషాలను గ్రంథస్థం చేశాడు.

1793 లో శాశ్వతశిస్తు నిర్ణయం చేసివేశారు.

1794 మహారాష్ట్రాగ్రనాయకుడగు మహాదజీ సింధియా హిందూ సామ్రాజ్యమును తిరిగీ ఢిల్లీలో స్థాపించాడు. కానీ ఇంగ్లీషువారు శరవేగంతో విజయాలు సాధిస్తూవుండిన కాలమిది. యింతలో 1894 లో మహాదజీ సింధియా నే మరణించాడు.

1797 లో విశాఖపట్నానికి చెందిన 27 వ బెటాలియన్ సైనికులను వాలాజాబాద్ కు తరలించేందుకు కర్నల్ రాబర్ట్సు ప్రయత్నంచేయగా సైనికులు తిరుగుబాటు చేశారు,

1798–1884 బ్రౌన్‌దొర. యితను 1817 ఆగష్టు 4 న యీష్టిండియా కంపెనీలో సివిల్ ఉద్యోగిగా చేరేందుకు మద్రాసు చేరుకున్నాడు. అప్పటికే అంటే 19 ఏండ్ల వయస్సుకే హిబ్రూ, అరబిక్, పర్షియన్, గ్రీకు. లాటిన్ వగైరా భాషలు నేర్చిన ప్రతిభాశాలి. అనేక పాత లిఖిత గ్రంథాలు సేకరించాడు. వేమన పద్యాలను చక్కని ఆంగ్లాను వాదంతో 1829 లో ఆంగ్లేయుల కందించాడు. 1854 లో ప్రచురించిన ఇంగ్లీషు తెలుగు నిఘంటువు అమూల్యమైనది. యిది 1300 పేజీలుగల ఉద్గ్రంథము యింకా మిశ్రమ నిఘంటువు అను తెలుగులోకి యితర భాషా పదాల ప్రవేశాన్ని తెలియజేయుదానిని కూడా ప్రచురించాడు. భారత భాగవత భాస్కర రామాయణాది మను చరిత్ర వసుచరిత్రాదులు వగైరాలనంతా సంస్కరించి ప్రామాణికంగా ముద్రించటమే గాక వ్యాఖ్యలు కూడా వ్రాయించాడు.

1798 కంపెనీవారి సహాయక సంధి. యీ సంధిని అంగీకరించిన భారతీయ రాజులు (1) కంపెనీ ఆధిపత్యాన్ని అంగీకరించటం (2) కంపెనీ అనుమతిలేకుండా ఎవరితోనైనా సంధికిగానీ, యుద్ధానికిగానీ తలపడగూడదు. (3) బ్రిటీష్‌వారిని మినహా తతిమ యూరఫియన్‌లను తమవద్ద నౌకరికి వుంచుకొనకుండుట (4) తమ స్వంతఖర్చుతో కంపెనీ సైన్యాలను తమవద్ద వుంచుకొనుట (5) కంపెనీ రాజదూతను తమవద్ద వుంచుకొని అతని సలహాలను పాలించటం యీ విధమైన సంధిని ప్రప్రథమంగా 1798 లో హైదారాబాదు నిజాం స్వీకరించాడు. తర్వాత మైసూరు టిప్పుసుల్తాను అనంతరం హిందూరాజులుకూడా స్వీకరించారు. 1801 లో అవధ నవాబు తర్వాత

బాజీరావు పేశవా స్వీకరించి భారతీయ స్వతంత్ర అస్థిత్వాన్ని మంటగలిపే శారు.

1798–1858 జే. సి. మారిస్ యితను తెనుగు బాగుగానేర్చి మద్రాసులో తెలుగుట్రాన్స్లేటర్ గా పని చేశాడు.

1799 వెల్లస్లీ గవర్నరుగా వచ్చాడు. మహారాష్ట్రుల దాడినుండి నైజాంను కాపాడటమనేసాకుతో కడప, కర్నూలు, బళ్లారి, అనంతపురం జిల్లాలను స్వాధీనం చేసుకున్నాడు. 1800 నాటికి ఒక్క తెలంగాణా మాత్రం నైజాంకు మిగిలింది.

1799 టిప్పుసుల్తానును జయించి ఇంగ్లీషువారు కృష్ణరాజుకు రాజ్యాన్ని అప్పగించారు. శ్రీ రంగపట్టణాన్ని స్వాధీనం చేసుకున్నారు. యిది మైసూరుపైన జరిగిన యుద్ధాలలో నాల్గవది.

1799 లో నెపోలియన్ ఫ్రాంసులో సర్వాధికారి అయ్యాడు.

1800 లో వెల్లస్లీ విలియమ్ కోటలో ఒక కాలేజీని స్థాపించాడు. కానీ యిది ముందుకు సాగలేకపోయింది.

18 వ|| శ|| సాకమ్మ. యీమె రామాయణము, ముక్తికాంతా కళ్యాణము, రంగవిలాసము, గురుశిష్య సంవాదము వగైరా గ్రంథాలను రచించిరి. పరమభక్తులు, జన్మస్థానము దొడ్డరాయసముద్రము లేక వీర రాజాంబుధి అగ్రహారం.

18 వ|| శ|| మరింగంటి సింగరాచార్యులు తెలంగాణా నివాసి. ఆంధ్ర భాషాభూషణము రచించాడు.

18 వ|| శ|| తిమ్మయ్య నెల్లూరు నివాసి లక్షణమంజరి నైషధము వగైరా రచించాడు.

18–19 వ|| శ|| వేదం పట్టాభిరామశాస్త్రి నెల్లూరి నివాసి "పట్టాభిరామపండితీయము" రచించాడు.

18 వ|| శ|| నారాయణభట్టు సంస్కృత ప్రసిద్ధకవి. (యితని తండ్రి భట్టమహేశ్వర్) యితను వేణీసంహారం, ప్రయోగరత్న, అను గ్రంథాలు రచించాడు.

1800–50 అయ్యలరాజు నారాయణామాత్యుడు. యితను తన కాలపు ప్రజలఆచార విచారాలను తెలియజేసే "హంసవింశతి" అను గ్రంథాన్ని రచించాడు.

18 వ॥ శ॥ కూచిమంచి తిమ్మకవి. పిఠాపురంనివాసి యితను నీలా సుందరీ పరిణయం అను అచ్చు తెనుగుకావ్యాన్నీ సర్వలక్షణసారసంగ్రహం వగైరాలు రచించాడు.

18 వ॥శ॥ కూచిమంచి వెంకట్రాయుడు "సుకవిజనమనోరంజనము" ఛందో గ్రంథాన్ని రచించాడు.

18 వ॥ శ॥ కస్తూరి రంగకవి తంజావూరు నివాసి "ఆనందరంగ రాట్ఛందము" రచించాడు.

1800–50 గువ్వలచెన్న శతకములో "ప్లీడరు" అనే పదాన్ని ఉప యోగించటాన్నిబట్టి యితను యీ కాలానికి చెందినవాడని చెప్పవచ్చు.

1800 గండ్లూరి నరసింహశాస్త్రి కర్నూలు "భాషీయదండ"కాన్ని రచించాడు. కర్నూలు మండలపువాడని కూడా చెప్పబడుతూవుంది.

1800 కడప, బళ్లారి, అనంతపురం, కర్నూలును నిజాం నవాబు తూర్పు ఇండియా కంపెనీకి దానంచేశాడు.

18 వ॥శ॥ రంగరామానుజుడు. యితను ఉపనిషత్ లకు భాష్యాన్ని రచించాడు.

1801 లో ఆర్కాటురాజు నెల్లూరుఫిర్కాను తూర్పు ఇండియా కంపెనీకి ఇచ్చివేయుట,

1801 రాయలసీమలో భీకరక్షామం ఏర్పడింది.

1801 లో దత్తమండలాలను నిజాం ఆంగ్లేయుల కిచ్చివేశారు.

1801 లో క్యాంబెల్ దొర వేములకోటను (పులివెందుల తాలూకా) ముట్టడించి కోటగోడలు పడగొట్టించి పాళెగాని ఖైదీగా గుత్తికోటకు పంపించివేశాడు.

1802–5 లో శాశ్వతభూమిపన్ను విధానాన్ని (పర్మనెంట్ సెటిల్ మెంట్) చేసివేశారు.

1803 లో నిజామ్ అలీఖాన్ మరణించాడు.

1803 లో బెంగాలులో 438 మంది స్త్రీలు సహగమనం అనే పూర్వాచారానికి బలిఅయ్యారు.

1804–72 ఫ్యెర్ బాక్ జర్మన్ తత్వశాస్త్రవేత్త జీవితకాలం.

1804 హైదాబాద్‌లో గొప్పక్షామందాపురించింది. రు. 1–0–0 1కి 60 శేర్లమ్మే జొన్నరాగులు యీ క్షామంలో రెండున్నర శేర్లకు దిగిపోయ్యాయి. కొందరు మనిషిమాంసం తిన్నారు.

1804 లో బ్రిటిష్ వారితో నిజాం నవాబు చేసుకున్న ఒడంబడిక ప్రకారం బ్రిటిష్‌వారికి సహాయంకొరకుగాను నిజాం సైన్యాలను నడిపేందుకు సేనానాయకుడైన రాజ్ మహాపల్ రాం నిరాకరించాడు. యీ సందర్భంలో మహాపల్ రాం బ్రిటిషువారితో పోరాటం కూడాచేసి ఓడించాడు.

1806 భారతదేశంలో 'బ్యాంక్ ఆఫ్ బెంగాల్' అనే మొట్టమొదట బ్యాంకు స్థాపనజరిగింది.

1806 లో తెలుగు అక్షరాలు తయారుచేయబడ్డాయి.

1806 లో మచిలీపట్నంలో భారతీయ సిపాయీలుధరించే తలపాగాలను తీసివేసి టోపీలను పెట్టుకోవాలని ప్రభుత్వం ఆజ్ఞలుజారీచేసింది. కానీ సిపాయీలు అందుకు వ్యతిరేకంగా నాలుగురోజులు తిరుగుబాటు చేశారు. ఆరుగురు సిపాయీల్ని కాల్చివేసి ప్రభుత్వం తిరుగుబాటును అణచివేసింది.

1811 జసవంతరావు యితను మహారాష్ట్ర తుకాజీరావు హోల్కారు కుమారుడు. తుకాజీరావు 4రు పుత్రులలో జసవంతరావు చిన్నవాడు. తండ్రి మరణానంతరం యీ అన్నదమ్ములలో అధికారం కొరకు వివాదం ఏర్పడింది. ఆఖరుకు జసవంతరావుదే పైచేయిఅయింది. వివాదంలో జసవంతరావు పెద్దసోదరుడు 'కాశీరావును' బావఖండేగావును రహస్యంగా చంపిస్తాడు. ఫలితంగా యితను కొద్దిదినాలలోనే పిచ్చివాడై చాలాదినాలు కష్టపడి 1811 లో మరణిస్తాడు.

1812 మార్చి 29 తే॥ పూర్ణయ్య మంత్రిమరణం. యితను పేదబ్రాహ్మణ నియోగికుటుంబంలో జన్మించి 1766ప్రాంతంలో మైసూరునవాబైన

హైదరాలీ వద్ద మంత్రిపదవిని స్వీకరించాడు. హైదరాలీ అనంతరం టిప్పు సుల్తాను వద్ద మంత్రిపనిచేశాడు. టిప్పు శ్రీరంగపట్న యుద్ధంలో మరణించగా కృష్ణరాజు వద్దకూడా మంత్రిపదవిని నిర్వహించి మంచిపేరు ప్రఖ్యాతులు ఆర్జించుకొన్నాడు.

1813 ప్రాంతానికల్లా మహారాష్ట్రులు రాజపుత్రులతో సఖ్యము చేయ నిరాకరించి వైరము పెంచుకొని క్రమక్రమంగా దుర్బలులైపోయారు తర్వాత మహారాష్ట్ర సేనలలోని పలువురు పిండారీలుగా మారి తెలంగాణా రాయలసీమ ఉత్తరసర్కార్లను దోచుకొనటం ప్రారంభించారు. యీ సైన్యం సంఖ్య 21000 గుర్రపు దళము, 15000 కాల్బలము, 18 తోపులు (ఫిరంగులు) కల్గినదిగా వుంటూ పల్లెలు, పట్టణాలుపైన మెరుపుదాడులు చేసి దోచుకుపోయేవారు. పిండారీలు దోపిడిగాళ్లుగా చరిత్రలో ప్రసిద్ధిచెందిన వారు.

1814-1820-24 లో మెటకాఫ్ అను నతను భారత దేశాన్ని గురించి యీ విధంగావ్రాశాడు. "భారతదేశం మనపతనాన్ని గురించి ఎదురుచూస్తూవుంది. మనస్థితి భారతదేశంలో చాలా అధ్వాన్నంగా తయారయింది."

1814-15 అమరసింహుడు యితను బ్రిటిషుసేనానిఅయిన అక్టరలోనిని ఓడించాడు. విలాసపురరాజా బ్రిటిషుసైన్యాలకు సహాయంచేయటంతో 1858 లో అమరసింహుడు నేపాల్ రాజధాని అయిన కఠమండూ వెళ్లిపోయాడు.

1814 తాంతియాతోపే జననం. (తండ్రి పాండురంగభట్) నానా సాహెబ్‌కు బాల్యస్నేహితుడు. అనంతరం నానా తాంతియాను సర్వసేనాధ్యక్షునిగా చేసుకున్నాడు.

1815 జసవంతసాధు మహారాష్ట్రుడు. యితను ప్రథమంలో రు. 10-0-0 వేతనంపై సర్కారు ఉద్యోగిగాచేరి తదనంతరం 115-0-0 తహశీల్‌దారుగా వృద్ధిచెందాడు. సిపాయీ విద్రోహ కాలంలో యితను సర్కార్‌కు సహాయంచేశాడు. దీని వల్ల సర్కారులో యితని గౌరవం కూడా పెరిగింది.

1815 లో బెంగాలులో 378 మంది స్త్రీలు సహగమనమనే ఆచారానికి బలిఅయ్యారు.

1815 లో పిండారీలు తెలంగాణామీదుగా కృష్ణానదినిదాటి సర్కారుజిల్లాలన్నింటినీ దోచుకున్నారు.

1816-21 మధ్యకాలంలో మెకంజీదొర. ప్రభుత్వసర్వేఅధికారిగా వుంటూ దేశచరిత్రరచనకు అవసరమయిన కైఫియతులు తాళపత్రగ్రంధాలు అశేషంగా ప్రోగుచేశాడు.

1816 ఏ. డి. క్యాంబెల్. యితను ఫోర్టుసెంటుజార్జి కాలేజీలో తెలుగు పండితుడుగావుండిన ఉదయగిరి వెంకటనారయ్యగారివద్ద శిష్యుడుగావుండి తెలుగులో మంచి ప్రవేశాన్ని సంపాదించాడు. విదేశీయులకు ఉపయుక్తమయ్యే పద్ధతిలో వ్యాకరణగ్రంధంరచించి తెనుగుభాషకు సంస్కృతభాషకు జన్యజనక సంబంధంలేదనీ దక్షిణదేశ భాషలన్నీ ఒకప్రత్యేక కుటుంబానికి చెందినట్లు తోచుచున్నదని అభిప్రాయపడిన మొట్టమొదటి భాషా తత్వశాస్త్రవేత్త.

1816 లో డేవిడ్ హేర్ అను క్రైస్తవ మతబోధకుడు. రాజా మోహన్ సహాయముతో కలకత్తాలో ఒకకళాశాలను స్థాపించాడు ఆసియా ఖండంలో యిదే మొదటి విశ్వవిద్యాలయమని చెప్పవచ్చు.

1816 రాయిటర్ జననం. 1899 లో మరణం. యితను జర్మనీలో పుట్టిపెరిగి యింగ్లండులో నివసించాడు. యితను ప్రప్రధమంగా విలేఖరుల సంస్థను స్థాపించి యదార్థవార్తలను ఎప్పటికప్పుడు అందించటంలో చాలా నైపుణ్యాంతో పనిచేశాడు. యితని అడుగుజాడలలోనే రాయిటర్ సంస్థ నేడు ప్రపంచమందన్ని దేశాలలోనూ పనిచేస్తూవుంది.

1817 లో బెంగాలులో 700 మంది స్త్రీలు సహగమన ఆచారానికి బలవంతముగా బలిచేయబడ్డారు.

1818 మొదటి భారతీయవార్తా పత్రిక స్థాపించబడింది.

1818 దక్షిణభారతదేశానికి మొదటి వెండి నాణెం తయారుచేయబడింది.

1818 లో బెంగాలులో 839 మంది స్త్రీలు సహగమనం అనే ఆచారానికి బలిఅయ్యారు.

1819 దినకరరావు బొంబాయి ప్రదేశం రత్నగిరిజిల్లా దేవత గ్రామ నివాసి. మహారాష్ట్ర బ్రాహ్మణుడు (తండ్రి రాఘవరావు) సంస్కృత పారసీ భాషలలో పండితుడు. యితను ప్రతిభావిశేషాలు కనబరచి గ్వాలియర్ రాజ్య దివాన్ పదవిని సంపాదించాడు. ఖజానాలో డబ్బుకొరత ఏర్పడినపుడు స్వయంగా జీతంలో 5 వేల నుంచీ 2 వేలకు తగ్గించుకున్నాడు. సిపాహీవిప్లవంలో యితను ఆంగ్లేయులకు చాలాసహాయంచేశాడు. ఫలితంగా కాశీ జిల్లాలో ఒక పెద్ద జమీందారీ యితనికి బహుమతిగా యివ్వబడింది.

1819 లో బ్రిటిష్ ఆఫీసర్లు వేటకుగాను వెళ్లి అజంతాగుహలను చూచారు అప్పటినుంచి అజంతాగుహల ప్రాముఖ్యాన్నిగురించి ప్రపంచానికి వెల్లడవుతూవచ్చింది.

1820 మార్చి 28 తేది ఎంగిల్సు జననం. కమ్యూనిష్టుపార్టీ మూల స్థాపకుడైన మార్క్సుకు కుడిభుజంగా పనిచేశాడు.

1820 పండితఈశ్వరచందు విద్యాసాగరుల జననం.

1820 నాటికల్లా ఆంధ్రదేశమంతా ఆంగ్లేయుల స్వాధీనమయింది.

1821 లో పూనాలో ఒకకళాశాల 1824 లో కలకత్తాలో నొకటి, 1829 లో ఢిల్లీలో నొకటి. 1832 లో ఆగ్రాలో ఒకటికళాశాలలు స్థాపించ బడ్డాయి. యివన్నీ ప్రాచీన భాషలలోనే బోధించేవి.

1824 బెంగాల్, బ్యారక్‌పూర్ పటాలాన్ని బర్మా యుద్ధంలోకి పంపబోతే సిపాయీలు తిరుగుబాటుచేశారు. పటాలాన్నంతటినీ అధికారులు కాల్చిచంపటమో లేక ఉరితీయటమో చేశారు.

1824 లో నానాసాహెబ్ జననం. మహారాష్ట్రలోని వేణుగ్రామం తండ్రి మాధవరాయనారాయణభట్టు. తల్లిగంగాబాయి. బాజీరావు నానా సాహెబ్‌ను దత్తతగా స్వీకరించాడు. పీష్వాబాజీరావు 1851 లో నానా సాహెబ్‌కు వీలునామావ్రాసి చనిపోయాడు. కానీ బ్రిటిష్‌పాలకులు యీ దత్తతకు సంబంధించిన వీలునామాను నిర్లక్ష్యం చేశారు.

1827 లో మొట్టమొదటిసారిగా తెలుగు పుస్తకం ముద్రించబడింది.

1827 సర్ థామస్ మన్రో మరణం. యితను మద్రాసులో 24 సం|| లు వుండి రాయలసీమ ప్రాంతానికి ప్రత్యేక కృషిచేశాడు. యితనిని రాయల సీమ వాసులు చాలా ప్రేమతో చూసేవారు. 1827 లో కర్నూలు జిల్లా పత్తికొండలో కలరాతగిలి మరణించాడు.

1830 అలెగ్జాండరుడఫ్ అనునతను కలకత్తాలో రెండవ కళాశాలను స్థాపించాడు.

1829 లార్డ్ విలియమ్ బెంటిక్ కాలంలో రాజారామమోహన్ ప్రోద్బలంతో సహగమనాచారంపై నిషేధాజ్ఞను జారీచేశారు.

1829 లో ఇంగ్లండులో రైలుఇంజన్ తయారుచేయబడింది.

1830 మైసూరులో రైతుల తిరుగుబాటు జరిగింది.

1830 లో గుడ్డలుకుట్టు మిషను ఫ్రాన్సులో తయారుచేయబడింది.

1830-31 ఏనుగుల వీరాస్వామయ్య అను ఉద్యోగస్థుడు మద్రాసు నుంచీ సపరివారంగా కాశీయాత్రకు పల్లకీలలో ప్రయాణంచేశాడు. యితను తెలుగు దేశములో చాలాప్రాంతాలవారి ఆచార విచారాలను తన డైరీలో వ్రాశాడు.

1830 బ్రహ్మసమాజ స్థాపన రాజారామమోహన్ రాయ్ స్థాపించాడు. యిదే సం||లో యీయన బ్రిటిష్ పార్లమెంటువద్దకు రాయబారం వెళ్లాడు.

1831 ఫ్రాంసులో అగ్గిపుల్లను తయారుచేసేవిధానాన్ని కనిపెట్టారు.

1831 హైద్రాబాద్‌లో గొప్పక్షామం ఏర్పడింది. యీకరువులో పడికెడుగింజలకుకూడా తలిదండ్రులు తమపిల్లల్ని అమ్మకొనేస్థితికివచ్చారు. రు. 1-0-0 కు 3-4 శేర్లుఅమ్మాయి.

1833 భాస్కరానందస్వామి కాన్పూరుజిల్లా మైదేలాల్ పూర్‌లో 1833 ఆశ్వీజ శుక్లసప్తమి జన్మించాడు. 1901 లో చనిపోయాడు.

1833 లో రాజారామమోహనరాయ్ ఇంగ్లండులోని బ్రిష్టలులో మరణించాడు.

1834 సర్ సాలార్ జంగ్ జననం. యితని జీవితంలో నానావిధవస్తు సముచ్ఛయాన్ని సేకరించటమే ప్రధానాశయంగా పెట్టుకొన్నాడు. హైదరాబాదులోనున్న సాలార్ జంగ్ మ్యూజియం భారతదేశానికే గర్వకారణం. యితను సైన్యాధికారిగావుండినాడు. నిజాంబావమరిది.

1835 మార్చి 7 తేది భారతదేశంలో ఇంగ్లీషును రాజభాషగా గుర్తింపబడింది.

1835 లో ఝాన్సీ లక్ష్మీబాయి జననం. 1842 లో యీమెకు రాజా గంగాధరరావుతో వివాహం జరిగింది. యీమె బాల్యనామం మనూబాయి కాగా అత్తగారు లక్ష్మీబాయి అనిపెట్టారు.

1835 ఇరోపీయ తత్వశాస్త్రాన్నీ పాశ్చాత్యాశాస్త్రాలను సంస్కృత ఉర్దూ భాషలలోనికి అనువాదంచేసి బోధించవలెనని బ్రిటిషుగవర్నమెంటు ఉత్తర్వుచేసింది. అప్పటికి ఇంగ్లీషురాజభాషగా గుర్తింపబడలేదు.

1835 నాటికి కర్నూలు నవాబుల పతనం పూర్తయింది.

1835 మొదటి తెలుగు నిఘంటువు ముద్రణ అయింది.

1835 భారతదేశానికంతటికీ ఒకేనాణెం ముద్రించి ప్రవేశపెట్టటం జరిగింది.

1836–96 సం॥లలో రెండు మాప్లా తిరుగుబాట్లు జరిగినవి.

1836 హైద్రాబాద్ లో నిజాంనవాబు సోదరుడు. ముబారక్ ఉద్దౌలా బ్రిటీషువారికి ఎదురుతిరిగి ఓడించాడు. కానీ బ్రిటిష్‌వారు తిరిగీ అతని సేవిడీని ముట్టడించి ముబారక్‌ను పట్టుకొని గోలుకొండకోటలో ఖైదు చేశారు. యీ కాలంలోనే ఉత్తర భారతదేశంలో వాహిడీల విప్లవం జరిగింది. ఆ ప్రభావమే నిజామ్‌సోదరుని తిరుగుబాటుకు ప్రోత్సహించింది.

1836 రెండవ స్వాతంత్రోద్యమం యిది ఉత్తరభారతదేశంలో వాహిడీల విప్లవం.

1837 లో ఫోటోగ్రఫీ తీసే విధానాన్ని ఫ్రాన్సులో కనిపెట్టారు.

1837 లో న్యాయస్థానములలో పర్షియా భాషకు బదులుగా ఇంగ్లీషు ప్రవేశపెట్టబడింది.

1837 లో గోలుకొండప్రాంతంలో తిరుగుబాటుజరిగింది. ఆప్రాంత పాలకుడైన అనంతభూపతిని పన్నులుసరిగాచెల్లించలేదనే కారణంగా పదవి నుంచి తొలగించగా యీ తిరుగుబాటు జరిగింది.

1838 దిలీపసింహుడు. యితను పంజాబుకేసరి మహారాజా ప్రతాప సింహుని చిన్నకొడుకు. 1838 లో 4 సం॥లు ప్రాయంలో యితను సింహాసనంపై కూర్చుండబెట్టబడ్డాడు. 1849 లో సిఖ్ఖు యుద్ధానంతరం పంజాబు డల్హౌసీ క్రిందికివచ్చింది. దిలీపుడు యుక్తవయస్కుడైన అనంతరం యితనికి సర్కార్ నుంచి ఏటా రెండులక్షలు భరణంగా యివ్వబడింది. 1853 లో యితను క్రైస్తవమతం స్వీకరించాడు. విదేశసంచారంవెళ్లి 1893 అక్టోబర్ 23 తేదిన పేరిస్ లోని ఒకహోటల్ లో మరణించాడు.

1838 లో ఇంగ్లాండులో మోటారు టైర్లను తయారుచేశారు.

1839 పంజాబ్ పరిపాలకుడైన రంజిత్ సింగ్ మరణం.

1839 అక్టోబర్ 18 తేది ఇబ్రహీంఖాను వంశీయులలో కట్టకడపటి వాడగు రసూలుఖాను కంపెనీవారికి కప్పమును యెగవేసి కంపెనివారిపైన కుట్రలుపన్నినాడనే కారణంగా రసూలుఖానును ఖైదుచేసి తిరుచినాపల్లి జైలుకుపంపారు. యీ సందర్భంలో నవాబుసైన్యానికి కంపెనీ సోల్జర్లకు చిన్నయుద్ధంలో మృతిపొందినవారిని కర్నూలు బొంగులబజారులో పడమట దిశన సమాదులు చేశారు. యీ తిరుగుబాటులో నెల్లూరు ఉదయగిరి నవాబులుగూడా పాల్గొన్నారు.

1840 తరిగొండ వెంకమాంబ. యీమె వెంకటాచలమహాత్మ్య మను గ్రంథాన్ని రచించింది. రాజయోగసారము ద్విపదభాగవతము వగైరా ద్విపదకావ్యాలను కూడా రచించింది.

1840 అయోధ్యానాధపండితుడు (పండిత కేదారనాథుని పుత్రుడు) కాశ్మీరు బ్రాహ్మణుడు. 1840 లో ఆగ్రాలో జన్మించాడు. ఫార్సీ, అరబ్బీ ఆంగ్లభాషలలో పండితుడు. ఆగ్రాలో యితను ప్రసిద్ధబారిష్టరుగా పేరు పొందాడు. యిండియన్ హెరాల్డ్ పత్రికకు కొంతకాలం సంపాదకుడుగా పనిచేశాడు. యిండియన్ హెరాల్డ్ ఆగిపోయిన తర్వాత "యిండియన్ యూనియన్" పత్రికను నడిపాడు.

1840లో కలకత్తాలో ఆర్థిక భూగర్భశాస్త్ర విశేషాలకు సంబంధించిన మ్యూజియం నెలకొల్పబడింది.

1840 లో చైనాలో నల్లమందు యుద్ధంజరిగింది. యీ యుద్ధంలో పాల్గొనేందుకు సిద్ధంచేయబడిన రెండు బెంగాల్ పటాలాలు తిరుగుబాటు చేశాయి.

1840 లో స్కాట్లండ్ దేశంలో సైకిల్ ఆవిష్కరణ జరిగింది.

1840 లో బ్యాంక్ ఆఫ్ బొంబాయిని స్థాపించారు.

1841 లో ఖమ్మం జిల్లా ఇల్లెందు దంటుపల్లి అనే గ్రామాలవద్ద ప్రజలు నేలను త్రవ్వుతూ వుండగా నేలబొగ్గు బయటపడింది. 1871 లో డాక్టర్ కింగ్ అనే భూగర్భపరిశోధకుడు. యిక్కడ బోరింగులు వేసి మంచి శ్రేష్టమైన బొగ్గువున్నదని కనుగొన్నాడు. 1886 లో దక్కన్ కంపెనీ వారు యిక్కడ బొగ్గుత్వ్వకంపని ప్రారంభించారు.

1845–47 లో త్యాగయ్య మరణం.

1846 గాజుల లక్ష్మినరుసు శెట్టి మద్రాసులో లక్షాధికారియైన వ్యాపారి. యితను బ్రిటిష్‌వారికి వ్యతిరేకంగా ప్రజాసమీకరణకు కృషి చేశాడు. 1846 లో బైబిలును నిర్బంధపఠనీయంగా చేయరాదని ఒకగొప్ప సభనుజరిపి 12 వేలమంది సంతకాలతో ఒకమహజరును పార్లమెంటుకు పంపాడు. కంపెనీనుంచి పరిపాలనను పార్లమెంటు స్వీకరించాలని 1852లో మహజరుకు పంపారు. కానీ మితివాదిఅయిన కారణంగా 1857 స్వాతంత్ర్య సంగ్రామాన్ని వ్యతిరేకించాడుకూడా.

1847 అనిబిసెంటు జననం.

1849 లో కంపెనీ తెచ్చిన నూతన చట్టప్రకారం సితారాకు ఉత్తగాధికారిలేదనే కారణంగా కంపెనీ క్రిందికి తీసుకున్నారు. అదే విధంగా 1853 లో నాగపూరును 1854 లో ఝాంసీలను కూడా కలిపివేయటం జరిగింది. యీ చట్టాన్ని అనుసరించి రాజకుటుంబాలలో సంతానంలేనపుడు దత్తతసాంప్రదాయాన్ని రద్దుచేయటంజరిగింది. యీ చట్టంక్రిందనే జయపూర్ సమల్‌పూర్ వగైరాలను కూడా కంపెనీ స్వాహాచేసింది.

1849లో బొంబాయిలో ఒక మ్యూజియం నెలకొల్పాలనే ఆలోచన కలిగింది. 1851 లో లండన్‌లో జరిగిన అఖిలవస్తుప్రదర్శనం యిందుకు తగిన ప్రోత్సాహాన్ని కలిగించింది. ఫలితంగా డా॥ బుయీ ద్వారా బొంబాయిలో ఆర్థిక ఉత్పత్తుల మ్యూజియంలు నెలకొల్పబడినాయి.

1849–50 పంజాబ్‌లోని బెంగాలీ పటాలాలు జీతభత్యసమస్యలపై తిరుగుబాటు చేశాయి.

1851 లో ధవళేశ్వరంవద్ద గోదావరి ఆనకట్ట నిర్మాణం జరిగింది.

1851 లో ప్రసిద్ధిచెందిన వరంగల్ తివాసీలనే జంఖానాలను ఇంగ్లండుకు ప్రదర్శనార్థం పంపబడ్డాయి.

1852–59 సర్, ఆర్థర్ థామస్ కాటన్ యితను మద్రాసులో ఛీఫ్ ఇంజినీరుగా పనిచేసి కృష్ణా గోదావరులకు ఆనకట్టల నిర్మించాడు.

1853 లో బొంబాయిలో మొదటిసారిగా బట్టల మిల్లును స్థాపించటం జరిగింది

1853 మొదటి రైలుమార్గం బొంబాయినుంచీ కళ్యాణి వరకు వేయటం జరిగింది.

1854 మార్చి 2 తే॥ న ఝాన్సీ బ్రిటిష్ రాజ్యంలో కలిపి వేయబడిందనీ లక్ష్మీబాయికి నెలకు అయిదు వేలు చొప్పున భరణం యివ్వబడుతుందని ప్రకటించారు.

1854 లో తంతి పద్ధతిద్వారా వార్తలనంపటం ప్రారంభమయింది.

1854 బొంబాయిలో మొదటి పత్తి మిల్లు స్థాపన.

1854 లో హైదరాబాదు రాష్ట్రంలో ఘోరక్షామం ఏర్పడి వీధులలో పీనుగులునిండి పోయ్యాయి.

1855 చిన్నయసూరి మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజిలో తెలుగు అధ్యాపకుడుగా వుంటూ. బాల వ్యాకరణం వ్రాసి ప్రసిద్ధికెక్కారు.

1855 జూన్ 30 తే॥ సంథాలు పరగణాల్లోని భగ్నదిహి గ్రామంలో 10 వేల మంది సందాలులు సమావేశమయి ఒక నిర్ణయానికివచ్చి పోరాటం ప్రారంభించారు. యీ పోరాటం 1856 ప్రారంభంవరకు కొనసాగింది.

బ్రిటిష్ సామ్రాజ్యానికీ వారి తాబేదారులైన వడ్డీ వ్యాపారస్థులు భూస్వాములు తోటల యజమానులు వగైరాల నిరంకుశత్వానికి వ్యతిరేకంగా పోరాటం జరిగింది. బీహారులోని భాగల్పూరునుండి బీర్భభూజిల్లా మూర్షిదాబాద్ జిల్లా సరిహద్దువరకు యీ పోరాటం విస్తరించింది. సువిశాల ప్రదేశంలో బ్రిటిష్ ప్రభుత్వం నామరూపాలులేకుండా పోయింది. తదనంతరం యీ పోరాటం అణచివేయబడింది.

1855 లో బెజవాడవద్ద కృష్ణానదిపై ఆనకట్ట నిర్మాణం జరిగింది.

1856 హైదాబ్రాద్లో ఆడపిల్లలను అమ్మకొనే వ్యాపారాన్ని నిషేధించారు. కానీ తర్వాత 1930–35 వరకు యీ వ్యాపారం సాగుతూనే వుండింది.

1856 లో జనరల్ సర్వీస్ ఎనలిస్టే మెంట్ చట్టం ప్యాసుచేయబడింది. యీ చట్టంప్రకారం భారతీయుడు విదేశాలకు సమ్మతించనిచో సైన్యములో చేర్చుకొనకూడదు యీచట్టం భారతీయులలో పూర్తిగా అసంతృప్తికి కారణ భూతమయింది.

1856 జులై 23 తే॥ బాల గంగాధరతిలక్ జననం. 1882–97 1912లోనూ యీయన కారాగారశిక్షలు అనుభవించాడు భారతస్వాతంత్ర్య సంగ్రామంలో ప్రముఖుడుగా కృషిచేశాడు విద్వాంసుడు. స్వతంత్రం మాజన్మహక్కు దానిని సాధించి తీరుతాము అని గర్జించిన ధీరోదాత్తుడు. 1920 ఆగష్టు 1 తే॥ రత్నగిరిలో అస్తమించాడు.

1857 మార్చి 29 తే॥ బ్యారక్ఫూర్ సిపాయీల సమక్షములో ఒక బ్రిటిష్ సైన్యాధికారిని చంపి యిద్దరిని గాయపరచిన మంగళ్ పాండ్యాను భారతీయ సిపాయీలు మార్గదర్శిగా పరిగణించారు. ఫలితంగా 1857 సిపాయీల తిరుగుబాటు ప్రారంభమయింది దీనినే ప్రథమ భారతీయ స్వాతంత్ర్య సంగ్రామంగా పరిగణించటం జరుగుతూవుంది.

1857 మార్చిలో విప్లవనాయకులైన నానాసాహెబ్ ఆయనసోదరుడు బాలాసాహెబ్ సలహాదారుడు అజిముల్లా తీర్థయాత్రలకని బయలుదేరారు యీయాత్ర ఉద్దేశం విప్లవ సన్నాహాలను సంపూర్తి చేయుటమే.

1857 సిపాయీ కలహం తర్వాత నిజాంనవాబు బ్రిటిష్ వారికి తోడ్పడ్డాడు, కానీ నిజాంసైన్యాలు బోయినపల్లి ఔరంగాబాదు తదితర ప్రాంతాలలో తిరుగుబాట్లు చేశాయి యీ తిరుగుబాట్లు సకాలంలో సక్రమంగా జరుగకపోయినా విదేశీ పాలకులయడల ప్రజల మనస్తత్వాన్ని తెలియజేసింది.

1857 తిరుగుబాటులో భాగంగా బళ్లారిజిల్లాలో భీమారావు అను మాజీతాసిల్దారు తిరుగుబాటును లేవదీశాడు. హాస్పేటకు 26 మైళ్ల దూరంలోని కొప్పాల్‌ను తిరుగుబాటుదార్లు స్వాధీనం చేసుకొన్నారు సంఘర్షణలో భీమారావు చనిపోయాడు. 77 మంది ఉరితీయబడ్డారు.

1857 ఉత్తర హిందూస్థానంలో ప్రారంభమయిన విప్లవ ఛాయలు హైద్రాబాదు ప్రజలపైన పడినాయి రోహిల్లా దళాలు రెసిడెన్సీని ముట్టడించాయి రాష్ట్రములో పెక్కుప్రాంతాలలో క్రమబద్ధంగా విప్లవ పోరాటాలు (చెదురుమదురుగా) కొనసాగాయి.

1857 ఝాన్సీలక్ష్మీబాయి నానాసాహెబు తాంతియాతోపే మొదలైన మహారాష్ట్రనాయకులు సిపాయీ విప్లవంలో పాల్గొని అతిముఖ్య పాత్రలను నిర్వహించారు.

1857 లో నైజాంనవాబు నజీరుద్దౌలా మరణించిన పిమ్మట అఫిజల్ ఉద్దౌలా నవాబైనాడు.

1857 బొంబాయి, మద్రాసు, విశ్వవిద్యాలయాలు స్థాపించబడినవి.

1858 అక్టోబర్ 19 తే॥ నోనదీగ్రామంలో అమరసింహుని సైన్యం బ్రిటిష్ సేనలద్వారా దిగ్బంధంచేయబడ్డాయి కానీ అమరసింహుడు మరియిద్దరితో కలసి తప్పించుకొని పోగల్గాడు.

1859 తాంతియాతోపే స్వస్థలంలోనుండగా మానసింగ్ అనునతను బ్రిటిష్‌వారితో లంచమతిని ద్రోహిగా మారిపోయి 1859 ఏప్రిల్ 7 తే॥ అర్ధరాత్రి పట్టించాడు.

1859 మార్చి 15 తే॥ బ్రిటిష్ రాణిద్వారా నిజామును బిరుదు నిశానీలను రెసిడెంటుద్వారా అందించబడినవి యీబిరుదు నిశానీలను నిజాముకందించి వెలుపలికి వస్తున్న రెసిడెంట్‌ను జహంగీర్ ఖాన్ అను రోహిల్లాపఠాను

కార్బ్రయిడ్‌తో కాల్చించంపే ప్రయత్నంచేశాడు. కానీ విఫలమయింది. యింతలో సాలార్‌జంగ్ భటులు జహంగీర్‌ఖాన్‌ను సంహరించారు.

1860 లో రాయలసీమలో ఘోరమైన కరువుఏర్పడింది. యీ కరువుకు సంబంధించిన పనులలోనే కడప కర్నూలు కాల్వ (పని) నిర్మాణం ప్రారంభమయింది, యీ కరువులో గొప్ప జననష్టం సంభవించింది.

1860 నెల్లూరు వద్ద పెన్నకు ఆనకట్ట కట్టారు.

1860 నీలిమందు రైతుల తిరుగుబాటు

1861 గురజాడ అప్పారావు జననం

1861 మే రవీంద్రనాధ ఠాగూర్ జననం.

1861 మే మోతిలాల్ నెహ్రూజననం. (ఉత్తర ప్రదేశ్) వీరిపుత్రుడే జవహర్‌లాల్ నెహ్రూ.

1862 కాశీనాధుని నాగేశ్వరరావు జననం.

1863 లో లక్నో నాగపూర్‌లలో మ్యూజియంలు నెలకొల్పబడినాయి 1865 లో బెంగుళూరులోని ప్రభుత్వమ్యూజియం స్థాపించబడింది. 1874 లో మధురలోను 1875 రాయపూరులోను 1888 లో రాజకోటలోను 1887 బరోడాలోను తర్వాత కొద్ది సంవ|| రాలకు శ్రీనగర్‌లోను మ్యూజియంలు స్థాపించబడినాయి.

1863 గిడుగు సీతాపతి జననం.

1863 టైపురైటర్‌ను అమెరికాలో ఆవిష్కరించారు.

1864 లో గుంటూరు తాలూకాలోని సవరలు తమనాయకుని పోలీసులు అరెస్టుచేయ్యగా పోలీస్ స్టేషన్ ధ్వంసంచేసి నలుగురు పోలీసులను చంపివేశారు ప్రభుత్వం వీరిని అరెస్టుచేసి ఉరిశిక్షలు ద్వీపాంతరశిక్షలు విధించింది యీపోరాటం చాలాకాలం వరకు జరిగింది.

1864 లో అమెరికాలో ఫౌంటన్ పెన్ను తయారు చేయబడింది.

1864 లో బందరువద్ద బ్రహ్మాండమైన ఉప్పెన (ప్రవాహం) వచ్చింది.

1865 లో మచిలీపట్నంవద్ద దారుణమైన వరద ప్రవహించింది.

1866 ఫిబ్రవరి రెండవ తేదిన శ్రీ దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులు జననం, (గుంటూరు) వీరి తండ్రి కోటయ్య వీరి జీవితంలో దేశ సేవా కార్యక్రమాలను విరివిగా చేసి 1948 ఆగస్టు 15 వ తే॥ మరణించారు.

1869 లో మీర్ మహబూబ్ అలీఖాన్ నైజాం పదవికి వచ్చాడు (యితనికుమారుడే ప్రస్తుత ఉస్మాన్ అలీఖాన్ 1957)

1869 అక్టోబర్ 2 తే॥ గాంధీజననం. తల్లి పుతలీబాయి.

1870 ఏప్రిల్ 22 రష్యా విప్లవ మహానాయకుడూ కమ్యూనిష్టు ప్రభుత్వ నిర్మాతా అయిన లెనిన్ జన్మదినం.

1871 మార్చి 18 తే॥ ప్యారిస్ కమ్యూన్ ఆవిర్భవించింది యీ కమ్యూన్ 72 రోజులపాటు మాత్రమే జీవించి కమ్యూనిష్టు ప్రభుత్వం మే 28 తేది తిరిగి పడిపోయింది. మే 21 తే॥ నాడు తిరిగీ వర్సెయిల్స్ సేనలు ప్యారిస్‌ను ముట్టడించాయి. ఒకవారం రోజులపాటు వీరోచితంగా పోరాడి కమ్యూనిష్టులు ఓడిపోయారు.

1872–73 పాబ్నా, బోగ్రా. రైతుల తిరుగుబాట్లు జరిగాయి.

1874 గణేశుడు. యితను కాశీరాజు అస్థాన పండితుడుగా వుండి ప్రద్యుమ్న నాటకాన్ని రచించాడు.

1875 లో ఆర్య సమాజస్థాపన దీన్ని స్థాపించినవారు స్వామి దయానంద సరస్వతి వీరు వేదాలకు ఉపనిషత్‌లకు భాష్యాలను రచించారు సత్యార్థప్రకాశిక వగైరా విమర్శనాత్మక గ్రంథాలుకూడా రచించారు.

1875 నుంచీ నేటివరకు ఆంధ్రసాహిత్యరంగంలో ఆధునికయుగంగా పేర్కొనవచ్చు.

1875 లో దక్షిణ భారతదేశంలోనూ మహారాష్ట్రదేశంలోనూ రైతులు తిరుగుబాట్లు చేశారు.

1876 లో అమెరికాలో గ్రామఫోన్, టెలిఫోన్ పరికరాలు తయారుచేయబడి అమలులోకి వచ్చాయి.

1876–77 ధాతుకరువు ముఖ్యంగా యిది రాయలసీమలో విపరీత నష్టాన్ని కలగజేసింది. ఒక మద్రాసు బొంబాయి రాష్ట్రాలలోనే 50 లక్షల మంది ప్రజలు చనిపోయారు.

1877 లో బకింగ్ హామ్ కాల్వత్రివ్వటం జరిగింది.

1879 ఫిబ్రవరి 13 తే॥ సరోజినీదేవి జననం. తండ్రి అఘోరఛటో పాధ్యాయ వంగబ్రాహ్మణులు హైదరాబాదులో నిజామ్ కాలేజీ నిర్మాతల లో అఘోరఛటోపాధ్యాయ ఒకరు 1895 లో సరోజినీదేవి నిజామ్ స్కాలర్ షిప్పు మీద ఉన్నత విద్యకొరకై ఇంగ్లండు కెళ్లింది. 1898 సెప్టెంబర్ లో డాక్టరు నాయుడుగారిని వివాహమాడింది "గానకోకిల" బిరుదును సంపాదించింది. తదనంతరకాలంలో యీమె కాంగ్రెస్ లోచేరి దేశసేవకు జీవితాన్ని అంకితం చేసివేసింది. 1924 లో కాంగ్రెస్ ప్రెసిడెంటు అయింది.

1879 జూన్ 3 తే॥ తెలంగాణాలో 50 మంది కొండదొరలకు పోలీసులకు పోరాటంజరిగింది. దొరలనాయకుడైన వీరన్న దొరను బ్రిటిష్ వారు కాల్చివేశారు. 1891 లో మరొకసారి కొండదొరలు తిరుగుబాటు చేశారు

1878 గోదావరి ఏజన్సీ ప్రాంతంలో రంపచోడవరంలో ప్రారంభమయిన తిరుగుబాటు భద్రాచలం రేకపల్లి గోలుకొండ ప్రాంతాలవరకు వ్యాపించింది. యీ తిరుగుబాటుకు ద్వారబంధాల చంద్రయ్య పులిచింతల సాంబయ్య అంబుల్ రెడ్డి నాయకత్వము వహించారు. 1879 లో చంద్రయ్య అడ్డతీగెల పోలీసు స్టేషనును ధ్వంసంచేశాడు. చంద్రయ్య అను చరులను 79 మందిని ప్రభుత్వం కాల్చివేసింది. 1880 ఫిబ్రవరిలో చంద్రయ్యనుకూడా పోలీసులు కాల్చివేశారు అంబుల్ రెడ్డి నాయకత్వాన వడ్డెగూడెం పోలీసు స్టేషను 1879 జూలై 10 తే॥ తగులబెట్టారు. 1880 లో తమ్మన్నదొర రేకపల్లిని స్వాధీనం చేసుకొన్నాడు.

1880 నుంచి 1900 వరకు భారతదేశంలో క్రీస్తు మతానలంబకుల సంఖ్య అతివేగంగా వృద్ధిగాంచింది.

1883 లో కలకత్తాలో భారత రాష్ట్రీయ కాన్ఫరెన్సు జరిగింది.

1883 లో దయానంద సరస్వతి మరణం.

1883 కారల్ మార్క్సు నిర్యాణం.

1883 లో గాంధీ కస్తూరిబాయిని వివాహం చేసుకున్నాడు.

1883 సర్ సాలార్ జంగ్ హైదరాబాదులో వాంతి భేదులవల్ల మరణించాడు.

1884 లో హ్యూమ్ పరామర్శద్వారా ఇండియన్ నేషనల్ యూనియన్ సంస్థను నిర్మించటం జరిగింది. దీని కాన్ఫరెన్సు 1885 లో బొంబాయి లో జరిగింది. యీ కాన్ఫరెన్సులోనే దీనిని యిండియన్ నేషనల్ కాంగ్రెస్ అని మార్చటం జరిగింది. అదే కాంగ్రెస్ సంస్థగా రూపొంది చలామణీ అవుతూవచ్చింది దీనికి డబ్ల్యూ సి బెనర్జీ ప్రథమ అధ్యక్షుడు.

1885 మాడపాటి హనుమంతరావుగారి జననం. వీరు స్త్రీల విషయంలో చాలాశ్రద్ధవహించారు. ప్రసిద్ధ రచయిత.

1885 లో గాంధీ ఉన్నతవిద్యకొరకు ఇంగ్లాండువెళ్లటము తండ్రి మరణించటము జరిగింది.

1886 లో విశాఖపట్టణంలో ప్రధమంగా ఆంధ్రగ్రంథాలయం స్థాపించటం జరిగింది.

1887 లో విరేశలింగంగారి ఆంధ్రకవుల చరిత్ర, రచనజరిగింది.

1887 విక్టోరియామహారాణి పరిపాలన షష్టిపూర్తి.

1887 లో జరిగిన విక్టోరియారాణి స్వర్ణోత్సవాలు సందర్భములో మద్రాసులో విక్టోరియా టెక్నికల్ యిన్సిటిటూట్ కలకత్తాలోని విక్టోరియా మెమోరియల్ హాల్ మైసూరు ఉదయపూరు రాజకోట విజయవాడలో కొత్తమ్యూజియంలు నెలకొల్పబడ్డాయి,

1888 పూనాలోని మహారాష్ట్రయిండస్ట్రియల్ మ్యూజియం నెలకొల్పబడింది. యిది పూనాలో జరిగిన భారతీయకళా వస్తుప్రదర్శనఫలితంగా ఆవిర్భవించింది.

1888 లో మౌలానా అబ్దుల్ కలాం ఆజాద్ మక్కాలో జన్మించాడు 1898 లో వీరితండ్రి కలకత్తాకువచ్చి స్థిరపడిపోయారు. ఆజాద్ ఈజిప్టు వెళ్లి రెండేండ్లు చదివాడు 1912 జూన్ 1 తే॥ అల్ హిలాల్, అనేవార పత్రికను స్థాపించాడు. యిండియా ప్రభుత్వంలో విద్యాశాఖ సహజ సంపదల శాఖశాస్త్ర పరిశోధనలశాఖల మంత్రిత్వ నిర్వహించడమేగాక కాంగ్రెస్

పార్టీ డిప్యూటీ నాయకుడుగా కూడా చాలాకాలంవరకు పనిచేశాడు. 1958 ఫిబ్రివరి 22 తేదీన స్వర్గస్థులైనారు.

1889 ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి జననం.

1889 నవంబరు 14 తే॥ పండిట్ నెహ్రూ జన్మదినం.

1890 లో కాంగ్రెసు తరఫున సురేంద్రనాధబెనర్జీ నాయకత్వం క్రింద ఒక ప్రతినిధి వర్గాన్ని లండన్ పంపి లండన్‌లో కాంగ్రెసు శాఖను స్థాపించటం జరిగింది.

1890 సెప్టంబర్ 21 తే॥ గోవాలో జాతీయోద్యమాన్ని అణచటం కొరకు గాను గోవన్ దేశభక్తులను బుడతకీచులు (పోర్చుగీసు) నరికి వేశారు

1891 లో మణిపూర్‌లో తిరుగుబాట్లు జరిగాయి.

1891 లో జనాభా లెక్కలు తయారు చేశారు.

1891 గాంధీ ఉన్నతవిద్యసంపూర్తి చేసుకొని ఇంగ్లండునుంచి భారత దేశానికి తిరిగి వచ్చాడు.

1893 మొదటి రైలుమార్గం వేశారు.

1893 లో గాంధీ దక్షిణాఫ్రికాకు వెళ్లాడు

1894 లో అబ్దుల్లా కేసు రాజీపడటం జరిగింది. గాంధీ దక్షిణాఫ్రికాలోని నేటాలులోఉండి తలపన్ను బిల్లుపైన సత్యాగ్రహం చేయించడం నేటాలు ఇండియా కాంగ్రెస్‌ను స్థాపించటం కూడా జరిగింది.

1894 లో సినిమా మెషీన్‌ను అమెరికాలో తయారు చేశారు.

1895 లో నికొలై అలెగ్జాండ్రోవిచ్ బుల్గానిన్ జననం. 1955 ఫిబ్రవరి 8 తే॥ సోవియట్ దేశ మంత్రి వర్గాధ్యక్షుడుగా నియమింపబడ్డాడు.

1894 ఏప్రిల్ 17 తే॥ నికిటా సెర్గియేవిచ్ క్రుశ్చేవ్ జననం. యితను 1952 లో సోవియట్ కేంద్రకమిటీ కార్యదర్శిగా ఎన్నుకొనబడ్డాడు.

1895 సెప్టంబర్ 11 తే॥ వినోభాజీ జననం, గగోడే గ్రామం చిత్పావన బ్రాహ్మణ వంశంలో నరహరి శంభూరావుకు జన్మించాడు తల్లి

రుక్మిణీదేవి ముగ్గురు సోదరులు ఒక సోదరి భూదానోద్యమ నిర్మాతగా ప్రపంచప్రసిద్ధి పొందాడు వినోభా.

1895 లో ఎంగిల్సు చనిపోయాడు.

1895 జర్మనీలో ఎక్సురే యంత్రం కనిపెట్ట బడింది.

1895 లో ఇటలీలో వైర్లెస్‌ను కనిపెట్టారు.

1896 లో గాంధీ కాంగ్రెస్ ప్రచారనిమిత్తమే దేశపర్యటనచేశాడు.

1897 జూన్ 12 తే॥ అస్సాంలో గొప్ప భూకంపం కల్గింది.

1898 రేడియం ఫ్రాన్సులో కనుగొనబడింది.

1899 లార్‌కర్జన్ భారతదేశానికి వైస్రాయిగా నియమింపబడినాడు 1900 లో యితను పంజాబు లేండ్ ఎలినేషన్ చట్టం తెచ్చాడు. దీనిప్రకారం రుణమున్న రైతులవద్దనుంచి భూములను గుంజుకొనటాన్ని నిషేదించటం జరిగింది యితని కాలంలో భారతీయులను ఉన్నత పదవులలోనికి తీసుకొనటం ప్రారంభమయింది. 1901 లో ఇంపిరియల్ కెడిట్ కోర్సును స్థాపించి రాజవంశస్థులను ఉచ్చవంశస్థులను యిందులో చేర్చుకొనటం ప్రారంభించాడు. యితని కాలంలో 6 వేల మైల్ల పొడవురైలు మార్గంవేయ బడింది. బెంగాల్ విభజన కూడా యితనికాలంలోనే జరిగింది.

1899 లో బోయరు యుద్ధము జరుగగా ఇంగ్లీషువారికి చికిత్స చేయుటకు గాంధీ పూనుకొన్నాడు.

1897 లో రాన్డ్ అయెర్స్టెల హత్య వీరిలో ఒకరు కమిషనరు ఒకరు లెఫ్టినెంట్ వీరి నిరంకుశత్వాన్ని సహించలేక మహారాష్ట్ర యువకులు దామోదర చాపేకర్ బాలకృష్ణ చాపేకర్ అనువారు వీరిని హత్యచేశారు హత్యచేసిన వారిద్దరిని ప్రభుత్వం ఉరితీసింది.

1900 లో సాలూరు తాలూకా కొర్రవాని వలసలో కొర్రా మల్లయ్య అను కొండదొర తిరుగుబాటు లేవదీశాడు. యిద్దరు పోలీసులను ప్రజలు వధించారు ప్రారంభములోనే జిల్లా కలెక్టరు పెద్ద బలగంతో వెళ్లి తిరుగుబాటును అణచివేశాడు. ముగ్గురికి యీ సందర్భములో ఉరిశిక్ష విధించారు.

1900 లో కొమర్రాజు లక్ష్మణరావు కృష్ణదేవరాయాంధ్ర నిళయము 1904 లో విజ్ఞాన చంద్రికా గ్రంధమాలలను స్థాపించారు.

19 వ॥ శ॥ శిషు కృష్ణమూర్తి కాళహస్తి నివాసి "హరికారికావలి" ఛందోగ్రంథరచయిత

19 వ॥ శ॥ వెంకటనరసయ్య విశాఖనివాసి కవిదర్పణ ఛందము అను ఛందోగ్రంథాన్ని రచించాడు.

19 వ॥ శ॥ త్యాగరాజ మొదలియార్ తమిళనాడు ఛందోరత్నాకరము రచించాడు

19 వ॥ శ॥ వేదం వెంకటరమణశాస్త్రీ మద్రాసు నివాసి "లఘు వ్యాకరణ" గ్రంథకర్త.

19 వ॥ శ॥ పుదూరి సీతారామశాస్త్రీ మద్రాసు నివాసి "ప్రశ్నోత్తరాంధ్ర వ్యాకరణము" రచించాడు.

19 వ॥ శ॥ సీతారామాచార్యులు తమిళనాడు నాగపట్నము నివాసి "ప్రౌఢవ్యాకరణము" బహుజనపల్లి రచించాడు.

19–20 శతాబ్దాలు వావిలికొలను సుబ్బారావు వాల్మీకి రామాయణాన్ననుసరించిన వ్యాంధ్రటీకా తాత్పర్యములతో "మంథర" అను బృహత్ గ్రంథాన్ని రచించి అభినవ వాల్మీకి అన్న బిరుదును పొందాడు యింకా ఆంధ్ర వాల్మీకి రామాయణము, సులభవ్యాకరణము వగైరాలు రచించాడు

19–20 శ॥ కల్లూరి వెంకటరామశాస్త్రీ గోదావరి నివాసి "గుప్తార్థప్రకాశిక" అను గ్రంథాన్ని రచించాడు.

19 వ॥ శ॥ ఓరుగంటి రామకవి "కవితాలక్షణసారము" రచించాడు

19–20 శ॥ వెల్లటూరి లింగన మంత్రి "సరసాంధ్రవృత్తరత్నాకరము" రచించాడు.

1901 లో జనాభా లెక్కలు తయారుచేశారు.

1901 లో విక్టోరియారాణి మరణం.

1901 లో తెలంగాణాలో కృష్ణదేవరాయాంధ్ర భాషానిళయం కృష్ణదేవరాయ గ్రంథాళయ స్థాపన జరిగింది.

1901 మార్చి 16 తే॥ పొట్టి శ్రీరాములు జననం. 1930–32 ఉద్య మాలలోను 1942 లోను జైలు కెళ్లాడు.

1901 నుంచి నేటివరకు హిందీ సాహిత్యరంగంలో ఆధునిక యుగ మని చెప్పవచ్చు.

1902 లో VII జార్జిరాజు పట్టాభిషేకం.

1902 మంగపట్నం (కడప జిల్లా) వద్ద వరదల మూలకంగా ఘోరమైన రైలు ప్రమాదం జరిగింది.

1902 లో విశాఖపట్టణంలో వైద్యకళాశాల స్థాపించారు

1902 లో ఆంధ్రదేశంలోని గుంటూరు జిల్లాలో సంఘసంస్కరణ పరంగా వితంతు వివాహం జరిగింది.

1902 లో కృష్ణా పత్రిక ప్రారంభం.

1903 గాంధీ ప్రథమ జైలు యాత్ర.

1903 లో కడపజిల్లాలో వరదలు వచ్చాయి.

1903 స్వీడన్‌లో బాంబు తయారు చేయబడింది.

1903 లో అమెరికాలో విమానం తయారు చేశారు.

1904 లో బొంబాయిలో ప్రిన్స్ ఆఫ్ వేల్స్ మ్యూజియంను నెల కొల్పాలనే ఆలోచన కలిగింది. శ్రీకలంభాయి ఇబ్రహీంషా లాంటి ఉదార పోషకులు యిచ్చిన విరాళాలతో యీ మ్యూజియం 1914 లో స్థాపించ బడింది.

1904 వీరేశలింగంగారి పుస్తక భాండాగారం స్థాపించబడింది.

1904 లో బ్లేడును అమెరికాలో తయారుచేశారు.

1904 లో హనుమకొండలో (వరంగల్) రాజరాజనరేంద్ర ఆంధ్రభాషా నిలయం స్థాపించబడింది.

1905 లో ఉత్తర భారతదేశంలో గొప్ప భూకంపం కల్గింది.

1905: మెకంజీ స్కీము (తుంగభద్ర వగైరాలకు సంబంధించి) తయారు చేయబడింది.

1905 లో ముల్కరాజ్ ఆనంద్ జననం. (పెషావర్) సుప్రసిద్ధ ఆధునిక నవలా రచయిత

1905 ఏప్రిల్ 4 తే॥ కాంగ్రా భూకంపం దాదాపు 20 వేల మంది ప్రాణనష్టం సంభవించింది.

1905 లో కర్జను బంగాళా రాష్ట్రాన్ని రెండుగా విభజించివేశాడు. ఫలితంగా దేశంలో ప్రతికూలోద్యామం విజృంభించగా 1911 లో తిరిగి బెంగాల్ విభజనను రద్దుచేశారు.

1906 లో గాంధీ ట్రాన్సువాలు (దక్షిణాఫ్రికా) సత్యాగ్రహం జావా యుద్ధంలో సేవలు చేయటము లండనుయాత్ర.

1906 లో ముస్లింలీగ్ స్థాపించబడింది.

1906 కలకత్తా కాంగ్రెస్‌లో స్వయం పరిపాలనకొరకు తీర్మానం చేయబడింది.

1906 విజ్ఞాన చంద్రికా గ్రంధమండలి స్థాపన.

1907 లో బిపిన చంద్రపాల్ ఆంధ్రదేశ పర్యటనకు వచ్చారు.

1907 లో గాంధీ ప్రాక్టీసుకు తిలాంజలు లిచ్చారు.

1903 జులై బాల గంగాధరతిలక్ అరెస్టు.

1908 లో బొంబాయినుంచి ఆంధ్ర పత్రిక ప్రారంభించ బడింది.

1908 జులై 22 వ తేదీరాత్రి పదకొండు గంటలకు తిలక్ కేసులో జడ్జి చెప్పినతీర్పుకు వ్యతిరేకంగా బొంబాయి కార్మికులు 23 తే॥ నుండి 28 తేదీవరకు ఆరు రోజులు సమ్మె చేశారు యీ సందర్భంలో సాయుధ మిలటరీకీ ప్రజలకు సంఘర్షణలు జరిగాయి కాల్పులలో ప్రజలు చనిపోయారు

1908 బెంగాల్ ముజఫర్‌పూర్ జిల్లా కలెక్టరు కింగ్స్‌ఫర్డ్‌ను హత్య చేయాలనే తలంపుతో, ఖుదీరాంబోసు అను 17 ఏండ్ల యువకుడు నాటు బాంబును ప్రయోగించగా కింగ్స్‌ఫర్డ్ జీవించి మరి యిద్దరు చనిపోయారు ప్రభుత్వం ఖుదీరాంను ఉరితీసింది.

1909 గాంధీ ఇంగ్లండుకు రాయబారం వెళ్లటం మింటోమార్లే సంస్కరణలు.

1909 లండన్‌లో వినాయక సావర్కార్‌చే నిర్వహింపబడే భారత భవనమను విప్లవ సంస్థకుచెందిన మదనలాల్ డింగ్రా అను పంజాబీ యువకుడు జహాంగీర్ హాలులో ఆంగ్లేయుల సభకు ప్రేక్షకుడుగా వెళ్లి సర్ కర్జనువిల్లీ అను బ్రిటిష్ గూఢచారి నాయకున్ని రివాల్వర్‌తో కాల్చి చంపగా మదనలాల్‌ను ఉరితీశారు.

1909 ప్రాంతంలో కలియుగ భీమఅను బిరుదాంకితుడైన కోడి రామమూర్తి తన 28 వ ఏట యూరోప్‌లో పర్యటించి ఒకేతూరి రెండుకార్లను ఆపటం ఏనుగును పైకెత్తటం ముష్టియుద్ధాలలోకూడా సాటిలేదనిపించుకున్న మేటి ఆంధ్రుడు.

1910 లో హైలీసు తోకచుక్క ఆగుపించింది.

1910 లో VII ఎడ్‌వర్డ్ మరణం.

1910 ఆంధ్ర యిన్సూరెన్సు కంపెనీ స్థాపన.

1910లో వంగీయ సాహిత్య పరిషత్ ఒకమ్యూజియంను నెలకొల్పింది.

1911 విజయవాడలో రామమోహన గ్రంథాలయ స్థాపన.

1911 అయిదవ జార్జిరాజు ఢిల్లీలో పట్టాభిషేక మహోత్సవం.

1912 లో ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం ప్రచురించేందుకు ప్రారంభం చేయబడింది.

1912 లో ముస్లింలీగు లక్నోసమావేశంలో "స్వయంపాలన" తీర్మాణం చేసింది.

1913 మే 19 తేll నీలం సంజీవరెడ్డి జననం. 1940 సత్యాగ్రహంలో జైలుకెల్లారు 1945 లో విడుదలై ఆంధ్రకాంగ్రెసు కమిటీకి కార్యదర్శిగా ఎన్నుకోనబడ్డాడు. 1948–6–13 లో చీరాలలో కాంగ్రెస్ అధ్యక్ష పదవికి రంగాతో పోటీచేసి ఓడిపోయాడు. 1949 లో మంత్రిపదవి 1951–4–11న ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్ష పదవి 1956–11–1 న ఆంధ్రప్రదేశ్ తొలి ముఖ్యమంత్రిగా చేయబడ్డాడు.

1913 సర్ బి. ఎన్. శర్మగారి అధ్యక్షతన గుంటూరుజిల్లా బాపట్లలో ప్రథమాంధ్ర మహాసభజరిగింది. 1914 లో న్యాపతి సుబ్బారావుగారి అధ్యక్షతన విజయవాడలో రెండవ మహాసభ 1915 లో కాకినాడలో మూడవ ఆంధ్రమహాసభా జరిగాయి కాకినాడలో ప్రత్యేకాంధ్రరాష్ట్ర తీర్మాణం ఏకగ్రీవంగా ఆమోదించబడింది.

1914 లో ఆంధ్రపత్రిక దినపత్రికగా మద్రాసునుంచి వెలువడింది.

1914 ఆంధ్రదేశ గ్రంధాళయ స్థాపన.

1914 రఘుపతి వెంకటయ్యనాయుడుగారిచే చెన్నపురిలో ఫర్మినెంటు సినిమా థయేటరు నిర్మాణం జరిగింది.

1914 సె॥ 22 తే॥ జర్మన్ ఎమ్డన్ ఓడ మద్రాసు పట్టణానికి నష్టాన్ని కల్గించుట.

1914 ఆగ॥ 1 తే॥ ప్రథమ ప్రపంచ సంగ్రామం ప్రారంభమయింది 1918 నవంబర్ 4 తే॥ యుద్ధవిరామపు ఒడంబడికజరిగి సంతకాలు జరిగాయి యీ యుద్ధంలోపాల్గొన్న దేశాలు (1) రష్యా (2) ఫ్రాన్స్ (3) బ్రిటన్ (4) ఇటలీ (5) అమెరికా (6) జపాను (7) రుమేనియా (8) సెర్బియా (9) బెల్జియం (10) గ్రీకు (11) పోర్చుగల్ (12) మాంటినీ శత్రురాజ్యాలు ఆష్ట్రియా హంగరీ టర్కీ బల్గేరియా.

1915 నవంబర్ 30 తే॥ మహాకవి గురజాడ నిర్యాణం.

1916 జూన్ 7 తే॥ వినోబాజీ కొచరాజీ ఆశ్రమ ప్రవేశం చేశాడు

1917 గాంధీ చంపారణ సత్యాగ్రహం చేయుట.

1917 నెల్లూరులో అయిదవ ఆంధ్ర మహాసభ జరిగింది.

1917 కలకత్తా కాంగ్రెస్‌లో అంధ్రరాష్ట్ర కాంగ్రెస్ కమిటీ నిర్మాణానికిగాను తీర్మాణం చేయబడింది.

1917 భండార్కార్ ఓరియంటల్ పరిశోధనా సంస్థను పూనాలో స్థాపించడం జరిగింది.

1917 నవంబర్ 7 తే॥ రష్యాలో అక్టోబర్ సోషలిస్టు విప్లవం జరిగింది

1927 లో దక్షిణ భారత హిందీ ప్రచారసభ స్థాపించబడింది. గాంధీ యీ సభకు యావజ్జీవిత అధ్యక్ష పదవినిస్వీకరించాడు. 1946 జనవరి లో యీసభ రజతోత్సవాన్ని జరుపుకొంది.

1918 లో దేశంలో విషజ్వరం బహుళంగా వ్యాపించింది.

1919 రౌలటు చట్టం పుట్టుక పంజాబు దుర్ఘటన.

1919 లో వీరేశలింగంగారి నిర్యాణం.

1919 లో కలకత్తానుండి ఢిల్లీకి రాజధాని మార్చబడింది.

1919 మాంటేగ్ చమ్సఫర్డ్ సంస్కరణలు.

1919 మోతీలాల్ నెహ్రూ అధ్యక్షతన అమృతసర్ కాంగ్రెస్ జరిగింది

1919 ఏప్రిల్ 13 జలియన్‌వాలా బాగ్ హత్యాకాండ.

1919 లో రామకృష్ణదాస కృషివల్ల బనారెస్ లలితకళా కేంద్రమైన భారత్ కళా భవనం. స్థాపించబడింది.

1920 లో ఆంధ్రకు ప్రత్యేక కాంగ్రెస్ కమిటీ ఏర్పాటు చేయబడింది

1920 లో హనుమంతరావుగారి నాయకత్వాన తెలంగాణాలో ఆంధ్ర జనసంఘం స్థాపించబడింది.

1920 లో భాషారాష్ట్ర పునాదిపై కాంగ్రెసు పునర్నిర్మాణం జరగింది.

1920 అఖిలభారత ట్రేడుయూనియన్ కాంగ్రెసు పుట్టుక.

1920 నానారాజ్యసమితి స్థాపన.

1920 లో జాతీయ పోరాటోద్యమము (కాంగ్రెస్) సహాయ నిరాకరణకు పిలుపిచ్చింది ఆలీ సోదరుల నాయకత్వాన ప్రారంభమైన ఖిలాఫత్ ఉద్యమం యీ సహాయ నిరాకరణోద్యమానికి చేయూతనిచ్చింది.

1921 లో దుగ్గిరాల గోపాల కృష్ణయ్యగారిచే చీరాల పేరాల పోరాటం నడుపబడింది.

1921 పల్నాడు పన్నుల నిరాకరణోద్యమంలో వీర హనుమంతును బ్రిటిష్ సైన్యాలు కాల్చి చంపాయి.

1921 ప్రిన్స్ఆఫ్ వేల్స్ భారతదేశ పర్యటనలో నిరసన ప్రదర్శనలు జరుపబడ్డాయి.

1921 లో మోప్లా తిరుగుబాటులో మలబారు మోప్లాలనిపిలువబడే మహమ్మదీయ రైతాంగం జమిందార్లమీద సాయుధ తిరుగుబాటు చేశారు జమీందార్లకు రక్షణగా ప్రభుత్వం గూర్ఖాసైనికుల్ని పంపింది. రైతులకూ సాయుధసైనికులకు అనేకచోట్ల పోరాటాలు జరిగాయి రైతులు పోలీసు స్టేషన్లను తగులబెట్టి ఆయుధాలను స్వాధీనం చేసుకొన్నారు ఉత్తర మలబార్ అంతా 10 రోజులు రైతురాజ్యం వెలిసింది ఒకచోట పదివేలమంది రైతులు పోరాటంచేసి 500 మంది చనిపోయారు యీ పోరాటాలు రెండు సంవత్సరాలవరకు అడపా దడపా జరుగుతూనే ఉన్నాయి.

1921 లో భారతదేశంలో మొత్తం 896 సమ్మెలు జరిగాయి 1922 లో 278 సమ్మెలు

1922 లో చౌరీ చౌరా అల్లర్లు జరగటంతో సత్యాగ్రహం నిలుపుదల. గాంధీకి శిక్ష. యరవాడ జైలు యాత్ర.

1922 హైదరాబాదులో స్టేటురిఫారమ్స్ అసోషియేషన్ స్థాపన.

1922 జనవరిలో సీతారామరాజు వొమ్మంగి (తెలంగాణా) స్టేషన్‌పై దాడిచేసి ఖైదులోవున్న వీరయ్య దొరను విడుదలచేశాడు. అనంతరం వీరయ్య గంటం దొర మల్లుదొరలు సీతారామరాజు తిరుగుబాటులో సేనానాయకులుగా పనిచేశారు.

1923 ఆంధ్ర బ్యాంకు స్థాపన.

1923 లో కాకినాడలో (ఆంధ్రలో మొదటిసారి) అఖిలభారత కాంగ్రెస్ సమావేశం జరిగింది.

1923 భారతదేశంలో పాడి పరిశోధన సంస్థను స్థాపించారు.

1923 లో చరిత్రలోకల్లా గొప్ప భూకంపం టోకియో యోకహామా (జపాను) నగరాలను యితర పట్టణాలను నేలమట్టం చేసి 99000 మంది ప్రజలను నాశనం చేసింది.

1924 లో హిందూ ముస్లిం కలహాలు సాంఘిక మైత్రికై గాంధీ 21 రోజులు ఉపవాసం చేశాడు.

1924 కార్మిక నష్టపరిహార చట్టం.

1924 కాన్పూరు కుట్రకేసు.

1924 జనవరి 21 లెనిన్ (రష్యా) నిర్యాణం.

1924 లో కడపజిల్లా ప్రొద్దుటూరు మొహరం అల్లరులు.

1924 లో కావేరీ తదితర దక్షిణాదిన వరదలు.

1924 లో విశ్వకవి రవీంద్రుడు చైనా పర్యటన.

1924 లో బొంబాయి జౌళి కార్మికులు 160000 మంది 2½ నెలలు సమ్మె చేశారు.

1925 లో 1, 60, 000 మంది బొంబాయి కార్మికులు వేలాది నార్త్ వెస్ట్ కార్మికులు సమ్మెలు చేశారు.

1926 ఆంధ్ర విశ్వవిద్యాలయ ప్రతిష్ఠాపన.

1926 లో సైమన్ కమీషన్ రాకకు నిరసన ప్రదర్శనలు.

1926 లో నాగార్జున కొండవద్ద ప్రప్రథమంగా శిల్పాలను కనుగొన్నారు. మద్రాసు పురావస్తు తత్వశాఖ సూపరింటెండెంటుకు తెలుగు అసిస్టెంటుగా ఉండిన శ్రీసరస్వతి గారు యీపని కొనసాగించారు.

1927 ఆంధ్ర నాటకకళా పరిషత్తు స్థాపించబడింది.

1927 భారతి మాసపత్రిక ప్రారంభించబడింది.

1927 స్టేటుకౌన్సిల్‌లో వేమవరపు రామదాసుగారిచే ఆంధ్రరాష్ట్ర తీర్మాన ప్రతిపాదన చేయబడింది.

1928 లో గాంధీ బార్డోలీ సత్యాగ్రహం.

1928 హిందూస్థాన్ సోషలిస్టు రిపబ్లికన్ అసోషియేషన్ స్థాపన యింతకుముందు దీనిని హిందూస్థాన్ రిపబ్లికన్ అసోషియేషన్ అని మాత్రమే పిలిచేవారు. దీని నిర్మాతలు యుపి బెంగాల్‌కు చెందిన జోగేశ్ ఛటర్జీ శచీన్ సెన్యాల్ రామప్రసాద్ బిస్మల్ చంద్రశేఖర్ ఆజాద్ వగైరాలు భగత్ సింగ్, చంద్రశేఖర ఆజాద్‌లు దీనికి నాయకులు.

1928 లో మొత్తం 200 సమ్మెలలో అయిదులక్షులమంది పాల్గొన్నారు. భారతకార్మికోద్యమం యీ సంవత్సరం కమ్యూనిష్టుపార్టీ క్రిందికి పోయింది.

1928 మీరట్ కుట్రకేసు ముఖ్య కమ్యూనిష్టు నాయకుల్ని ట్రేడు యూనియన్ నాయకుల్ని 33 మందిమీద కేసు చార్జి పెట్టబడింది. బ్రిటిష్ ప్రభుత్వాన్ని సాయుధ విప్లవంద్వారా కూలదోసే ప్రయత్నం చేశారని నిందారోపణ.

1929 లో పోలవరంవద్ద ప్రాజెక్టు నిర్మాణానికి ప్రారంభం

1929 లో లాహోర్ కాంగ్రెస్‌లో సంపూర్ణ స్వాతంత్ర్యతీర్మాణం చేయబడింది.

1929 భారతవ్యవసాయ పరిశోధక సంస్థస్థాపించబడింది

1930 గాంధీ స్వాతంత్ర్యదీక్ష. దండి ఉప్పుసత్యాగ్రహం.

1930 లో జోగిపేటలో మొదటి తెలంగాణా ఆంధ్ర మహాసభ జరిగింది.

1930 లో హెచ్. యమ్. రెడ్డిగారి తొలితెలుగుచిత్రం తీయబడింది

1930 లో ఆంధ్ర విశ్వవిద్యాలయం బెజవాడనుంచి వాల్తేరుకు మార్చబడింది.

1930 శాసన ధిక్కరణోద్యమం మొదటి రౌండుటేబిల్ సమావేశం

1930 లో నేషనల్ ఎకాడమీ ఆఫ్ సైన్సెస్ పుట్టుక.

1930 పెషావర్‌లో ఘూర్వాల్ సైనికులు ప్రజలపై కాల్పులు కాల్చేందుకు నిరాకరించగా బ్రిటిష్ ఉద్యోగులే కాల్చి మొత్తం 200 మందిని చంపారు.

1931 ఆర్థిక సంక్షోభం.

1931 కరాచీ కాంగ్రెస్‌లో ప్రాథమిక హక్కుల తీర్మాణం మార్చి 4 తేదీన గాంధీ ఇర్విన్ ఒడంబడిక.

1932 లో దేవరకొండ లోద్వితీయ తెలంగాణా ఆంధ్ర మహాసభ జరిగింది.

1932 లో గాంధీ నిరశన వ్రతము పూనా ఒడంబడిక జరిగాయి సెప్టంబర్‌లో సహాయ నిరాకరణోద్యమం ప్రారంభించ బడింది.

1933 గాంధీ ఉపవాసాలు హరిజన సేవాసంఘ స్థాపన దేశ సంచారం హరిజన పత్రికా స్థాపన.

1933 లో తొలిద్వితీయ రైతు యాత్రలు.

1933 మీరట్ కుట్రకేసులో కమ్యూనిస్టు నాయకులకు శిక్షలు విధించబడినాయి.

1934 లో ఆంధ్రలో కమ్యూనిస్టు కాంగ్రెస్ సోషలిష్టు పార్టీల పుట్టుక. కమ్యూనిస్టు పార్టీ పై దేశ వ్యాపిత నిషేధం.

1943 లో ఖమ్మంలో తృతీయ తెలంగాణా ఆంధ్ర మహాసభ జరిగింది

1934 సత్యాగ్రహోద్యమాన్ని ఆపుజేస్తూ పాట్నాలో ఏ. ఐ. సి. సి. తీర్మాణం చేసింది.

1934 జనవరి 15 తేదిన బీహారులో గొప్ప భూకంపం.

1934 లో శ్యామం ఖుస్కీ-సిస్తు ముజరా యివ్వబడింది.

1935 లో కాకినాడలో ప్రధమాంధ్ర కమ్యూనిస్టు మహాసభ జరిగింది

1935 సిరిసిల్లాలో నాల్గవ తెలంగాణా ఆంధ్ర మహాసభ నిబంధనావళి తయారు చేయబడింది.

1935 రిజర్వు బ్యాంక్ ఆఫ్ ఇండియా స్థాపన.

1935 ప్రప్రధమంగా స్త్రీలకు ఓటింగు హక్కు ఏర్పడింది.

1935 లో బర్మా భారత దేశంనుండి వేరుచేయబడింది. బీహారు రాష్ట్ర నిర్మాణం.

1935 లో 7 వ కమ్యూనిష్టు అంతర్జాతీయ మహాసభ.

1935 మే 31 తే|| క్వెట్టా భూకంపం.

1935 అయిదవ జార్జిరాజు రజతోత్సవం.

1936 లో గాంధీ సేవాగ్రామ స్థాపన లక్నోలో అఖిలభారతకిసాన్ సభ స్థాపన.

1936 సింధు ఒరిస్సా రాష్ట్రాల నిర్మాణం.

1936 లో మెట్టూరువద్ద కావేరికి ఆనకట్ట కట్టుట.

1936 అయిదవ జార్జిరాజు మరణం.

1936 లో బెలూచిస్థానలో గొప్ప భూకంపం.

1937 శ్రీబాగ్ ఒడంబడిక జరిగింది.

1937 ఆంధ్ర ప్రభ దిన పత్రిక సోషలిస్టు వారపత్రిక నవశక్తి ప్రారంభం.

1937 లో ఏప్రిల్ 1 తే॥ ఆంధ్రలో శాసన సభలకు ఎన్నికలు జరిగాయి. రాష్ట్రరైతు రక్షణయాత్ర (ఆంధ్ర) మద్రాసులో కాంగ్రెస్ మంత్రివర్గ నిర్మాణం రాజగోపాలాచారి ద్వారా జరిగింది. (ఏప్రిల్ 1)

1937 కాశీ పట్నపు రైతు పోరాటం.

1937 లో హైదరాబాదు సంస్థానంలో బాధ్యతాయుత ప్రభుత్వం కొరకు జాతీయవాదుల నినాదం.

1937 ఆంధ్రలో నిర్మాణ యుతమైన విద్యార్థి ఉద్యమం ప్రారంభ మయింది.

1938 స్టేటు కాంగ్రెసుచే సత్యాగ్రహం ప్రారంభం మద్రాసు శాసన సభలో కొండా వెంకటప్పయ్యగారిచే ఆంధ్రరాష్ట్ర తీర్మాణ ప్రతిపాదన.

1938 ఉస్మానియా విశ్వవిద్యాలయంలో సమ్మె.

1938 కాశీనాథుని నాగేశ్వరరావుగారి నిర్యాణం.

1938 ఆంధ్రరాష్ట్ర నిర్మాణాన్ని బలపరుస్తూ సర్ రాధాక్రిష్ణనకు గాంధీ లేఖ.

1938 హిట్లరు ఆష్ట్రియా ఆక్రమణ జెకోస్లావేకియాను హిట్లరుకు ధారాదత్తం చేయుట.

1938 భారతపరిపూర్ణస్వాతంత్ర్యం బ్రిటిష్ పార్లమెంటుచే ఆమోదం.

1939 గాంధీ సుభాసు చంద్రబోసుల మధ్య విభేదాలు. గాంధీ రాజకోటలో ఉపవాసం అక్టోబర్ 11 తే॥ కాంగ్రెస్ మంత్రివర్గాల రాజీనామా.

1939 యుద్ధానికి వ్యతిరేకంగా బొంబాయి కార్మికులు 90 వేల మంది రాజకీయ సమ్మె చేశారు.

1939 జూన్‌లో బెజవాడలో జాతీయ కమ్యూనిష్టు మహాసభ జరిగింది

1939 సెప్టంబర్ 1 తే॥ రెండవ ప్రపంచ మహాయుద్ధం ప్రారంభం అదే తేదిన ఇంగ్లండు ఫ్రాన్సు పోలెండ్ లపై హిట్లరు దండయాత్ర.

1940 పాకిస్తాన్ కొరకు లాహోరులో ముస్లింలీగు తీర్మానం చేసింది

1940 వ్యక్తి సత్యాగ్రహంలో వినోభా భావే ప్రధమంగా సత్యాగ్రహం చేశాడు.

1940 జూన్ 10 తే॥ ఫ్రాన్సుపై ఇటలీ దాడిచేసింది. 21 తేదికి ఫ్రాన్సు లొంగిపోయింది.

1941 రవీంద్రనాథఠాకూరు అస్తమయం.

1941 ఆంధ్ర సర్వస్వం ప్రకటన.

1941 జూన్ 22 తే॥ సోవియట్ యూనియన్‌పై హిట్లరు దండయాత్ర కాకినాడ విశాఖపట్టణాలవద్ద జపాను బాంబులు వేయుట.

1941 డిశంబర్ 7 తే॥ జపాను బ్రిటన్ అమెరికాలపై దాడిచేసి పెర్ల్‌హార్బర్‌ను ముట్టడించింది. డిశంబర్ 7 తే॥ హాంకాంగ్ పతనం.

1941 నుంచీ బెంగాలు క్షామం 2 లక్షలమంది మరణం.

1942 కాంగ్రెస్ క్విట్‌యిండియా తీర్మాణం. గాంధీ వగైరాల అరెస్టు దేశంలో విప్లవాత్మక చర్యలు సర్కారు నిరంకుశచర్యలు.

1942 ఫిబ్రవరి 15 తే॥ సింగపూరు పతనం. మార్చి 8 తే॥ రంగూన్ పతనం. ఏప్రిల్ 6 తే ॥ విశాఖపట్టణం కాకినాడలపై జపాను విమానదాడి డిశంబర్ 20 తే॥ లకత్తాపై కవిమానదాడి.

1943 గాంధీ 21 రోజుల ఉపవాసం.

1943 మే అఖిల భారత కమ్యూనిష్టుపార్టీ ప్రథమ కాంగ్రెసు బొంబాయిలో జరిగింది.

1943 అక్టోబర్ జపాన్ మద్రాసుపై బాంబు వేసింది.

1944 కస్తూరిబాయి (గాంధి ధర్మపత్ని) మరణం.

1944 ఆంధ్రరాష్ట్ర మహిళాసంఘ స్థాపన జరిగింది.

1944 లో పెన్సిలిన్ (యింజక్సన్) యింగ్లాండులో తయారు చేయబడింది.

1945 ప్రజాశక్తి దినపత్రిక ప్రారంభం.

1945 తెలంగాణాలో నైజాం దేశముఖ్ వ్యతిరేకపోరాటప్రారంభం మిలిటరీకి వ్యతిరేకంగా బాలేముల పోరాటం.

1945 లో కలకత్తాలో ఐ. యన్. ఏ. (యిండియా నేషనల్ ఆర్మీ) విడుదలకొరకు ప్రదర్శనాలు.

1945 సెప్టంబర్ 3 తే॥ రెండవ ప్రపంచ యుద్ధంలో జపాను ఓటమి

1945 అక్టోబర్ 3 తే॥ ప్రపంచ కార్మిక సమాఖ్య పుట్టుక.

1945 నవంబర్ 24 తే॥ మిత్రరాజ్య సమితి స్థాపన.

1945 హిరోషిమా నాగసాకిల (జపాను) పై అమెరికాచే ఆటం బాంబు ప్రయోగం.

1945 ఆగష్టు 18 తే॥ సుభాసు చంద్రబోసు మరణం. (తైపేలో ఒక విమాన ప్రమాదంలో మరణించినట్లు నిర్ధారణ చేయబడింది.

1945 మే 7 తే॥ జర్మనీ రష్యా రెడార్మీ సైన్యం చేతుల్లో పతనం చెందింది.

1946 లో ఆంధ్రరాష్ట్రంలో మునిసిపల్ కార్మికులు దేశవ్యాపితంగా సమ్మె చేశారు.

1946 లో రెండవతూరి శాసనసభలకు ఎన్నికలు జరిగాయి.

1946 రాజ్యాంగ పరిషత్తు ప్రథమ సమావేశం.

1946 భారత నౌకాదళం బొంబాయిలో తిరుగుబాటు చేసిన సందర్భంగా కాల్పులు 200 మంది పౌరులు బలికావటం జరిగింది.

1946 డోగ్రాపరిపాలన అంతంకావాలని కాశ్మీర్ ప్రజా పోరాటం

1946 బెంగాలు తెభాగా ఉద్యమం

1946 కాంగ్రెస్ కేంద్రప్రభుత్వంలో ప్రవేశించుట.

1946 జులై 4 తే॥ తెలంగాణా రైతాంగ ప్రతిఘటనోద్యమం ప్రారంభం కడవెండిలో అమరయ్య హత్య.

1946 నవంబర్ 26 ఆజాద్ హింద్ ఫౌజు విడుదలకై సమ్మె.

1947 గాంధీ మౌంటుబాటనుతో సంభాషణలు పాకిస్థాన్ హిందూస్థాన్ లకై కృషి ఆగష్టులో మౌంటుబాటను అవార్డు.

1947 ఆంధ్రప్రభుత్వం (ప్రకాశం మంత్రివర్గం) కమ్యూనిస్టుపార్టీ పై నిషేదాన్ని చేస్తూ ఆర్డినెన్సు చేసింది.

1947 ఆంధ్రలో ప్రాథమికోపాధ్యాయ ఫెడరేషన్ పుట్టుక.

1947–48 తెలంగాణాలో 10 లక్షల ఎకరాల భూమిని రైతాంగానికి పంచటం జరిగింది.

1947 పాకిస్తాన్ ప్రథమ రాజ్యాంగ పరిషత్తు సమావేశం.

1947 వాయిలార్ పునప్రా పోరాటం (తిరువాన్కూర్ కొచ్చిన్)

1947 నవంబర్ 10 అంతర్జాతీయ యువజన సమాఖ్య పుట్టుక.

1947 డిసెంబర్ లో యన్. జి. ఓల సమ్మె.

1947 ఆగష్టు 15 తే॥ భారత స్వాతంత్ర్య దినోత్సవం.

1947–50 మధ్య కాలంలో పోలీసులు దేశం మొత్తంపైన 1982 తూర్లు కాల్పులుజరిపారు. 378 మంది చనిపోయారు 1C000 మంది గాయపడ్డారు 500J0 మందిని జైల్లలో పెట్టారు.

1947 జూన్ 25 తే॥ విజయలక్ష్మి పండిట్ భారత రాయబారిగా ప్రప్రథమంగా సోవియట్ యూనియన్ లో నియమించబడింది.

1948 విజయవాడలో రేడియో బ్రాడ్‌కాస్టింగ్ స్టేషన్ ప్రారంభించ బడింది.

1948 కమ్యూనిస్టు పార్టీపై కాంగ్రెస్ ప్రభుత్వం నిర్బంధ విధానాన్ని అమలుపరచింది.

1948 జనవరి బుద్ధవరంలో నాల్గవ ఆంధ్ర రాష్ట్ర కమ్యూనిస్టు పార్టీ మహాసభ జరిగింది.

1948 లో విశాఖపట్టణంలో నిర్మింపబడిన జలఉష ఓడకు ప్రారంభోత్సవం చేయబడింది.

1948 జనవరి 30 తే॥ ఉదయం గాంధీజీని ఘోడ్సే రివాల్వర్‌తో కాల్చి చంపాడు.

1948 థార్ కమిషన్ నియామకం.

1948 సెప్టంబర్ 18 తే॥ హైద్రాబాదు సంస్థానంపై పోలీసుచర్య

1948 కనీస వేతనాల నిర్ణయ చట్టం చేయబడింది.

1948 ఫిబ్రవరి కలకత్తాలో అఖిలభారత కమ్యూనిస్టుపార్టీ రెండవ కాంగ్రెసుసభ జరిగింది. పార్టీ పత్రిక పీపుల్స్‌వార్‌పై నిషేదం.

1949 జె. వి. పి. రిపోర్టు తయారు చేయబడింది.

1949 అసన్సాల్ (బెంగాల్) లో ప్రథమ రైల్వే ఇంజన్ల కర్మాగారం స్థాపించ బడింది.

1949 రాజ్యాంగ చట్టం తయారుచేయబడింది.

1949 ఏప్రిల్ 20 తే॥ ప్రథమ ప్రపంచశాంతి మహాసభ ప్యారిస్ (ప్రేగ్) లో జరిగింది.

1949 అక్టోబర్ 1 తే॥ చైనా ప్రజాప్రభుత్వ అవతరణం.

1950 దేశభక్త కొండా వెంకటప్పయ్యగారి నిర్యాణం.

1950 కడలూరి జైల్లో క॥ పార్టీ ఖైదీలపై కాల్పులు గాల్చగా నలుగురు మరణించారు.

1950 కళాప్రపూర్ణ చెళ్లపిల్ల వేంకటశాస్త్రీగారి నిర్యాణం.

1950 సేలం జైల్లో క|| పార్టీ ఖైదీలపై కాల్పులు కాల్చగా 22మంది మరణించారు.

1950 జనవరి భారతదేశం రిపబ్లిక్ గా ప్రకటన

1950 జూన్ 25 తే|| కొరియా యుద్ధం ప్రారంభించబడింది.

1950 ఆగష్టు 13 ఇండోచైనాలోని లాహోన్ రాష్ట్రీయ సమావేశం జరిగి కొత్త కేంద్ర ప్రభుత్వాన్ని ఎన్నుకొనటం. రాష్ట్రనిర్మాణ కార్య క్రమం తయారుచేయబడింది.

1950 ఆగష్టు 18 తే|| ప్రెశిడెంట్ రాజేంద్రప్రసాద్ ప్రకటన ననుసరించి దేశంలో ప్రత్యేక సౌకర్యాలు పొందడానికి అర్హతగల నిమ్న జాతులు (సెడ్యూల్డ్) వివిధరాష్ట్రాల్లో కలసి మొత్తం 804 జాతులున్నవి యింపలో పై తరగతి జాతులు కలవలేదు.

1951 పిబ్ర|| నూతన రాజ్యాంగాన్ననుసరించి రాష్ట్ర శాసన సభ లకు ఎన్నికలు జరిగాయి.

1951 నవంబర్ ప్రజాశక్తి వారపత్రిక ప్రారంభం.

1951 కమ్యూనిష్టుపార్టీ నాయకుల విడుదల

1951 మార్చి 11 తే|| యిండో చైనాలో వియత్‌నామ్ లాహోన్ సంయుక్త ప్రజా పోరాటం ఏకీకరణచేయుటం విజయపరంపర.

1951 ఏప్రిల్ 18 తే|| వినోబాజీ తెలంగాణాలోని పోచంపల్లిలో భూదానోద్యమం ప్రారంభించాడు. అక్కడ రామచంద్రారెడ్డిగారి ద్వారా వందఎకరాలు భూగ్రహణం ప్రధమంగా స్వీకరించటం జరిగింది.

1951 భారతదేశంలో విదేశమిషనరీల సంఖ్య 4683 యీ సంఖ్య స్వాతంత్ర్యం రాకపూర్వం 2271 మాత్రమే ఉండింది. స్వాతంత్ర్యానంతరం విపరీతంగా దిగుమతిఅయిన మిషనరీలు విదేశీ గూఢచారి ఏజంట్లుగా పనిచే శారనే విషయం అనంతరం వెల్లడిఅయింది.

1952 భారతదేశ బడ్జెటు 424–498 కోట్ల ఆదాయం 406–425 కోట్ల ఖర్చు అందులో ఒక్కమిలిటరీ ఖర్చుమాత్రమే 181 నుండి 198 కోట్లకు పెరిగింది.

1952 నవంబర్ 24 తే భారతదేశంలో అమెరికా ఫిల్ముల సంఖ్య 2226 బ్రిటన్ 668 సోవియట్ రష్యా 38 పాకిస్తాన్ 9 తదితర దేశాలవి 133

1952 భారతదేశంలో బ్రిటిష్ పెట్టుబడులు 470 మిలియన్ల పౌనులు మొత్తం విదేశ పెట్టుబడులు 618 కోట్లు.

1952 ఇంగ్లీషు మాజీ ఉద్యోగులకు పెన్షన్ 9–5 కోట్లు పెన్షన్ పొందే ఘరానా ఉద్యోగుల సంఖ్య 16–905

1952 అక్టోబర్ 19 తే|| పొట్టి శ్రీరాములు ఆంధ్రరాష్ట్రసిద్ధికై ప్రాయోపవేశ ప్రారంభం డిశెంబర్ 15 తే|| ఆత్మబలిదానం డిశెంబర్ 19 తే|| పార్లమెంటులో ఆంధ్రరాష్ట్రనిర్మాణంగూర్చి నెహ్రూ ప్రకటన

1952 జూన్ 22 తే|| విశాలాంధ్ర దిన పత్రిక ప్రారంభం.

1952 డిశెంబర్ డాక్టరు కిచ్లూకు స్టాలిన్ శాంతి బహుమానం.

1952 రాయలసీమలో భీకరక్షామం సంభవించి కరువు నివారణకై సోవియట్ యూనియన్ తదితర దేశాలనుంచి తిండి పదార్థాలు రొఖ్ఖం ఉచితంగా పంపబడ్డాయి.

1953 జనవరి 15 తే|| ఆంధ్రరాష్ట్ర విచారణాధికారిగా జస్టిస్ వాంఛూరిపోర్టు సమర్పణ జూన్ 5 తే|| తాత్కాలిక రాజధానిగా కర్నూలు నిర్ణయం మార్చి 25 తే|| ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి ప్రభుత్వనిర్ణయం.

1953 ఆగష్టు గోదావరి వరద బీభత్సం.

1953 జూన్ 8 తే|| తణుకులో 5 వ ఆంధ్ర కమ్యూనిస్టుపార్టీ మహాసభ జరుపబడింది.

1953 జూన్ మద్రాసు అసెంబ్లీలో రాజధాని మార్పుకై పెట్టిన సవరణ విజయం జూన్ 16 తే|| ఆంధ్రాస్పెషల్ ఆఫీసర్‌గా త్రివేది నియామకం.

1953 నవంబర్ 23 తే|| ఆంధ్ర అసెంబ్లీ తొలి సమావేశం.

1953 ఆంధ్రరాష్ట్ర బిల్లు ముసాయిదా ప్రతిపాదన మంత్రుల జీతాల బిల్లుపై ఆంధ్ర ప్రభుత్వ ఓటమి.

1953 కాశ్మీర్ ప్రభుత్వంనుంచి షేక్ అబ్దుల్లా బర్తరఫ్ అరెస్టు

1953 పెప్సూలో మొదటిసారి కాంగ్రెస్ మంత్రివర్గ ఓటమి ప్రెసిడెంట్ పరిపాలన.

1953 కేరళ కాంగ్రెసు మంత్రివర్గంపై విశ్వాస రాహిత్య తీర్మాణం నెగ్గింది.

1953 యుద్ధఖైదీల మార్పిడి సంఘం భారతదేశం నుంచి కొరియాకు చేరింది.

1953 కలకత్తా లక్నో విద్యార్థులపై పోలీసుల కాల్పులు.

1953 డిసెంబర్ మధురలో అఖిలభారత కమ్యూనిస్టుపార్టీ మూడవ కాంగ్రెసు జరిగింది.

1953 మార్చి కామ్రేడ్ స్టాలిన్ (రష్యా) అస్తమయం.

1953 మే 14 ఢిల్లీ ప్రజాసభలో వ్యవసాయ మంత్రి ప్రకటననుబట్టి యీ సంవత్సరం 26173000 మంది దేశంలో కరువుకు గురిఅయ్యారు.

1953 సెప్టంబర్ 26 తే॥ టోకియోకు 150 మైళ్ల దూరంలో గొప్ప భూకంపం సంభవించింది.

1953 అక్టోబర్ 1 కర్నూలు రాజధానిగా ఆంధ్రరాష్ట్రావతరణం జరిగింది.

1954 నవంబర్ 6 తే॥ ఆంధ్రశాసనసభలో అవిశ్వాస తీర్మాణం గెలుపు. ప్రభుత్వపతనం.

1954 జనవరి 24 తే॥ అర్ధరాత్రి బొంబాయి బట్టలమిల్లు కార్మికులపైన కాల్పులు కాల్చగా ఒకరు మరణించి 28 మంది గాయపడ్డారు. 27 తేదీకల్లా యీసమ్మె 3 లక్షలమందికి వ్యాపించింది.

1954 ఫిబ్రవరి 3 కుంభనగర్ వద్ద కుంభమేలా సందర్భంలో అల్లరివల్ల వెయ్యిమంది చనిపోవటము వెయ్యిమందికిపైగా గాయపడటము జరిగింది.

1954 ఆగష్టు 11 తే॥ ట్రావన్కూర్‌లో సోషలిస్టు ప్రభుత్వపు పోలీసులు అరవ ప్రజలపైన కాల్పులు కాల్చగా 11 మంది చనిపోయారు.

1954 సెప్టెంబర్ 19 తే॥ రాజస్థాన్‌లోని డూంగర్ జిల్లా గుమడా గ్రామంలో పోలీసులు కాల్పులు కాల్చగా రతన్ లాలాజీ అనే రైతులు మరణించారు. యిదేదినం మధ్యభారత్ లో పోలీసుల కాల్పులలో 6 గురు రైతులు మరణించారు.

1954 అక్టోబర్ 25 తే॥ గుజరాత్‌లోని మెహసాల్ జిల్లా చిత్రాడి పురిలో పోలీసులు కాల్చి యిద్దరిని చంపి అనేకమందిని గాయపరచారు. నవంబర్ 28 తే॥ జలపాయిగుడిటీ కార్మికులపైన బ్రిటిష్ కంపెనీసహాయ మేనేజరు 9 రౌండ్లు కాల్చగా చాలామంది గాయపడటం జరిగింది.

1954 డిసెంబర్ 25 తే॥ సూరత్ జిల్లా వేలాడ్ గ్రామంలో పోలీసులు కాల్పులు చేయగా 9 మంది చనిపోవటము అనేకమంది గాయపడటము జరిగింది.

1955 నవంబర్ 21 తే॥ బొంబాయిలో మహారాష్ట్రవాదులపైన పోలీసులు కాల్పులు కాల్చగా 14 మంది చనిపోవటము 300 మంది గాయపడటము 600 మందిని అరస్టు చేయటము జరిగింది.

1955 నవంబర్ 27 తే॥ హైదరాబాదు బోధన్ చెక్కెర ఫ్యాక్టరీ కార్మికులు సమ్మె సందర్భంలో పోలీసులు కాల్పులు కాల్చగా స్త్రీ కార్మికులు 11 మంది మరణించటము 230 మందికి తీవ్రమైన గాయాలు తగలటము జరిగింది.

1955 సం॥ డిశె 10-8-20 గం॥ నాగార్జునసాగర్ (నందికొండ) ప్రాజెక్టుకు భారతప్రధాన మంత్రి శ్రీ నెహ్రూ శంకుస్థాపన చేశాడు.

1955 జనవరి 31 తే॥ అజమగఢ్ జిల్లా మడూ అనే గ్రామంలో పోలీసులు కాల్పులు కాల్చగా యిద్దరికి ప్రమాదకరమైన గాయాలు తగిలాయి.

1955 ఆగష్టు 12–13 తే॥ పాట్నా విద్యార్థులపైన పోలీసులు కాల్పులు కాల్చగా దీనానాథ పాండేతోసహా 9 మంది చనిపోవటము అనేకమంది గాయపడటం జరిగింది.

1955 ఆగష్టు 15 తే॥ వాదామోకామా విద్యార్థులపైన కాల్పులు కాల్చగా 3 చనిపోయి చాలామంది గాయపడ్డారు.

1955 సెప్టంబర్ 11 తే॥ బీహార్‌లో ముజఫ్ఫర్‌పూర్ జిల్లా గోపీగంజ్‌లో రైతులపై కాల్పులు కాల్చగా యిద్దరు చనిపోయారు భాగల్‌పూర్ జిల్లా బిహామర్ గ్రామంలో రైతులపైన కాల్పులు కాల్చగా 6గురు రైతులు చనిపోవటం 21 మంది గాయపడటం జరిగింది.

1955 సెప్టంబర్ 13 తె॥ ఉడీసాలోని క్యోంజిర్ మాంగనీస్ గని కార్మికులపైన 18 రౌండ్లు కాల్పులు కాల్చగా 10 మంది చనిపోయారు.

1956 జనవరి 23 తే॥ మహారాష్ట్రనిర్మాణ సందర్భములో పోలీసులు మొత్తం 200 తూట్లు కాల్పులు కాల్చగా 71 మంది చనిపోవటము 550 మంది గాయపడటము జరిగింది.

1956 12–10 తే॥ నాగార్జున సాగర్ ఆనకట్టకు ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి నిర్మాణోత్సవాన్ని ప్రారంభం చేశాడు.

1956 నవంబర్ 1 తె॥ తెలంగాణాతో కలిసిన ఆంధ్రప్రదేశ్ అవతరించింది. నీలం సంజీవరెడ్డిగారు ముఖ్యమంత్రిగా 12 గురు మంత్రులతో, మంత్రివర్గం ఏర్పడింది.

1957 నవంబర్ 3 తె॥ 11–45 గం॥ ఉదయం రష్యా రెండవ ఉపగ్రహాన్ని అంతరిక్షంలోకి పంపించి దీని (స్పుట్నిక్) బరువు 1120–7 పౌనులు గంటకు 15173 మైళ్ల వేగంతో రోజుకు 14 భూప్రదక్షిణాలు చేస్తుంది 930 మైళ్ల ఎత్తున యిదిపరిభ్రమిస్తుంది.





శ్రీ బాలాజి ప్రింటింగ్ ప్రెస్, కడప.

## త్వరలో

రాజకీయ మతసాంఘిక విభేదాలతో నిమిత్తంలేక అందరి చేత ప్రశంసించబడిన 'సామాజిక పరిణామక్రమంలో భారత మహిళ' అను సశాస్త్రీయగ్రంథం పాతశీర్షికలకు అదనపు సమాచారాన్ని చేర్చుకొని అదనపు శీర్షికలతో వెలువడుచున్నది.

## భారత సమాజము

భారతదేశంలో ప్రాచీనకాలంనుంచీ సమాజం ఏపునాదుల పైన నడుపబడుతూ వచ్చినది. కాలానుగుణ్యాయిగా ధర్మాధర్మములు ఎలా? ఎందుకు? మార్పుచేయబడుతు వస్తున్నాయి. అదిగాగల విషయాలను శాస్త్రీయాధారాలపై నేటి దృక్పథంతో పరిశీలిస్తూ వ్రాయబడిన గ్రంథం.

శ్రీ బాలాజీ ప్రింటింగ్ ప్రెస్. కడప.



**మనసు ఫౌండేషన్**

**పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA108B197 |
| పుస్తకం పేరు | చారిత్రక కొలనూరు |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 185 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | C1, BC.., 176 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Nandini |
| పేజీలు విడదీసినది | Nandini |
| స్కాన్ చేసినది | thasin |
| పరీక్ష చేసినది | RUKSANA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |